శారత పరిధానకలితంబులైన
యుదుటు పాలిండ్లపై నొత్తి యూరార్చి

మొదఁ జేర్చిపయ్యెదయుంపుమైఁగప్పి
సూలోలగతినంక మూడించి కృష్ణు
ఱాలిబాడుచు కల్లరి దొంగతనము
తేలమాపని కింటిలోపలను
బాలేమి బ్రాతి దెప్పలఁగలవు
కాకపోకల నడిగాక యీకాకు
పోకిళ్లమూవాఁడు పోనేర్చునటవే
యనుడు గోపికలు సూనాస్త్రదీపికలు
మనముల లజ్జించి మగిడిరంతటను
తముఁదిట్టు శౌరియింతకుమున్ను మన్ను

నమలెఁబొమ్మని గోపనందనుల్పలుక
నేలమృత్తికఁ దింటివిప్పుడు నీకు
నాలుక పోలిక నాకింతఁ జూపు
మనుఁడు గృష్ణుఁడు వదనాబ్జంబుఁ దెఱువ
నినుపులై పొంగెడు నీరధుల్నిధులు
సురలు కిన్నరులు భూసురులు దిగ్వరులు
సరసిజాసన శీతశాతభానులును
గనుపట్టిబ్రమసి చెంగట నున్నచకిత
తనువల్లి తన తల్లి తన మాయ లోదవ
నేయెడ వీక్షింప నిట్టిది విష్ణు

మాయయోయిది కనుమాయయోయనుచుఁ
వొంటిచందమున నాతొలి మించుగంటి
చంటిడా పలఁ జేర్చ జలజ నేత్రుండు
పొదలఁ గొండలచెంతఁ బొదలుసింగంపుఁ
గొదమకై వడి మాతకు చముల నొరసి

ఆలీల సర్వేశుఁడయ్యెను బాలు
లీలఁ గృష్ణుఁడు తన లీలలు చూపె
ననవిని యానందుఁడైన గుర్వొడువ
జననాథుఁడో మానిజననాథుఁబలికె
కందర్పజనకుఁడేకతమునవ్యాస

నందన నందనందనుఁడయ్యె ననిన
మును ద్రోణుఁడను వసుముఖ్యుఁడొక్కరుఁడు
తనయాలితోఁ గూడఁ దనయానురక్తి
నిజతపోస్థాన నియతుల నుతుత
నీజుని మెప్పించి కాయజుతండ్రిబోలు
తనయునిమ్మనఁ బద్మతనయుఁడింకొక్క
జననంబు నంగల్గుఁ జనుఁడంచుఁ జనిన
నానందుఁడై యాతఁ డానందుడయ్యె
నానందసతియయ్యె నాతని దేవి
ధాతవరంబు సత్యము చేయధాత

తాతనందునికి నాత్మజుఁడయ్యెననుచు
నందగేహిని యొక్కనాఁడు జెట్టాడు
నందనుచరితమానందతం బాడి
దివినంతరపువోళ్లఁ దిరుగు బొమ్మరపు
గవరీతిఁ దతిదివ్యఁగాఁ జన్నులదరఁ
దరితాడు కేలికెందమ్మి కెంజాయ
తరుణార్కకిరణంబుఁ దలఁపించుచుండఁ
గంగణములు గలగల మ్రోయుచుండఁ
డంకంబు బటువు తాటంకంబులులుకు
నురగంబునుమియు మయూరంబు పోలె

నరజాఱుపూదండనలవదుకొప్పు
అల్లాడఁగౌననియాడసరులు

మల్లాడనలకలు మలసి చల్లాడ
దధిమథియించు నత్తఱి తరికాఁడు
మధువైరి చేరియమ్మాయంచుఁ బిలువ
సన్నమోవుల నిక్కఁ జప్పట్లు చఱచి
యన్నకృష్ణమ్మ మాయమ్మ రమ్మనుచుఁ
దనమోహాన పుటంక తలమునఁ జేర్చి
కొనివేడ్క శిరము మూర్కొని కేలనిమిరి
మొగులక్రిందటినింత మొనుపు మార్తాండు
పగిదిపయ్యెదనర వామకుచంబు
గ్రోలుచుఁ జేతఁగైకొనియున్న బాలు
బాలువొంగినఁ బీఁటపైఁ జెట్టియురుగఁ
జనుగ్రోలనీయ కచనుతల్లి మీఁది
కినుకవేఁగసరులఁ గెమ్మోమువియదర
వాఁడిమిమైమొములు వాడి చట్టునను
బాఁడియొబ్బిడిసేయు బానయుఁగొట్టి
యున్నతస్థలమున నున్నయావెన్న
కన్నవారలకిడి కబళించుచున్న
నానందుకులకాంతయరు దెంచి కాంచి
కానికాని పోదు గానిలెమ్మనుచు
యొఱపైన తనకేల నొకకోలఁబూని
తఱుమబిత్తరుము తత్తరము రెట్టింప
మాటిమాటికిఁ దల్లి మగికన్గొనుచు
కాటుక సటుయేడ్పు కన్నీరుజాఱ
రంజితగతిబెదరణదసమాన
మంజీరుఁడగుచు నమ్మను జీరికొనుచుఁ
బన్నీరుచిలికిన పద్మంబువోలె
చిన్నారివదనంబు చెమరింపుచుండఁ
జనువానివదనకంజము గాంచి కాంచి

గనయంబు వెడజాఱఁ గాఁగరద్వయము
కూడంగఁబట్టియా కొనెనంచుదూర
నాడకకొట్టఁజే యాడకయున్నఁ
బలుచని చెక్కులపై వెన్నరవలు
కలభోరుకటపద్మ కములననొప్ప
శరదపోతంబుమై శశికళపోలయు
సరవినిబొజ్జను జాఱలు నొఱయఁ
గుండలంబులుముద్దు గునియంగ శౌరి
దండంబువిడ కేలి దండంబు విడచి
కన్నవారద లింపఁగా వాడవిన్న

కన్నవారలు తిట్టఁగా సిగ్గు కాదె
పొలుకల్గినవారు పడుచని కొట్టఁ
జాలరుగానిట్లు సైరింతురన్న
యేలబుద్ధులుఁకల్గి యెఱుఁగనివాని
లీలనేమిటికి నీలీలఁ జేసెదవు
అనియెత్తికొనిచంకనలమి ముద్దాడి
మినమిన మనుచెక్కు మీఁటియాబోటి
యకలంకుఁడగు బాలునాత్మగేహమున
నొకచోటఁ బెనురోల నురిద్రాటఁబెనఁచి
కట్టఁబూనిననింత గడమైన నింట

గట్టిగాఁగలుగుపగ్గ ములనుగ్గముల
ముడుచవేమిడయా సముద్రుండు కట్టు
వడియనేమిటఁ బట్టువడని బ్రహ్మంబు
అంతనా కాంతగేహాంతరంబునకు
నెంతయుఁ బనిగల్గి యేఁగనేఁగుటయు
మలయుచుఁ గట్టుగంబముతోడనరుగు
కలభమోయననులూఖల మీడ్చికొనుచు

నరవిందనేత్రుఁడొయ్యనఁ బోయి బోయి
యరిదిముంగిటనుద్దులగు ముద్దులుండ
నాటోలుతరువుల కడ్డంబు వడఁగఁ

దూటికహతిపాద ధూళిబాపాళి
ధూళిగాఁవ్రేళ్లతోఁ దూటిభూస్థలిని
గాళిడిగాళిఁగక్కఁదలంగఁగూల
నక్షీణమూర్తులై యందుండివెడలి
యతుహత్యత్ముకాయత్ములే తెంచి
ఫాలసంగత హస్తపద్ములై భక్త
పాలుఁ గృపాళునాబాలు నీక్షించి
కృష్ణ కృష్ణాంబుదకృష్ణ యోగీంద్ర
జిష్ణుసేవితపాద జితసర్వఖేద
ధనదజులమువయోధన దర్పములను

మునునేము కైలాసముననుండువేళ
ననఁబోడుములయంగ నలతోఁడఁ జెంతఁ
జనుగంగ నొనరంగ జలకేళిసలుపఁ
బ్రచురవిద్యావిశారదుఁడు నారదుఁడు
నచటికే తెంచిన నబ్జాక్షులెల్ల
సిగ్గుతోఁ గట్టిరి చీరలేమెగ్గు
సిగ్గులెన్నకమదాంధితులమైయేము
సరసిరుహాసనాస్తనసక్తభావ
పరులమై యపగతాంబరులమైయచట
దరిగానకున్న యిద్దటి భవవార్ధి

దరిఁజేర్తుననుచు ముందటి కార్యమొన్ని
కకబింబరాకృతిగలమీరుజగతిఁ
గకుభంబులై గొంతకాలంబు చనఁగ
భక్తవత్సలు హరిపదధూళిశాప

ముక్తి తెయటమీఁద ముక్తులయ్యెదరు
అనుచుగీతముఁ బాడియరిగె నవ్మాని
వనజాక్షుమీఁద యవనజసంగమము
కలుగనందనక నిక్కఁడనుండముక్తి
గవిగెశాపవిముక్తి గఁ గుటయొంత
యనినలకూబరుండన మణిగ్రీవుఁ

డనఁగమాంపేరులో యఘాత్మయనుచు.
వలగొని మ్రొక్కియవ్వల గోచరించు
నెలవులకరిగిరి నృపవర్యులంత
ఆబాలగోపాల మాబాలుఁ జూడ
గాబాలుచేనంద కాయుండితనుచుఁ
జన్నిచ్చిమచ్చిక సందిట గ్రుచ్చి
చన్నిచ్చకొదవు మీఁగడ యిచ్చెనంతఁ
గరమొప్ప నెఱమంట్టి కావిపాలిండ్లు
సరివోరుజట్టుల సరవిబిట్టులుక
కఱుమాపుఁ బయ్యెదకొక చేరఁజుట్టి

చెఱఁగుడాపలిచెక్కఁ జెంత డాలింప
నకనకలాడు నెన్నడుముపైఁ జికిలి
పికిలిపూదండతుం పెసలాడుచుండఁ
దఱచుగాగంపలోతని బండ్లసరము
నెఱిదేఁటులకు విందునెఱవుచునుండఁ
గాయజుమదదంతిగతి నొప్పనొక్క
బోయతయాయతంబుగ నెఱంగత్తి
నెలదఁడుతావులు వెదజల్లుచుండు
ఫలములుగొనుకొండు బాలురరండు
అనివీధి వీధులనమ్మగో యమ్మ

యనిశౌరిచేరి పండ్లమ్మెదరనుచుఁ
బొసఁగదోయిలి చాఁచి పోసీకముద్దు

కొసరంగఁ గొసరంగఁ గొలుచు వెట్టినను
సరసిజమధ్యకే సరములపోల్కెఁ
గరపుడస్థలిలోనఁ గరమొప్పగొలుచు
పుడమిమైతల బ్రాలువోసినరీతి
వడివడంకుచుఁ బోవవసుధమై జింద
లోలుఁడై వాని విలోకించుచున్న
బాలులిష్టాబ్జ జంచాలు గోపాలుఁ
జూచిపండులుగొల్చు సురియగుగ్గెళ్లు

చూచునాయనిగతిఁ జూచెదేమిటికి
ననుచుబోయెత శితాయత కటాక్షంబు
లనుఁగుఁజిప్పల తెప్పలడ్డగింపఁగను
తనగంపలోపలద్దయుమెత్తి వింత
తనమింతలేక చెంతన యున్నహరికి
సమ్మతినొసఁగ శిష్టములెల్ల శోభి
తమ్ములై దివ్యరత్నములై యుండె
నొకటియనంతమేదొకటి మాధవుని
నకలంకమతి మర్త్యుఁడర్పించెనేని
గోవిందుఁడ పుడిది గోవిందులనుచు

నావలఁ దల్లి రమ్మనఁగ నాడుచును
బాలురతోఁగామ పాలుండుఁదాను
గోలలగతిఁ జిన్ని కోలలువట్టి
పాలబానలనిడఁ బాటించికాంచి
పాలపాపండాల పాలుఁద్రావెడిని
పొమ్మన్నఁ బోఁడెయిప్పుడు వచ్చెనమ్మ
రమ్మురమ్మనుచుఁ గరమ్ముఁ జీరుచును
గలకంఠ కంఠ హుంకారనాదములఁ
గలకంఠ ములక్షీరకంతువిద్దఱును
బలుకుచుముద్దునూపఁగఁ జూచిగోప

కులనాథుఁ డాగోపకుల నెల్లఁ బిలిచి
పూతనయ నేడునపూత చేతనయు
నే తెంచె హరిని మున్నే తగావించెఁ
గాకయప్పటి బండిగా విరక్కసుఁడు
పై కొన్నఁ గడతేరెఁ బద్మాక్షుకృపను
నీతఁడిశిశువు డోపిడ్చిన వృక్ష
పాతంబుగలిగెనుత్పాతంబుగాదె
మడువులు పసులకాల్మడినుప్పు పఱచె
దోడువుదొంగ్రులు కడు దూరంబులయ్యె
వీడుజోడాడెడు విటపిజాలముల

మోడులకై పోయె నోడులు నేయ
యీడల నీడల నెండలోకున్న
వాడిగువులు లాగవంతులు పొచ్చు
కాకము వ్వెట్టి కుంగాక ఘూకములు
చేకొన్న బొరియలు చీరుమూరాడు
కసుగందు గందని కసవుతొక్కెళ్ల
పసివాడె పసులెట్లు పసియించె నిచట
బృందారకానేక బృందావనంబు
బృందావనంబునిల్పుతననందనంబు
పాలింప చిలుక తుప్పాడు పన్నిపూరె

యాలపాలకు నేరిమై నట్టివాలి
కలిగియుండును బసిగలవారు ప్రజలు
కలవారునటుయుండగా నోపునంద్రము
మనమునెమ్మనమున మందలతోడ
నునికిఁ జేసిన నొప్పునొప్పమి లేదు
అనవల్లవీవల్ల వాదులుం బండ్లు

ప్ట. 6.

గొనకొనకుండెనల్ గొమ్ముకుండెనలు
చిట్టులు నుట్టులు చిక్కములెవ్వెన్న
చిట్టులుఁదొట్టుల చల్దిజాడీయలు
తరిత్రాళ్లు వల్లియత్రాళ్లు జల్లెడలు
నురిత్రాళ్లు పగ్గంబు లుగ్గంబులురులు
సెలకట్టెయలు బిల్లుచేపుమందులును
దలకోలలును విండ్లు తరికటంబులును
పంపరకవ్వముపల్పుడామెనలు
గంపలునొడిసెండ్లు గండగొడ్డండ్లు
పాటిమాడలు చిట్లపై వెన్నమూటి
కూటికుండలలోనఁ గుదురుగానునిచి
చలపమంచములు గంచములు కుంచములు
ములువాడికత్తులు మొదలుగానించి
గుజ్జులు గాకుండ గుజ్జులు గట్టి
మజ్జారెపడఁ బలు మాఱు రొప్పుచును
మందయానములన మందమోదములఁ
గలకంఠ వంచితకలకంఠనందు
పొలతుకహరిరాము బుజ్జగింపుచును
బయనంబుతఱిరండు పాలును బువ్వ
యన యంబునందొప్పుడందునో తండ్రి
పేరిన నెయి బువ్వ పెట్టెదఁ పసిండి
కోరదెకోర్కై కోర నామాట
యనిభుజింపఁగఁ బెట్టియంచులుగట్టి
తనరుచుండెడి చిత్రితడుప్పులు గట్టి
కైసేసివేడ్కఁ జంకలఁ నిడివారి
కైసేసియున్నట్టి యప్పంబులొసఁగి
సకలసన్నాహంబు చనుదేర నికట

శకటంబు రోహిణీసహితమై యెక్కి
యుబ్బిపగ్గములంత నుబ్బినందుఁడును
గబ్బిగిబ్బలను వేగమెరొప్పికొనుచు
ననుచుకందముల కందముల కుందముల
ఘనలవలంగముల లుంగములఁ దుంగములఁ
దరులకేలిశైల దరులనిర్ఝరుల
సరసకుంజములఁ గంజముల పుంజముల

లలితసాలములఁ గోలములను మాధ
వులనుమోవులను రావులను దావులను
గాళిభృంగాళితో గ్రాళిసూనాళి
దూళిమైఁబోలి మేధూళిమైఁదేవి
మించియెంతయు సంభ్రమించి రమించి
పంచబాణుని వెన్నుబలమై చలింపఁ
గమ్మవిల్తుఁడు దాడిగదలంగనెగయు
దుమ్ములోయనఁబు వుదుమ్ములు నెఱయ
వెడవిల్తు కత్తుల విరహిరక్తములు
వడియుజాడఁ జిగుళ్లు వడిదేనెలురుల

హరికృపాదృష్టిరేనగులింద్రుమవింటి
సరణిబికశ్రేణి చదలఁ జూపట్ట
బాలమారుత చలత్పర్ణరంభాఘ
మాలోలభోగగాళిఁ గేళింప
గగనఁబునొఱయు శాఖలు మోగగుత్తు
లగణింపఁ దాతల నురికింపుచుండఁ
గనకపునదిపిల్లకాలువనఁగ
ఘనచూతరములుద్కటములై నిగుడ
సతులమోవులఁ గ్రోలుసరసులుబోవె
లతలబింబములు చిల్కలు గ్రోలుచుండ

తరులక్ష్మిహాలికక్షతములిచ్చెననఁగఁ
గరకబీజములు శాఖలనొప్ప నొప్పు
సందీప్తసవనంబు సకలయోగీంద్ర
బృందైకభవనంబు బృందావనంబు
పరమాత్మగతిసర్వ ఫలదమైసిరులఁ
బెరసిచూపట్ట నాభీరనాయకుఁడు
చేరిమందలవారిఁ జేరికాళింది
వారిపొంతనె యెల్లవారిని నిలిపె
వనియనునిండు జవ్వనిదాల్చునామ
మనబండ్లు లర్ధచంద్రాకృతి విడియ

వారిచెంతనె వారివారికిఁ దగిన
చేరికల్గైకొని చిక్కనవారు
అదననందఱకిండ్లు లమరించికసవు
పొదలలే పొదలపైఁ బొదలఁగాఁ గప్పి
పట్టులతోలి దుంబట్టులగాగ
మట్టెన్నరాక నెమ్మదినుండువారు
వెలుగలుచొరకుండ వెలుగులువైచి
మలయునావులఁ జేల మరపెడువారు
పెనలఁ గోడియల గుంపెనలదామెనల
పెనదీర్చిగూటముల్బిగి యించువారు

దరులఁ జూపట్టెడు తరులబండించి
పరగునగుడిసెలు సవరిండువారు
కడుజిడ్డుదేలెడు కతలు గొల్లెతలు
నుడువ నాలించి వీనులవేల్చువారు
తఱచువెన్న మెఱుంగు దాఁకికన్నులకు
జిఱితలువారించు జిగిచన్నులదర
అరగవిసెనయూడ్చు నద్దంబుపోలె

పురిచుట్టుచెఱఁగు కపోలాగ్రమొరయఁ
జనుదోయివ్రేగున చాడెవేగునను
జినుగుకొనొక యింత జివ్వాడుచుండఁ

జల్లచల్లాయని చల్లఁగాఁ బలుకు
వెల్లవారలువిన నెలుఁగెత్తిచీరి
వెలగపండులతావి వెదచల్లుచల్ల
కలికిగుబ్బెతలమ్మఁగాఁ బిల్చువారు
అరిదిచేరువనొప్పు యమునతోఁయమున
కరిగెడువారునై యామందవారు
తలవరుల్ నెలవరుల్ తామెమ్మెయచట
చెలఁగుచుండిరి రాజశేఖరయంత
గోపబాలురతోడఁ గూడి యానంద
గోపబాలురుచిన్ని కుట్టెలఁ గావ

నెలవంకనాడు వన్నియ సందితాయా
తలదండగురిగింజ దండలింపొంద
గిరుకుజెప్పులను బర్గిడఁ బిల్లదొరలు
నెరుకుగాసియలు గ్రొన్నెలలవంకబొట్లు
చిక్కముల్ కాసుల చిక్కముల్ చలిది
చిక్కముల్ లిక్కులు జిక్కులుం దాల్చి
యలవి మీటినయట్టి యమునచెంగటను
గలపచ్చికలమచ్చికల నిల్పి నిల్పి
క్రేపులమేఁపుచోఁ గ్రేపురక్కసుఁడు
క్రేపురూపమున నాక్రేపులఁగూడి

చరియించుచును దముశెర మతిఁజూడఁ
దరిమిడికినిసియాతటివేల్పు పగతు
మన్మథజనకుఁడే మఱజూచిపట్టి
మన్మథతరుపుతో మడియంగవైవ

కీలల్లయని క్రేరిక్రేపుగాపరులు
కోలలు జీరలు గొంగళ్లు ద్రిప్పి
తెగడుచుఁబొగడుచు దివికిలంఘించి
యగరివైచియుఁ గృష్ణునెగులువైచియును
భజియింపశౌరియు బలునితో సురలు
వ్రజముమెచ్చఁగ నిజవ్రజముకరిగె

పాలితాంబుజభవభవుఁడైన శౌరి
బాలుఁడైయొక్క గోపాలుఁడైయుండె
నతనిసౌలభ్యమేమని చెప్పవచ్చు
క్షితినాథకొంతయెంచితిమితిలేక
మఱునాఁడు సఖులువేమఱునాఁడు చనిన
తెఱగునఁ బోవనే తెమ్మురమ్మనిన
పిరిగొన్నపూసల పేరులొక్కింత
నెరుకుగోసియలమ్మెనిగ నిగమనఁగ
వేణులు పాణుల వెలయంగఁదమదు
వేణులఁగనిభృంగవేణులుంజొక్క

నొరపుగాముంగేల నొనరించినట్టి
చిఱుతవల్లియుఁద్రాళ్లు చేసగ్గిడలును
రాణింపఁ చిత్రచామరములనాసీర
పాణియు నాచక్రపాణియుఁ గూడి
తోడనాడెడువారి తోడఁదోడ్తోడ
దూడలతోఁగూడ దూరంబు వోయి
బంతులాలంకి యుప్పలములుపారి
గంతులుద్దులు గ్రచ్చకాయ లాటలును
ఆడుచుఁబంతంబు లాడుచుఁబసుల
నీడఁ గాళిందిని నీరుద్రావింప

నొకచక్కిఁ గంసని యుక్తదానవుఁడు
ఒకము రూపమునడంబకము సూపుచును

జంచువాడించి పక్షములు జాడించి
పంచిగోడించి తీవ్రతదువాడించి
జలజాక్షుఁ గబళింప శాలియైయసుర
గళమునెన్నడుమ వెగ్గలముగాఁ బెరిఁగి
స్ఫురదగ్నికోటి స్ఫురణవహించి
హరికిఁత్తుక కుదిగఁడని వెడసిచ్చి
శాతతుండముసా ప్రజాతరోషమున
శాతకుంభాంబరోజ్జ్వలుఁడా బకంబు

తాలువులాపాద తలములుగాఁగఁ
జీల్చియార్చు జయశీలియై మరవి
శేషాంశుతో గోపశిశువులు విజయ
ఘోషంబుగావింప ఘోషంబు సొచ్చె
నుడురాజు పెన్నుద్ది యుగ్రభానుండు
పొడుపుగుబ్బలిమీఁదఁ బొడకట్టు వేళ
హరిశృంగఘూత్కారమడరింప వెడలి
పరువడివంశదీపకులు గోపకులు
తమ తమ యిండ్లను త్తమతమాన్నంబు
నమరించుకొనుచుఁ బెయ్యలతోడనరుగ

పెరుఁగునేలకి సొంటిబిల్ల లల్లంబు
మిరియంపురవల సమ్మేళవహాచవిది
గొజుకఁజిల్లున నేయి గురియుచు వేఁగి
గరగరమనుచుండు గారవేల్లములు
మొల్లమిసంభారముల మించురుచుల
బళ్లువట్టించి పచ్చళ్లతోఁగూడ
గట్టిపావడలతోఁ గట్టి చిక్కముల
బెట్టికొల్కులుపురి వెట్టిచేపట్టి
ఫణఫణాంతర బాలపద్మారికరణి
గుణుతి కెక్కిన కరాగ్రము శృంగమమర

సుకుమారపవనంబు సొలపుల మొరయు
సకలసంగీతసూచకము నీచకము
దట్టమై మెచ్చెక్కఁగుత్తంబు చిత్తంబు
కట్టులజిగిమించఁగాఁ జంకనిటికి
తమమునఁబెనగొన్న ధవళాంశుకళల
కొమరునొందిన బాలిగొంగళ్లుదాల్చి
జలజభవాండముల్సంచిలోనణఁచు
నలరిక కచ్చకాయల తిత్తి నొప్ప
గణముమీఱిన వత్సగణముతో గగన
మణిపుత్రికానదీ మణితీరమునకు

నరుగుచో బకదైత్యునుజన్మసఖుఁడు
కరగేహమగునదీగరదేహమంది
నురుతరాస్యమ్మున నుత్తాలబలము
సరణిఁగాన్పడ జిహ్వ సరణిగాఁబఱచి
పగదీర్తుననుచునా పగచెంతమదిని
బగచాటుచుండ గోపకులేగుదెంచి
దరిగానమిది మహోత్పాతంబు శైల
దరియంచుఁ గంససోదరిపుత్రుఁదలఁచి
హరియుండభయములేదనుచు తద్భుదిత
భరులొచుఁ బరమప్రపన్నులు పోతె

నగ్గళంబగుదాని యగ్గళంబపుడు
దిగ్గనఁజొరఁగ నత్తెఱఁగెల్ల నెఱిఁగి
భక్తసంరక్షణ బద్ధకంకణుఁడు
భక్తశిక్యోదార భక్తలోకంబు
వెనుచనిబలిమర్దివింశమై పెరిఁగి
ఘనదైత్యకంఠోపకంఠ ముత్కంఠ
వ్రచ్చి గోపాలక వరులతో వెడలి
వచ్చియగ్గిరినిచ్చ వచ్చినట్టుండ

నావ్యాళమునసుండి యావేళనొక్క
దివ్యతేజంబు దై తేయారిఁగలసె
గోపాలసుతులతోఁ గూడియానంద
గోపాలసుతుఁడును గుజములెక్కుచును
కోకిలశుకభృంగ ఘూకమండూక
సూకరరవముల సూఁటిగుయ్యించు
వేలుగొమ్మల మీఁద వ్రేలు కపీశ
వాలముల్ భూజశై వాలముల్ ముడిగి
సేతుబంధించి సేతురమ్మనుచు
నాతతవాహినులడ్డుకటుచును
కలితప్రవాళరాగములఁ బ్రవాళ
ములవింతగాదాము ములుగట్టి తాల్చి
సురపొన్న మొగ్గలు బోడుగాఁ జేర్చి
కరమొప్పఁ జౌకట్లు గాధరించుచును
సురపొన్న నీడ భాసుర సరోవరము
సరసనుసరసుఁడై సరసిజాక్షుండు
నెలచట్టురాతిపై సిలిచి గోపకులఁ
బిలిచి వత్సముల నొబ్బిడిగాఁగ వెలిచి
కొలఁదిమై వెండి నిగ్గులు దేఱు చిలుప
చిలుపగొజ్జఁగ నీరుచిలికించితులఁచి
చెవిమిమైఁ గొందఱు చేర్వనామీఁద
నలరుచిరాన్నంబు నలరుచునిడఁగ
పల్లవంబులఁ బాణిపల్లవస్థలులఁ
బల్లవించుచుఁ జేర్చి భక్తముల్ నింప
దళముతై పొలుపొందు దళములలోనఁ
బలుమఱుచలుదులు పరిభవింపఁగను
జలిది చిక్కమునొయ్య సడలించినగుచుఁ

బలికేయాగోపాల పాలబాలకుఁడు
సురభూజశాఖాగ్ర సుమగుచ్ఛసనఁగఁ
గరతలదధ్యన్న కబళమింపొంద
శతపత్రదళముల సంపులయళుల
గతివల్లెయెడనూర గాయలు చెలఁగఁ
గోమరుగొల్లలు చుట్టుఁ గొలువుండఁదాను
నారగింపఁగఁ జిందునన్నంబు మింటి
యూరివారలకునోరూరించుచుండఁ
గబలంబు చేత నిక్కబలంబు చూపి
కబళించునొకనిచే కబళమొక్కరుఁడు
చిక్కము చెలిమితోఁ జిక్కము వెనుక
త్రొక్కనురమ్మి మాతోడ నీవనుచు
నొక్కఁడొక్కని చిక్క మొక్కని కొసఁగ
నొక్కఁడొక్కని చద్దియొక్కఁడు మెసఁగు
వల్లవీవల్లవవరుఁడు నాబాల
వల్లవుల్ దాను నీవరుస భుజింప
నేపుమీఁజిన క్రేపులెంతయు మేఁపు
దాపుననరిళికొండల దండనుండ
మరకతాంకూర సమానంబులగుచు
కరమొప్పుచుండెడు గరికెక్రేళ్లుతికి
గుఱిమీఱఁదినివెలంకులఁ గొలంకులను
మెఱయుచునీరీతి మెఱయఁ గోపకులు
ఏవంకనున్నవో యిపుడు వత్సములు
యేవంక నీరాన నెగెనోదెసల
వేవేగవెదకుఁడే వేగనో కృష్ణ
నీవంక యీ వంకనిలిచితిమఁడు
వత్సకుల్మెచ్చ శ్రీవత్సలాంఛనుఁడు

వత్సముల్ పోవుత్రోవనె పోవునపుడు
ధాతమనోజాత తాతబలంబు
చూతుగాకని ముందు చూడకే తెంచి
పరమభోజన విజృంభకులడింభకుల
సరగునడాఁచె వత్సములతోడఁగూడ
జనవర్యయాయోగిజన వంద్యుఁడపుడు
వనములవెంకి జీవనములవెంక
కానకతొల్లింటి కానకమురలి

యానెలవున బాలకాళిలేకన్న
గమలసంభవ కోటిగన్నయాతండ్రి
కమసంభవు మాయగాఁ జూచి నవ్వి
యాయొప్పుచున్న వత్సాళిప్రాయములు
కాయముల్వర్ణ నికాయములట్లు
బాగుగాఁదద్గోప బాలవత్సముల
బాగుగాఁదన దివ్య భవ్య సత్త్వమునఁ
జతురాస్య క్రియలెల్లఁ జవుకపుట్టింపఁ
బ్రతిసృష్టిఁ జేసి యప్రతిసృష్టియనుచు
సురలెన్ని భాసుర సురభిసూనములు

కరముల శోభనాకరముగాఁజల్లి
రాభీరశిశుయుక్తుఁడై తొంటిరీతి
నాభీరవసతికి నరుదెంచియంత
కలగోప గోపికల్ కలయందు పొందు
సలుపుచుఁదొల్లింటి సరణినాడుచును
ఒకయేఁడుగడపి వేరొకనాఁడు మెరసి
ఒకవైరిగోపాల బాలపాలమున
వనభూమిఁజేయ జీవనభూభవుండు
వనజాయతాక్షు క్రేవల నాడుచుండ
ధరచక్రధరుల మంధర ధరాకృతుల

గురువేణుశరచాపకుల గోపకులను
గనిడెందమునఁగుంది కడునెఱఁగంది
ఘనభీతినొంది దిగ్గనభూమిఁ జెంది
భ్రమయించి వత్సగోపకులనేదాఁచి
సమమయ్యతనచేత సమమయ్యా నేల
కనుఁగొన నీవత్సకములు వత్సములు
తనసృష్టి లేదు నూతన సృష్టిగాని
తనతండ్రియైన పూతనవైరికృత్య
మనుమనికేత మందియాకంపమొంది
ధరఁజాఁగి మ్రొక్కె శ్రీధరపద్మరాగ

చరణముల్ జగదేక శరణముల్ చేరి
యపరాధినపరాధి నాగమగణ్యా
కృపఁ జూడు కృపఁ జూడు కృపణశరణ్యా
కడుపులోపలిబిడ్డ కాలఁదన్నినను
జిడిముడితల్లికిఁ జెల్లునే తండ్రి
శరగలతనకు ముందరగలజనవి
సరముల నఖిలవాసరములనెన్న
గణనమీఱవు మానిగణనుత నీదు
గుణములు గణనకుఁ గొలఁదులేకావు
తాతనీముందఱఁ దగఁదన్నయినుని

ద్యోతంబుఁ మీఁద ఖద్యోతంబుకాంతి
కొలుపునే మధ్యమగుణమునాయందు
నిలువనేరమివచ్చెనే తండ్రియనుచుఁ
గలికిలాగులఁ గన్నుఁ గవదోయిజోడు
జలము శ్రీపాదమజ్జనముగాలింప
మ్రొక్కుచునాశ్చర్యమును బొంది పొంది
నిక్కుచుసారెకు నిలిచి చొక్కుచును

నాఁడుచేకొన్న చిహ్నంబులతోడఁ
గూడనాగోప గోపకులకులంబెల్ల
దర్పంబుడించి కందర్పుని తండ్రి

కర్పించి ప్రణుతి సమర్పించియరిగె
తనమాయఁ బొడమిచెంతనెయొప్పు గోప
తనయులఁ గ్రేపులఁదనయందె యడఁచి
మున్న తామున్న సమున్నతస్థలికి
వెన్నుఁడాబాలక వితతితోనరిగె
హరిమాయచే మోహితాత్ములై గోప
వరులు శ్రీపరుని నెవ్వరుఁ గనుఁగొనరె
దరులని యేరుల దరులని తరుల
గిరులఁ బల్లంబుల క్రేపుల జూడఁ
జయ్యననరిగె నీచవిదియుఁ గుడువఁ

డయ్యొజాగయ్యొరాఁడయ్యొ నటంచు
వామహస్తముల నవామనాకృతుల
వామాన్నకబళముల్వ్రేలఁ నొప్పఁబిలువఁ
గపటనాటక హాటకపటసంకలితుఁ
డపుడేగుదెంచిపెయ్యలఁ గంటిననుచు
వారిజహితపుత్రి వారిలోఁగేలి
వారితో వేడ్కన వారణసలిపి
పింఛెంబుగల నెమ్మి పింఛెంబుగాంచి
మించి గోపికలు కామించి వీక్షింప
నందగోపానంద నందనాద్భిందు

మందరధరుఁడంత మందకునేగెఁ
బరమేష్ఠిదాఁపగోపకుల నయ్యెడను
హరిమాయచే క్షణమయ్యొ నాయెడను
అరిదితల్లులఁజేరి యాగోపవరులు

కరమునఁ గరముగా కరముగాఁగురియు
పెనుబామువధియించి పెనుబాముగడపి
చనుదెంచెమాతతోడ శౌరి నేఁడనిన
నేఁడిదేయిదిపోయి నేఁడిదే తాము
నేఁడిదేయనుచు నెన్నదరు బాలకులు
అనుచు నాశ్చర్య చర్యలకు నాశ్చర్య
మునుబొందుచుండిరి మురవైరియంత
డాసినగొల్లమిండతల వెండముల
కాసలుఁ రేచు ప్రాయమునగప్పారు
చికురముల్ నెమ్మిపింఛపుదండ దండ
నొకవింతయొసపరియొరపుగాఁజెఱివి
నాణెమాశిలకుఁ బ్రాణముదెచ్చినట్టి
గాణవేణువు సందిగదియంగఁజేర్చి
యుదయేందునురము నీలోపలాంతరము
గదియుకై వడితావికాసెచెన్నొంద
నున్నతో వత్సవత్సాళితోనున్న
యున్నతోన్నతధేను యూథంబుతోడ
నరుగుచు నొకయుపాయమున నాయమున
దరుల దానవ జయార్థంబై చరింప
శ్రీదామయుతగళ శ్రీధామనామ
మాదిగాఁగలిగిన యాభీరవరులు
రామయోకమ...రామాభిరామ
సీమయొక్కటిమన చెంతఁ జెన్నొందె
యేలునవ్వని ధేనుకేంద్రారియచట
తాలముల్ ఫలరసోత్తాలముల్గలవు
భాగవతరామాయణము

(భాగవతరామాయణము)

ఈలంకనుండు నయ్యింద్రారిబంధు

జాలంబుతనుఁ గొల్వ జగదేక వీర
యామహారిపుఁ జంపియచటనుత్తాల
భూమిజామృతఫలంబును నీవకొనుచు
ననుడు రామానుజుండా రామచంద్రుఁ
డనయంబు హర్షించి హరికులోద్భవులు
నరుగరాజీవకు శాండజశాల
వరయుక్తమైన యవ్వనరాశిడాసి
యరితమ్ముఁ గనుఁగొని యభయమన్నంత
నరిదినీలంకకు నధిపుఁజేసెదము
అనుచునగాళి బిట్టుగలంగ శరధి

పెనుపొందఁగట్టి నభేద్యధర్మంబు
తనకేలఁగొనిసేన దారుణార్భటుల
వనచరపంక్తి దిగ్వలయంబు ముట్ట
ననుజన్ముతోరాముఁడా మహావనము
ననుపమంబైన భటాళితోఁగడచి
స్యందన మత్తేభచయ హరిఖడ్గ
బృందంబుచేఁ గడుభీమమౌదాని
తరుణీమృగీమదలతులచేఁ గనక
సరసులచేనొప్పు సవరించుదాని
ఘనసాలజాలసంకలితమౌదాని

దనుజేంద్రవసతినత్తటిఁ జేరవిడియ
సహచరసైన్యంబు చనుదెంచి దైత్య
సహచరసైన్యంబు జిడియఁగొట్టుచును
తాలముల్వఱచి చిత్రంపు సాలములఁ
గూలఁదన్నుచుమున్నె కొమ్మలఁద్రుచ్చి
శంకింపకెదురుగాఁ జనుదెంచురిపుల
డుంకఁబట్టుచుఁ బండ్లుడుల్లంగఁగొట్టి

చిత్రంబులైనట్టి సింహనాదముల
పత్రసంతతిఁగాల భ్రామివేయుచును
గరిబృందములనిరుగడలఁ జూపట్టు

గరుతలఘంటలఁ గొట్టివైచుచును
వేవిధంబుల దైత్య వీరులనొగులు
గ్రావసంఘంబులఁ గప్పిరొప్పుచును
దనుజులుబెగడ గంధములెల్లఁ బెఱికి
కనలుచుహతుల సంఘముల నొప్పించి
కలిగిన పుండరీకముల జాలముల
నలిసేసి బాణాసనములెల్లనఱికి
శరముల్ద్రుంచి తచ్ఛయముల రిపుల
నురములుగాఁడంగనురిదిగుప్పుచును
రామసైన్యంబిట్లు రణకేళిసలుప

నామహాసైన్యంబు నాసేన బలిమి
ప్రకటవివేక సౌభాగ్యగరిష్ఠ
శుకవాక్యములచేతఁ జొప్పడవిన్న
దనుజేశువనుపునఁ దడయకవ్వేళ
ఘనసింహనాదముల్ కడిదిఁజేయుచును
అతికాయ వజ్రదంష్ట్రానల రోమ
శతమాయ ఘనబహుబాహుశాలి భుజంగ
రోమ ధూమ్రాక్ష విరూపాక్ష ఖడ్గ
రోమ వృశ్చికరోమ రుధిరాక్ష మేఘ
నాదనరాంతక దేవజిన్మ

హోదరభయద విద్యుజ్జిహ్వ శౌర్య
భీకర దైతేయబృందంబు వెడలి
కైకోకమాహారి ఘనవంశసంభవులు
పటుతరబాణాళిఁ బఱపి వెండియును

గుటిల రాక్షసులనుగ్గులు సేసి సేసి
స్యందనంబుల నాగచములహరుల
సందోహములనెల్లఁ జక్కు గావించి
చట్టలు చీరిరాక్షస వీరవరుల
యట్టలు దివిముట్ట నట్టహాసముల
భటులయార్భటుల దిక్పటంబుచిటులఁ

గుటిల దానవకంఠ కుహరముల్ దునిమి
హరులఁబట్టుచును నగాళి గుట్టుచును
వరుస దానవవీరవరుల భంజి ప
ఖరభావ హితుఁడు రాక్షసలోక విభుఁడు
కరముగ్రముగ రాముగదియనవ్విభుఁడు
పంక్తికంధర శిరోభాగముల్ దునియఁ
బంక్తిగాఁబటు కదంబములు వేయుచును
నుడుగనితమిఁబెండియును మహార్భటులఁ
బొడకట్టు రిపుశిరంబులు ద్రుంచివైచి
కర్ణముల్ నిక్కరాక్షసుల సొంపెక్క

ఘూర్ణితనేత్రుఁడై ఘోరనాదముల
మొనయుతద్రిపుపదంబులు పట్టితునుమ
కనవెడు భీషణాకరకాండమపుడు
పఱపియుత్తాల భూభాగంబునందుఁ
గఱకురక్కసుఁగూర్చి కడకమైనార్చె
నపుడు తద్దానవాహతిఁదరుల్ గిరులు
విపులనాదములతో వీఁగెవీఁగుటయు
హరి వహ్ని శమన దైత్య జలాధీశ పవన
నరవాహ శంకరుల్ సురులొచు నుతులు
చేయుచువిరులచే చేతమజ్జనము

సేయుచుఁ గొలువులు సేయుచున్నంత
క్షితిసహచరుల వీక్షింపఁ గావించు
ప్రతినవిభీషణ పట్టంబుగాఁగ
నామోదమున దిక్కులందఁదద్భూమి
భూమిజాధికఫల పుంజంబుతోడ
ననుజన్ముతోడ భృత్యాళి సేవింప
వనరాశిగడచి యవ్వలి భరద్వాజ
వరకృత్యములకు భూవరసుతుల్మెచ్చ
దనులనొప్పెడు తపోదరుల సోదరుల
గడచి పాలిత గ్రహాకారుఁడై యతఁడు
నుడుగణంబులతోడి యుడురాజుఁబోలె
భటకోటితో జనార్భటకోటితోడఁ
జటులతర నిజనివాసముఁ బ్రవేశించె
ననియోగిజన పాలుఁ డాజనపాలుఁ
డనుమోదమంది సిట్లనియానతిచ్చె
నని సుధాపాణికి నబ్జపాణికిని
వనజాస్యమాతకు వనధిజాతకును
ననుఁగన్నతల్లికనమ్రమభల్లికిని
గనకగాత్రికిని బ్రకామధాత్రికిని
వాణీశనుతకును వ్రతకక్షివిచల
దేణికి శ్రీవేంకటేశు రాణికిని
సారసగేహకుఁ జారుబాహకును
సారలావణ్యకు సకలగణ్యకును
బరమకల్యాణికి భ్రమరవేణికిని
దరుణేందుఫాలకుదారశీలకును
రామాభిరామకప్రతిమధామకును
హైమసంవ్యానకు హంసయానకును

నింద్రభావితకు గజేంద్రసేవితకుఁ
జంద్రికాహాసకుఁ జారునాసకును
నగసుతానతకుఁ బన్నగతల్పయుతకు

మృగమదాంబకు నలమేలుమంగకును
నంకితంబుగను శ్రీహరిభక్తినికర
పంకజార్యమ తాళ్లపాకన్నయార్య
తనయ తిమ్మార్యనందన రత్నశుంభ
దనువదు శ్రీవెంకటాధీశదత్త
మకర కుండలయుగ్మ మండితకర్ణ
సుకవిజీవంజీవ సోమరాజీవ
సదనావధూ లబ్ధసరస కవిత్వ
విదితమానస తిరువేంగళనాధ
విరచితంబగు ప్రతిద్విపదసంశ్రవణ

తరళిత విబుధమస్త ప్రీణితోరు
మనసిజ జనకాష్టమహిషీవివాహ
మనకావ్యమునఁ బ్రథమాశ్వాసమయ్యె.



శ్రీరస్తు

# అష్టమహిషీ కల్యాణము



## ద్వితీయాశ్వాసము



(శ్రీదేవీ మహిమవర్ణన.)

[ ద్విపద ]

భువనైకమాత యంభోరాశిజాత
కువలయదళనేత్ర కోమలగాత్ర
జలజలోచనురాణి జలజాంకపాణి
యలకనిర్జితభృంగ యలమేలుమంగ
యవధరింపుము దేవి యమ్మహామాని
కువలయేశుఁడువల్కెఁ గువలయేశ్వరుని
జితకామపాలు నాశ్రితకామపాలు

హతదైత్యభూపాలు నాకామపాలు
నింటిలోనునిచి వేయింటిలో నేర్చి
దంటలౌ గోపాల తనయులఁ గూడి
గోపచిహ్నములఁ గైకొన్న గోపాలు
గోపాలనముసేయఁ గోరి దైత్యారి
భవనుతపదనీర భవమైన విజిత
భవమైం రవితనూభవఁ జేరియపుడు
కనుపట్టి వెన్ను చెంగటి నీలవేణి
యనఁటికెమ్మొగిమీఁది యలిపంక్తి దెగడు
మొగులులోపలిమించు మురువున గళము

దగిలినపికిలి పూదండచూపట్టఁ
బాటల తిలక చంపక తరుచ్ఛాయఁ
బాటలనాటలఁ బరిఢలించుచును
భండనగజదైత్య భండనోద్దండ
చండ తాండవ లసచ్చండికా ధ్వని
దండినభ్రమున మార్తాండ మండలము
మండుచుండెడు నిండుమండువేసవిని
పసియెల్లమిసిమిమై పసగలకసవు
మెసవిమూతులుడప్పి మీఁదికెత్తుచును
జలశాయి జయకేతు చయములఁబోలు

గళకంబళంబులా కంపంబునొంద
సురనదీ శీకర స్ఫురదీశజటల
గరిమలకడవగొంగడి దండలమరఁ
గనుపట్టునెఱమంటి కట్టులతోడఁ
గొనకొమ్ముతుదనారకుంచెలల్లాడ
సెలవులనిడిన పచ్చికలు చలింపఁ
బలుమఱునదరివెన్బడియున్నపసులఁ
దిరిగి చూచుచుఁ బంచతిలితోఁకలెత్తి
పరువడిఁగెరలి హంబానినాదములఁ
గాళియ భుజగాస్య గహ్వరోదగ్ర

హాలాహలాభీలమగునొకమడువుఁ
గనిపోయి యాయుదకమ్ముద్రావఁగోప
జనమునా జనమునావను గ్రోవిగ్రోవి
విపులాతతేశయా వ్రేకుట్టులావు
లపుడ మూర్ఛలనొంది నరసియందంద
హరియు నాత్మీయేక్షణామృతదృష్టిఁ
గురియించి గోగోపకులమూర్ఛఁ దెలిపి

భోగినేననియెమ్మెఁ బొరలినతనడు
భోగమంతయుఁ బొట్టుపొరలుగావింతు
దట్టించిచీనిసినతనతలగొట్టి
పుట్టపైఁ బెట్టింతు భువియెల్ల నెఱుఁగఁ
గాలూఁద కుండంగఁ గదియు కాళికిని
నాలుకల్ ద్రోయింతు ననుడాసెనేని
యేబొక్కసొచ్చిన నెందుడాఁగినను
నాబలస్ఫూర్తినెంతయుగెల్తుననుచు
హరి నీలనాళాగ్ర హైమ సంఫుల్ల
సరసిజంబున జటాసహితాస్యమమర
దట్టమై కెంగేల దట్టిబిగించి
గట్టిగాఁ గట్టియగ్గలికమీఱంగ
నలవిమీఱుచుఁ జెంతనలరు సత్కుసుమ
ఫలకదంబముఁ గదంబముఁ గాంచియెక్కి
వడినార్చి సప్తార్చి వడువునఁజేర్చి
మడువునెన్నడుమ సంభ్రమము దీపింప
నభమున కెగసి పంతముపచారించి
గుభులు గుభుల్లున గుప్పించి దుమికెఁ
గాలాహియల సుధాకలశంబుఁ జుట్టు
లీలనాచక్రిఁ గాళియచక్రిపాదువ
గొబ్బుననిక్కి మార్కొని భుజద్వయము
నుబ్బించియార్చుచు నుబ్బియాగబ్బి
పటుతమః పటలంబుఁ బాపిన సూర్యు
ఘటనఁ దద్భోగిభోగమువిడఁ దన్ని
సరసతర విభవాంజన వేణివేణిఁ
గరమునఁబట్టిన గతివానిఁ బట్టి
ఫణిరాజుపైఁ గూర్మపతినిల్చెననఁగ

ఫణిశాయిపదము తత్ఫణివీథిమెట్టి
వాలంబు బాలకై వాలంబు దిగుచు
లీలఁగెంగేలఁ గీలించి తూలించి
చరణపద్మము పరసాధనంబైన
గరుడోరుపక్షంబు గరిమమైసోఁక
బక శుక చక్రశాబక పిక ధ్వనుల
ప్రకటనర్తక తాళపద్ధతుల్ గాఁగ
సంచదాసంచీర చంచరీకముల
యంచితరవముగా నాళిమైపరఁగఁ
పటలిభవత్స్వేదపక్షిపక్షాగ్ర
రటనముల్పటుఁహా సంగ్రామముల్గాఁగ
విషపావకావృత విపులాంతరిక్ష
కషణఫణాళి రంగస్థలిగాఁగఁ
జండపద్ధతి భోగసత్వంబు చెదరఁ
జండమరీచి చంచత్కుండలములు
మండితనిజ గండమండలీ యుగళిఁ
దాండవం బాడంగఁ దాండవం బాడి
యుడుపంక్తి దివినుండి యొరఁగిన రీతిఁ
బడగలమణులెల్లఁ బడ్లూడిరాల
డిల్లసొంపరితల్లడిల్ల భోగంబు
గుల్లలతిత్తియై కుల్లబింకంబు
పెంచి గుప్పించి గుప్పించి నొప్పించి
డంచియడంచి వాటముగ గాటముగఁ
బట్టిగిట్టియుఁ జలపట్టిమైపట్టి
కొట్టివాలంబు మార్కొని చుట్టిపట్టి
దట్టించి గట్టించి దర్పంబు బలము

పట్టించి రక్తంబువాఁతఁ దొట్టించి
వికవికనవ్వేడు వేళనవ్వేళఁ
బికవాణులరుదంది భీతిచేఁగుంది
జిగిపయ్యెదలనెడసిన చన్నుఁగవలు
మొగులుమూయని శైలముల పెంపుచూప
సంగపంగి క్రేగాలిఁ జలియించుశ్రేఁటి
గుంపులగతిఁ గప్పక్రొమ్ముళ్లువీడ
జలములఁదోఁచిన జలజ పత్రముల
చెలువున బాష్పముల్ చిలుకు నేత్రముల
గనలేదు రాహువు గళము సోత్తించు
వనజారి గతినొప్పువాడుమోములను
స్రుక్కుచువచ్చి యశ్రువులులోలోనె
గ్రక్కుచుఁగరములు గూర్చిమ్రొక్కుచును
వసుదేవపుత్రయో వసుధాకళత్ర
వసురాజమిత్ర సర్వసురాధిపత్ర
పతిభిక్షయోసఁగు శ్రీపతి దుష్టభోగి
పతి నీకుఁ బ్రతియె యప్రతిమానమూర్తి
కరుణాసముద్రనికరమైన గరము
కరముపాములకవకల్పించి తనుచుఁ
బన్నిన దైన్యమేర్పడఁ జేయునట్టి
సన్నుతుల్మెచ్చినాసన్నుతుల్ సేయ
భోగీంద్రవరభోగ భోగి యానాగ
నాగయానలఁ గరుణాదృష్టిఁ జూచి
కాళియ యీపట్టుగాచితి నీదు
గాలినగాళియుఁ గాళిందిలోని
లోయంబు విషములతో యంబులయ్యె
నీయంబులిట మదీయేక్షణఘటన

నమృతరూపములయ్యెనరుగుము వేగ
రమణ నదీద్వీపవర్యమునకు నీవు
మస్తంబుమీఁద సమస్తంబు నెఱుఁగ

శస్తంబులైన మచ్చరణచిహ్నంబు
లున్నవి నీవెందునున్న విరోధి
పన్నగాంతకుచేత భయమింత లేదు
అనినఁ గాళియభోగి యాభోగిశయను
వినుతించి వరవస్తు వితతిఁ బూజించి
చనియెనక్కాలను రాక్షసవైరి వెడలి
తనవారి తనమునఁదనవారిఁ జేసి
యానందితాత్ముఁడై యానందముఖ్యు
లానందమునుజెందనా మందకరిగె
మఱునాఁడు హరిబలల్మఱునాడు దెలుపు

నెఱయుసొంపులఁదాపసీనదిఁ జేరి
యుద్దించి గద్దించి యొడఁబడిపడుచు
లుద్దులై రాఁగఁ బెన్నుద్దులై తాము
నొక్కఁడొక్కని గెల్చి యొకనిపై నొకని
నెక్కించికొని చలంచెక్కించికొనఁగ
దామోదరుఁడు హసోద్దాము శ్రీరాముఁ
దాప్రమోవరాముఁడత్తఱిఁ దరిద్రొక్కి
బాలుఁడై కపటగోపాలుఁడై యున్న
లాలితోపాయుఁ బ్రలంబ దైతేయు
పైపై చలంబెక్కి పై యెక్కికొన్న

కోపంబుతోడ నక్కుటిల దానవుఁడు
వనములఁ జటుల దావనములఁ దిరిగి
ఘనవాయు వేగంబు గడచి పోవుచును

జండీరమణి జటాసమజ డిండీర
భాండీరవట సమీపమున కేతెంచి
మానవరూపంబు మానివే వేగ
దానవరూపంబుఁ దాల్చిన బలుఁడు
తెగువమై దృష్టి సంధించివేవేగఁ
బగతుమస్తములై చెఁ బఱియలై పోవ
హారవంబుననీల్గి యదివ్రాలనమ్మ

హారవంబుననద్రులదరె నెంతయును
రాముండు లోకాభిరాముండు హేమ
దాముండు హరియుమందకునేగెనంత
కనలిదిక్పతులు రాక్షసులపై వెడలి
యనిఁజిమ్ముకిరు సులోయననటించుచును
నెఱవై సకలిత వర్ణింపనందెసఁగు
మెఱుపుల చందాన మెఱపులు పొదలె
నీలవర్ణుని మూర్తి నిఖిలంబుగప్పు
పోలికెదట్టమై పొదలె మేఘములు
సరసతల్కలి మానసంబునజిందు

సరవినంచలు మానసంబునఁజిందు
సరవినంచలుమాన సంబునఁజిందు
సరవినంచలుమాన సంబునఁజేరె
వరపశ్చిమాంగన వరుణుమైమై చు
వరుణమాలికఁబోలె వజ్రధర్మంబు
ఉడుపంక్తి కంసవధోత్పాతంబునకు
వడినట్లువడగండ్లు వడియెనల్లడలఁ
గడలిపైఁబొరలెడుకరడులోయనఁగ
నుడుపీధి బకపంక్తులురుగతి నడచెఁ

గలిగిన పక్షిసంఘములతో నెల్లఁ
దలయెత్తి చూచె చాతకనికాయంబు

తిరుపు గట్టెడు సురస్త్రీలకాళియల
మురువున సితికంఠములు పురుల్విచ్చె
నలసస్యగర్భయానచలపాలిండ్ల
చెలువున నీలాగ్ర శిఖరులు వెలసెఁ
గాలాభ్ర భూతముల్ కళపెళనార్చు
పోలికె గర్జితంబులు మింటఁ బొదలెఁ
బోలుపున వెల్లువల్ పొదలెనంతటను
ఒలసి కుంభద్రోణ పాతంబుగాఁగఁ
గారుక్రమ్ముచు నేర్లు కాలుఁవల్బెఱయ
ధారాధరోధార ధారలు నిగిడె

నిలకునుమింటికి నేకసూత్రములు
గలిగినట్లుండెఁ దద్ఘనధారలపుడు
జలజాస్త్రహత కామిజన మాంసఖండ
కులములో యననింద్రగోపంబులమరె
ధారుణీ కుచహార తతులోఁ యనంగఁ
జారుశైలాగ్ర నిర్ఝరములింపొందెఁ
బచ్చ సూర్యపుటంబు పగిదినల్దెసలఁ
బచ్చికల్మొలచి చూపట్టెనంతటను
గాలతోయములోని కరవుమీలకును
;గాలంబుగతి శరత్కాలమేతేఁ

గమలాకరంబులు కడుతేటలయ్యెఁ
గమలాకరశ్రీలు కడువిస్తరించె
రసముల వింట సారసపునారసము
పొసగించి విరహులఁ బొంచె మన్మథుఁడు

విరిసె దిక్తటులకావిరివిరివోదలె
సరస వాసనలతోఁ జల్లనై యలరెఁ
గాముల హృత్సంగములరాదిగిచె
వామాక్షి వాగురువ్రాతంబులంత
మురవైరి హరి జగన్మోహనాకారు
సిరికూర్మిమగని వీక్షించి యాదేవు

వికసిత నయనారవిందంబులకును
జగచకల్గల చూపుచందమ్ములకును
దిలకంబుమైనెఱితేఁటి మూఁకలకు
మొలక నవ్వులతేనెముసురుజోకలకు
మకరకుండల కాంతి మలయుచెక్కులకు
సుకుమారలీలల సొలయుటక్కులకుఁ
దనరెడుకొప్పుపూదండ చుట్టులకు
గొనబులు పేటాడు కొసరుతిట్టులకు
సంపంగి భంగింపఁ జాలునాసకును
సొంపులుమీఱంగఁ జూపునాసకును

బలుచనియధర బింబఫలంబునకునుఁ
బొలుపైనసోయగంబుగళంబునకును
జొక్కి గోపికలెల్ల సూనాస్త్రు బారిఁ
జిక్కి కృష్ణుని వలఁజిక్కమైమఱచి
యేనోమునోమంగనితనిఁ జూచితిమి
మేనోమునోమినామితని కూటమికి
ననుచుడెందముల నంతంతకుఁ బ్రేమ
నినుపులైదైవాఱి నీరధుల్గాఁగఁ
గిరుసువంకలయొప్పు గిరిగొన్నకప్పు
నెరుల సోగలజడల్ నిగనిగమెరువ

బిగువఁ జన్నులజిగిబిగి శౌరిఁ జూచి
తెగడిపయ్యెదలింత తెల్లగిలంగఁ
బదపడిచాఁచిన బాహుమూలముల
నుదిరి బంగరుపొడియురిదిపైఁ రాలఁ
గుంగుమ మర్జునాంకురములయడవి
సంకుమందంబు పచ్చని యక్షతములు
పట్టిచూపట్టెడాఁ పలికేలమడుఁగు
పుట్టమువ్విన్నాణముగఁ గీలుకొలిపి
సమధూపరాగ కింజల్క గంధాక్ష
తములు మాధవునకీఁ దలపోయుదాని

నిండు జుక్కలతోడి నింగియుఁబోలెఁ
బుండరీకము లచేఁ బోలుపొందువాని
సంగీత పంచమ షడ్జములుమూర్తు
లంగీకరించెనోయనఁ జెంతఁబల్కు
కలకంఠముల భుజంగగ్రాస నిరత
కలకంటములతోడఁ గడునొప్పుదాని
గమలభూషణపేటి కలలక్షుముద్ర
లమరించెననఁ గోరకాళులదాని
గడకాటుకలతోడి ఖచరకన్యకల
బెడఁగుఁగన్నులు ప్రతిబింబించెననఁగ

జలములతో వికాసమునొందిమిగుల
వలనొప్పునల్లగల్వల నొప్పుదాని
నురుతర వనరాశి యుప్పనిరోసి
వరతోయ మానసీ వలికేగుదెంచు
కాలాభ్రములఁబోలెఁ గమలమంజరులఁ
గ్రోలెడు భృంగ చక్రంబులదానిఁ
గాషాయ జపమాలికలు దాల్చి విగత

రోషులౌ సంయమీంద్రుల నాఁగనొప్పు
బిసముల నూలితోఁ బెడఁ బాయకుండఁ
గసికాటుకాటుల ఖండించుకొనుచు

వికచారుణాబ్జాత వీథులనున్న
ఒకములు హంసశాబకములు గలిగి
యానందనందను నాత్మలోఁదలఁప
నానందభాష్పంబు లలరి నేత్రములఁ
గ్రమ్మెనోయనఁగాలిఁ గదలింపఁదొలఁకు
తమ్ముల వరమరందమ్ములదాని
దమ్మురేయెడనిన తమకంబుతోడ
నమ్మునిపతులకు నమికల్పవ్రట్ట
వనదేవతలు మెచ్చు వనములఁ గ్రుంకి
కనలిమడ్డులు నారికలనెత్తైననఁగఁ

దుండాంతరములఁ జేఁదొవల బిట్టగిల
ఖండించు వరచక్రకాంతులదాని
ఘనవహానివర్య హృత్కమలంబులందు
ఘననీలవర్ణుండు గనుపట్టుపగిడిఁ
దేనెద్రావిన జొక్కుదేరకతావు
లానెడు కమలభృంగాళులదాని
యమున శ్రీహరిసహాయమున నాభార
కుముదలోచనలు వేకువజాము చేరి
హరిభక్తియుక్తలై యనిశంబునిట్లు
హరిభర్తయగుఁగాక యనుచునోముచును

గొలకులనీరాడఁ గోరిపుట్టములు
కొలఁకులనిడి జలక్రీడఁ గావింప
సకలాత్మమానససంచారి శౌరి
యొకనాఁడు తనుఁ గోరియున్నట్టివారి

నతులితభక్తినింతంతని యాత్మ
మితియెన్నరాక కామితఫలప్రదుఁడు
వారిచెంగటనుండువారి పుట్టములు
చేరి చేకొని చేర్వఁ జలఁగు నీపంబు
కొమ్మలపై నెక్కి కొనియాడి గొల్ల
కొమ్మలఁదనువేగఁ గూడరమ్మనిన

నాడఁబోయిన తీర్థమదియెదురైన
జాడఁగృష్ణునిగని సంతసించుచును
గొనులువంచి యంగములెల్లముంచి
నానవాటించిలే నగవులతోడ
నుడురాజు మరలిన యుదయాస్తగిరుల
నడుమఁ జీఁకటి పర్వినటన సిగ్గులను
బెడమరలఁగఁ జడల్ బిగిచన్నుఁగవల
నడుమఁ జూపట్ట నందఱునూరకుండ
వారిలోదళు కొత్తువారిలో నొక్క
వారిజగంధియో వారిజనాభ

యోడకమగవారికు విదలుజలము
లాడంగ సరసంబు లాడంగఁ దగునె
మానమేరికి సమానంబు తమదు
మానంబుగాచి మామణుఁ గుఁబుట్టము
సాధింప కింకఁ బ్రసాదింపుమయ్య
కాదన్ననిను మీఱఁ గలమెయేమనిన
చిఱునవ్వుకెంజాయ చిలుకఁ కెమ్మోవి
నెఱయంగఁ గృష్ణుఁడా నెలతలఁ జూచి
మీరలు నామాట మీఱకవచ్చి
చీరలు గొనుఁడు నాచేతివియనుడుఁ

జలికొప్పులను గప్పుచన్నులతోడ
మొలచి సములబాగు మురిపెంబుపొలఁక
జలజాస్త్రుడలుగులు జళిపించుకరణి
వలికిమేనులలో కింతవణఁకుచునుండ
స్మరగేహ పల్లవాంచత్తోరణముల
కరణి సిగ్గులపట్ల కరములింపొంద
మొగులువాసినమించు మొలకలో జోలు
దిగిచిన సూనాస్త్రు తేజులోయనఁగఁ
గవిసెన వెడలించు కన్నాళ్ళోయనఁగఁ
గవగూడియమునన దిగ్గనవెలువడుచు

వడిఁదెసెగురియు కల్వలదండలనఁగ
వడియుతోయములతో వలనొప్పు జడలు
చూడఁ జొప్పడఁగవాసులతోడఁ గూడ
నాడిరిచీర లిమ్మనుచు నావేళ
నాపాదపముదిగి హరియు గోపికల
యాపాదమస్తంబు లోసి నవ్వుచును
గరము కాంతాంబరాకరము తచ్ఛాఖ
కరమువేడుకఁ బట్టి క్రమ్మఱఁబల్కెఁ
జేలలు సడలించి చిరతరపుణ్య
శీలలు జలకేళి సేయంగఁదగునె

ప్రణతులొనర్పుఁడు పద్మాకళత్ర
మణికి యాదవశిరోమణికి మీకిట్టి
యనుపమ దోషంబులడఁగుఁదమంబు
నినుఁగాంచి తొలఁగి పోయినమాడ్కి-ననిన
శైల నిర్ఝరనీర సంగతాఖండ
బాలశైవలలతా పంక్తులయొప్పు
దొలఁక గుబ్బలొకింత పొలఁకఁదన్మధ్య

జలసిక్తరోమాళి సరణులేర్పడఁగ
బొటవ్రేళ్లు నిక్కనొప్పగనొంటికేలు
నిటలంబునందుఁ బూనికఁ జేర్చి మ్రొక్క
గేలికై ననునొంటి కేలి యీమ్రొక్క
లేల నియ్యవిశాస్త్ర హితములేతలఁపఁ
గరయుగంబుల మ్రొక్కఁగా నొప్పునిప్పు
డరవిందలోచనుఁడనిన గోపికలు
మ్రొక్కఁబోయినవేల్పు ముందఱనిల్వఁ
జిక్కనియీవట్టి చింతవేలనుచు
ఫాలభాగంబులఁ బాణిపద్మములు
గీలించితను నాత్మగీలింప శౌరి
చఱునగవి గురించి చిగురాకుమోవి
నెఱియఁబుట్టంబులా నెలఁతలకొసఁగి
కంటిఁజొప్పడని మీఘనమైన కోర్కి
గంటిఁ జేకొంటి ముంగలి రాత్రియట్లు
భావింతుననుచునప్పుడఁ తులఁబనిచె
బృందారకార్చిత పూజుండు నగుచు
నందనందనుఁడు మందలవారితోడ
యమునవయ్యమున నొయ్యనఁ జేర్చియచట
నమలసైకతముల నాటలాడంగఁ
బటుతరాతపమున బడలి గోపికలు
కటకటాకృష్ణయాఁ కటనిట నొవ్వఁ
గనుఁగొని మాకొక్క గతిచెప్ప మిప్పు
డనవిని శౌరి చయ్యనవారిఁ బిలిచి
కులశీలయుత విప్రకుల జాతలగుచు
మెలఁగు మద్భక్తి గామినులుఁ గామినుల

రాగంబులోనాంగి రసమను నొక్క
యాగంబు ప్రాణేశులాచరింపంగ
నున్నారు బలకృష్ణులున్నారటన్న
నన్నంబు వెట్టెదరని పంపనరిగి
జన్నంబు గావించు జనుల నీక్షించి
యన్నంబు వేఁడిన నగ్నులై వారు
పరిహరించిన శౌరి పలుకులుదలఁచి

పరశీలయుతల సువ్రతల నానతుల
సిరివరుఁడీవన సీమలో మీదు
కరము భక్తమున్నకై కరము వేడుకను
నున్నాఁడుతడవుగా నున్నాఁడువేఁడు
చున్నాఁడు మిమ్ము రమ్మన్నాఁడటన్న
ననలు తీరలనిండ ననిచినగరిమఁ
దనువునఁ బులకలు దట్టమైనిగుడ
లోలాక్షులామాటలో వెలిగాఁగ
మేలైన యన్నమర్మిలిఁ బొందుపఱచి
కొనివచ్చుచోఁ దేరకొని వారిపతులు

కనలియడ్డము సెప్పఁగానీయకొనక
హరిపరాఙ్ముఖమైన యజ్ఞాన పటలి
హరిభక్తిమీఱిన యట్ల మీఱుచును
బతులమాటలకు లోపడక యావిమల
పతులు చయ్యనవచ్చి మాధవుఁగనిన
వనజాక్షుఁడా విప్రవనజలోచనల
గనుఁగొని యంతరంగముననుప్పొంగి
యన్నలు గొనివచ్చునయ్యుత్తమాన్న
మన్నయు సఖులుఁ దారట నారగించి
నేమంబులరసి వచ్చిన సతీమణుల

నామోద జలనిధినోలార్చి మీపతులు
రారందురేమొ బోరననరుగుడనుడు
వారని ప్రేమమ్ము వారనిరంత
వారెమాటలనెల్ల వారించి వచ్చి
వారిఁగై కొందురే వారువెండియును
బతిలైన నీదయా పదలేనియట్టి
గతిలైన నీవయో కమలాక్షయనిన
నిహపరంబులు మీరలిచ్చినఁగల్గు
మహినెవ్వరికినైన మానినులార
మామక పదభక్తి మతులైనమిమ్ము
నేమియుననరు ప్రాణేశులు సుతులు
నని వీడుకొలుపఁ బాయని సంతసమున
జనిసతుల్ పతులకీ సరణిఁదెల్పినను
ముందెరుగని విప్రముఖ్యులవ్వేళ
నందనందను రమానాదుఁగా దెలిసి
పొక్కుచుఁదమడెందములలోన వేడ్క
మ్రొక్కుచు ఘనజపంబులఁ దపంబులను
గనియునుగానమీ కాంతలు సురలు
గనలేని తేజంబుఁగనిరెంతవారొ
యనుచు నీరీతుల ననుతాపమొందు
చును గంసభయమెన్నుచునునుండిరంత
వ్రజములో వల్లవవ్రజముతో నపుడు
వ్రజపతిమనము దేవప్రభుఁ గూరి
యాగంబు గావింతమని సర్వవస్తు
యోగంబు కొఱకనుద్యుక్తుఁడైయున్న
దేవకీతనయుండే తెంచియానందు
భావంబు తనయాత్మభావించి పలికె

# అష్టమహిషీ కళ్యాణము

కాలాత్మకుఁడు హరిగానఁదదాజ్ఞఁ
గాలకాలమునఁ దత్కర్మధర్మములు
చేకూరు నింద్రుఁ బూజించినమీఁదఁ

గాకతాళన్యాయ గరిమ వర్తించు
సురపతిఁ బలియించుఁ జాతురుగాని
హరి జగత్పతి యనియరయ రెవ్వరును
బరమాత్మ విలసన భవనంబులైన
సురభుల గిరుల భూసురులనర్చించు
యాగంబుమేలొ యాకాశాధినాథు
యాగంబుమేలొ మీఁర రసికన్గొనుఁడు
ఇలవేల్పులింటిలో నెదురు చూడంగఁ
బలువేలుపులఁ గొల్వఁబాటినతీతి
నడవులఁదరుల మహాశైలవరులఁ

గడుపులోపలి చల్లగ దలకయుండఁ
బ్రాపులై దాపులై పగలును రేయి
కాపులైయుండు గోగణములుండఁగను
సురరాజుఁ గొలుతురే జోకగాపీని
నురుపుణ్యుఁ బూజింప యోజింపఁదగును
సీయెడమీఁతోడనేఁ బల్కుతెలుఁగు
న్యాయమో కాకయన్యాయమో యనుఁడు
తలలూఁచిరపుడు చెంతలనున్న గోప
కలవృద్ధులా దివ్యగుణవృద్ధుఁ జూచి
నందుండు ముదినుబ్బనందను మాట

చందంబుగనియట్ల చాటంగఁ బనిచె
మగువలువ్రేలు నేమములు హోమములు
జగతీసురులచేత సరవిఁ జేయించి

ముందఱ వృద్ధులౌ ముందటఁబసులు
సందడిదగిగట్టి చాలుగానడువ
జడలముప్వలసన్న సంకులనిడుద
యొడిబాగుతో నొప్పుచుండు బాలకులు
కలువదండల చంద్రికలు చుట్టు పగిదిఁ
బొలుచు సంకులునురంబులు తేటపడఁగఁ
బ్రతిలేని గిరుల శంపలునటియించు

గతిబొట్లుపేర్లుచన్న వలపై బెళుకు
అలికాంతరముల ఛాయలఁబిండిబొట్లు
కలితాబ్జములఁ గర్ణికలనవ్వుచుండ
బ్రేకంబులగుకంచువెడఁదమట్టియలు
తాఁకుల కెడనెడఁ బ్రాఁకి మ్రోయంగ
నిలువేలు పులకుముస్నెక్కించు చాఱ
జిలుఁగుఁ బుట్టంబుతోఁ జెఱఁగులుపడఁగఁ
గట్టి బాలకులఁ జంకలఁబెట్టి చిట్టి
గట్టి చుట్టలమీఁదఁ గంపలువెట్టి
బ్రేతలు నడువంగ బ్రేలువేవేలు

రీతుల తమజాతి రీతులు మెఱయ
వెడవెడగానేయి వెడలనికఁరులఁ
బెడతండ్లసికలునూనఁగఁ దీర్చియున్న
యొసవరినామంబు లొకవింతచూపఁ
బట్టుక్రొంబసలఁ జొప్పట్టు పర్ణములఁ
బట్టిముంగలవేల్పు పసిఁజొప్పుకొనుచు
వరపరమాన్నముల్వడలు మీఁగడలు
బెరుఁగు లాజ్యంబులు పిండికూరలును
గుడములు పాలు నౌగులు పంచదార
కడియంపుటట్టులఁ గమ్మబూరియలు

## అష్టమహిషీ కళ్యాణము

లనఁటిపండులును శాల్యన్నముల్ తేనె
లును జున్నులు వెన్నలును నాదిగాఁగ
గములుగా శకట సంఘములనమర్చి
గుములుఁగావాలి చక్కఁల నడపింప
తొలఁగద్రోయఁగరాక త్రోవ గిక్కిఱిసి
వెలిమీఁటి శ్రీరామవెల్లుముపోలె
సలలిత వాద్యఘోషమున ఘోషమునఁ
గలవారలెల్ల నొక్కటనేగుచుండ
రామ గోవిందుల గ్రమునఁబిఱుందఁ
గామినుల్ తనరెండు గడలబాంధవులు

నొప్ప నందుఁడు నొక్కయొప్పుల కుప్ప
గొప్పైన తేరెక్కి కొనియేగుదెంచి
గోవర్ధనముఁగనుఁ గొంచునావిప్ర
గోవర్ధనునితోడ గుంపుగావిడిసి
వల్లవీ వల్లవవరులతోఁ గూడ
నుల్లంబులోఁ గడునుల్లసిల్లుచును
అగ్గిరిధేను విప్రాళిఁ బూజించి
యగ్గిరి వివిధోపహారంబు లొసఁగి
కర్తభోక్తయుదానకానయా దైత్య
హర్త యింద్రుఁడు గుందనజుఁడరుదంది

యచలాచలాత్మకుండగుటఁ దత్పూజ
నచలంబులోనుండి యవధరించుచును
జోద్యమందుచుజనుల్ చూడనై నిలిచి
హృద్య నైవేద్యంబు లెల్లనొక్కటకు
గేలుసాఁచుచు నారగించె మోదించి
లాలించిపలికె వల్లవువెల్ల వినఁగ
నగమూర్తి నైన పన్నగమూర్తినేను

మిగుల నిష్టములఁగామింపుఁ డేనిత్తు
ననఁగనచ్చెరువంది యతిముదంబంది
ఘనశైలవర్తి మేఘశ్యామమూర్తి

దామోదరుని మూర్తిఁదలఁచి యామూర్తి
యామూర్తియని గోపికాళిఁ గీర్తించి
దయ జూచికాచియిందఱదరి జేర్చి
పయిరులెన్నఁగఁ జేసి బ్రదికించు సామి
యనుడు శైలముమీఁది యావేల్పు వేల్పు
జనులార కోరునిష్టములెల్ల మీకుఁ
దలకూడుననుచు నంతర్ధానమయ్యె
నల గోపకులు సంభ్రమాకులులగుచుఁ
బసులతోనచటి తాపసులతోఁగూడఁ
వసుధేశ యగ్గిరి వలచుట్టివచ్చి

భుజియించి తద్యాగ భాగశేషములు
భుజియించి మిగుల సొంపులఁ దేలితేలి
యొంటొంటి యాకుతోనొనగూడుచుండ
గొంటుపక్కలుచోరు గొట్టుచునమలి
కసిగలసిగల సంగళ్లఁ బూదండ
లొసపరిబాగులై మొనరంగఁ జుట్టి
పండారు గలపిన పసిమిక్రొమ్మిసిమి
పిండిగంధములు ముప్పిరిగొనఁ బూసి
మోలోలయని పల్కి యొకగొల్ల చీరఁ
గోలమూఁపుననిడి కొని కేలుసాఁచి

(ఈజాతివేలపదము)

దండనేమముగాదు దయబొల్లి మేర
కొండవేలుపుకదే కోడెవో రాజ

గొల్లమైయలకంచి కొండపై మేయు
పాలమున్నీటిలోపలనీఁదులాడు
లావునఁ జొరఁబాఱి లంకదూఱాడి
దీవులనెల్లను దిరుగునో రాజ
కల్లలవడదోయు గబ్బినాకోడె
కల్లరిమన్నీలఁ గడకాలనూఁకు
కలరాజునెరనన్న కన్నులై రాఁగ
నలనన్నరిపుల నెంతయు గెల్చె రాజ

సిరిగలనాకోడె సిరులిచ్చుననుచు
బిరుదులుపచరించి పెక్కులాగులను
కంచుకొమ్ములతాళ గతలకునూఁదఁ
జంచులచెలరేఁగి చప్పట్లుచఱువ
కోదండలిడివిర కొలచ్చళిన
నాదింపవైచెఁ జెంతల నొక్కఁడొకని
గేలుకేలునబిగ్గఁ గీలించి పట్టి
సోలికి నిలుచుండి సోలియాడుచును
ముంజ్జగబ్బుల తుట్టుముదుకవెంద్రుకలు
ఝంఝరింపఁగ విదుర్చుచుఁ జుఱ్ఱుమనుచుఁ

జిందలు కొట్టిమైఁ జమటలుం దొట్టి
కందామరిదిగంగారఁ గ్రేళ్లుఱికి
యొకకాలుగుంచి వేఱొకకాలు భూమి
వకవకలై వేలవడి మెట్టి మెట్టి
చెలఁగివేలుపుఁ బెద్దసివ మాడువారు
పలుమఱుఁ బొంగి వ్రేపతిసాఁటివారు
వరద గోపికులవర్ధన దేవ
బిరుద యాదవరాజఁ జేకొందమనుచు

నుడుకుచు సోదికినున్న పాయసము
తోడికిజుఱ్ఱుచుఁ గంపఁ దోషపులెక్కుచును
మ్రొగ్గకయరకాలములుఁ గాఁడకుండ
నెక్కుయావేల్పుఁ బోడిమినెన్నువారు
కతుకంబుతోఁ దోడి గొల్లలు వేల్పు
కతసెప్పవిని శిరఃకంపంబు సేసి
చెలగివీనులఁగేలు సేర్చి గొబ్బిళ్లఁ
బలుతెఱంగులఁ గూడి పాడెడువారు
మొనవ్రేళ్లు శ్రుతులు గ్రమ్ముచు వెన్నెలార
యనుచుఁ బాడెడువారు నగుచునుండఁగను
బొంగెడు పొంగళ్ల పొంగుచునుండ
సంగడి బసులు నిచ్చల మేయుచుండఁ

గుడుపు దప్పినయట్టి కోపంబుతోన
నుడికింప మేఘవాహుండు బిట్టుగెరలి
ప్రళయ ధారాధరపంక్తి నీక్షించి
పలికెఁ జూచితిరె భూభాగంబునందుఁ
గుల గోత్రపత్ర సంకుల రక్తసిక్త
కులిశంబు ననిశంబుఁ గొనగేలఁ దాల్చి
ననుడించి నందనందనుకు వాదములు
విని పల్లవులు పనివిని రొంటిగట్టుఁ
గని పూజ సేసి యక్కడనన్నుఁబేరు
కొనకగై కొనక పొంగుచున్నవారు

నెల మూఁడువానలునేఁ గురియింపఁ
బొలమునంబసులమేఁపుచుఁదలల్ గ్రొవ్వి
పోసరించినయట్టి పులివోతుగొల్ల
లీసడించిరితుదనిఁక నెద్ది మేలు

భూరి కర్షోపలా పూరిత వజ్ర
దారుణతర వర్షధారలచేతఁ
బాదివిగొల్లలమూఁక పాదివిచ్చఁజేయుఁ
డిదెవత్తు మీావెంటనే నింతనంత
నని నిగళములూడ్చి యంచినఁ బోయి
యనిఁ జూచి కెరలు వీరాగ్రణులనఁగఁ

బెంపు తెంపు నటింపఁ బెరిఁగి మేఘములు
గుంపులై నీరాళ గొందికై మొనసి
మొఱలూడ్చిచిమ్ము మహోగ్ర ఖడ్గములు
తెఱగున శంపలు దివినుప్పతిలఁగ
ఘనసింహరవముల కరణిఁద్రిలోక
జనముఁ భీతిలఁగ గర్జనము చేసి
శర్వకంఠముపట్టు చాలకనింగిఁ
బర్విన విషముల పటలియోయనఁగ
కారుక్రమ్ముచు సీరిగ్రక్కుచుఁబొదలి
ఘోరమ్ములగు పిడుగులతోడఁ గలసి

భయదమై వర్షంబు పట్టెఁ బట్టుటయు
బెడిదంపువానఁ గోపికలు గోపకులుఁ
దడియంగ గోవులెంతయు జడియంగఁ
గని భక్తలోక రక్షణ దక్షుఁడైన
దనుజారి కెమ్మోవి దరహాసమెసఁగ
వ్రజమునకఖిల గోవ్రజమునకటవి
ప్రజలకు నేకాతపత్రంబుగాఁగ
నల కొండనెత్తి బాహాదండమమరెఁ
నిలఁదలమోచు ఫణీంద్రుఁడోయనఁగ
లలితాచల శ్రీవిలాస హర్మ్యమున

నలఘునీల స్తంభ మనఁగ నవ్వేళ
శస్త్ర దేవాగమ్య చరణనీరేజ
హస్తయోగము గల్గెనని పొంగి యద్రి
హరికిఁ బుష్పాంజలు లర్పించెననఁగఁ
దరులు గంపింప నందలి విరుల్రాల
వడగండ్లుగిడిఁదాఁకి వ్రక్కలై మగిడి
యుడువీథి నడురేయి యుడుపంక్తి దెగడు
అంబరవర్ణు చేయంటుటవలన
నంబరచరభావ మందెనోయనఁగ
జడివట్టునాయల జడికోర్వలేక

వడఁకుచు వనమృగావలి మింటికుఱుక
శరద నాదముల కిచ్చలఁబొంగిమాఱు
సరిలేనట్టి కేసరులు గర్జింపఁ
గడిది నాగములు వేగముల మేఘములఁ
దొడరు చందంబునఁ దొండముల్ సాఁచి
పనిమినెదుర్చు శంపలఁ బట్టెననఁగఁ
బసిడితీవెలఁ జుట్టి ప్రాపుగాఁ బట్టి
గురువజ్రహారులచేఁ గురువిందఖనులు
నెరయుంగనంగార నికరంబులనుచు
నాతలనున్న విద్యాధరుల్ జడిసి

శీతాపహరణ వాంఛితమతిఁ గదియ
నేడుగాడ్పులతోడ నేకమైవాన
యేడు రాత్రులఁ బగళ్లీరీతిఁ గురియఁ
జెలఁగియెక్కుపఁ బొడిచెనో ప్రొద్దటనుచు
నెలకొని గిరిక్రింద నెమ్మదినుండు
గోగోప గోపికాపలముల బలము
జాగుమై గురియు నాజలదాళి బలముఁ

బటుతర హరి దివ్యబాహుబలంబుఁ
జటులాభ్రచారులౌ చారులచేత
విని వజ్రి యామేఘవితతి మరల్చి
తన మనోవీథిఁ జింతన సేయుచుండెఁ
గమలాక్షుఁడపుడు చెంగటనున్నయట్టి
తమవారిఁగని దుష్ట తమవారియడఁగెఁ
గావిరి విరిసె దిక్తటులు రాజిల్లె
మీ వైభవంబుల మీరుండుఁడనుచు
నవిరళశైలంబు నాతొంటిచోట
ధ్రువ పదంబును బోలె ధ్రువముగానిల్చె
జిష్ణుండు తలపోతసేసి కృష్ణుండు
విష్ణుండయనుచు భావించి దిక్పతులు
సురధేను గూడి భాసురభాను కోటి
నిరసించు కాంతినిఁ బూనిన శౌరిఁ జేరి
గురుతర మణికోటి కోటీర రుచుల
హరిపదాంబుజముల కారతుల్ గాఁగ
మ్రొక్కి కరాబ్జముల్ మోడ్చిమదంబు
దక్కి యానందాశ్రుతతి గ్రుక్కికొనుచు
దుర్మానినపరాధి ద్రోహి నిజడుఁడ
గర్మబద్ధుండ జగన్నాథ నిన్నుఁ
బశుపాలుఁడనుచును బశుపాలబుద్ధి
వశుఁడనై తినిగావ వలయునన్ననినఁ
జిఱునవ్వు మోవిపైఁ జిలుకంగఁ గరుణ
నెఱయ నింద్రునిఁ జూచి నీరజోదరుఁడు
నన్నుఁగానని నీమనంబునఁబొదలు
కన్నుఁగానని రాజ్యగర్వంబుఁ దునుము
నింతసేసితినింతె యింకనావంకఁ

జింతమానక నిజస్థితి నుండుమనుచు
నాదరించినవేల్పుటావు శ్రీదేవు
పాదపద్మములకు బ్రణమిల్లి పలికె
సరలకు నఖిలభూసురులకు నిఖిల
సురభులకును నీవసుమ్మదైవమవు
విందవు నీవు గోవింద పట్టంబు

నొందిన సౌఖ్యంబు నొందునాశ్రితులు
అని చెప్పియజుఁడు నన్పంచెనో దేవ
యని పయోదభరంబులలరంగఁ గురియు
క్షీరంబు స్వర్ణదీక్షీరంబు జలధి
నీరమ్ములును నవనిధులుఁ బూరించి
భారతీపతి నిశాపతి దిశాపతులు
ధారుణి గౌరిదిగ్దంతులు మునులు
దివి నుతింపఁగఁదాను దేవమాతయును
నవిరళ శ్రీయుక్తి నభిషిక్తుఁ జేయఁ
దోషించె మునిగణస్తోమంబు మింట

ఘోషించె దుందుభుల్ ఘుమఘుమయనుచు
సురభర్త యప్పుడాసుర హర్తకెరఁగి
యరిగె నావేలుపు టావుతోనంత
కలగోపి కలకోరి కలకాకరాక
వెలయఁ గాముక మృగవితతి సాధింప
వెడవిల్తుఁడను గంటవేఁటరిగూట
నిడిన దివియపోలెనినుఁ డస్తమించె
ఘన గోపికానురాగము శౌరిగప్పు
ననువునఁగెం జాయలడరె నభ్రమున
బిసరుహాప్తుని కీర్తి బీజసంతతుల

పసులొత్తెననఁగ నక్షత్రంబులెసఁగె
నెడపకమరుఁడు సోమేఘవుల్వుఱప
గుడివడు శితఖడ్గ కోదండమనఁగ
నలరువిల్తుని మామయగు చందమామ
కళలతోఁ బూర్వనగంబుపై నిలిచె
వెన్నెలచవి చూచి వెన్నెలపులుఁగు
లన్నులకొనఁగ వారదిమెచ్చి మెసఁగ
నుడురాజుఁ గాంచి పయోధిమిన్నంట
వడిఁబొంగెనోయని వఱపెఁ జంద్రికలు
పొదలఁబూఁబొదల నింపుదలిర్పఁ జలగి

మెదలు తుమ్మెదలెల్ల మెఱసి నాదించెఁ
దమ్ములఁగలువ మొత్తమ్ముల పట్టు
దమ్ములవర మరందమ్ములందరుల
నమ్ముల వివిధ ఫేనమ్ములనొప్పు
యమునకూలమునఁ దివ్యమునఁ గోవిందుఁ
డమిత జగన్మోహనాకారుఁడగుచు
మోదించి కల్పకమూలేందుకాంత
వేదివైనత్కళా వేదిపై నిలిచె
కనకంబునగుచాయ గనుపట్టుపట్టు
గొనబురంగుల చెఱంగులు మించఁగట్టి

లలితసౌరభ రసాలంబ రోలంబ
తిలకమై వైజయంతీధామమమర
వెడవిల్తువింటి క్రొవ్విరికల్వ తూపు
దొడిగినకేవఁ గస్తురి నామమలరఁ
దారపంక్తుల వియత్తల మొప్పు కరణి
హారజాలముల బాహామధ్యమమర
సిరిపదాబ్జములకై చేరు భృంగంబు

వరుస వత్సంబు శ్రీవత్సంబు చెలఁగ
గగనకోణాంగణ కంజాతమిత్రు
పగిదివక్షము కౌస్తుభము తేటపడఁగ

వరసోమమణిలో సువర్ణ ఖండంబు
కరమొప్పఁగతియెదఁగల పద్మ మెఱయఁ
గనకాద్రికూట సంకాశ కిరీట
ఘనకాంతి దశదిశాంగణములు వొదువఁ
దళుకొత్తునిక్షు కోదండంబు దండంబు
జలజకాండ బు కాండిమునంకుశమ్ముఁ పాశమ్ముఁ
దరచక్ర దివ్యసుందర గదాసూన
శరములు బాహుపాశములఁ గీల్కొలిపి
చరణంబుపై నొక్క చరణంబు నిలిపి
మరునినవ్వెడు భంగిమలఁగిఁ త్రిభంగి

నంగీకరించి మోహాన భావమొదవు
గాంగేయమురళిఁ జిక్కఁగమోవిఁ జేర్చి
వివరంబుగా వేణువివరంబులందు
నవరగావర కరశాఖలల్లార్చి
ఘన రత్న కంకణాంగణ కాంతి వదన
వనజాతమునకునివాళిగై పరఁగఁ
దళుకుఁగల్వలదండదండ సంవ్యాంప
తలములఁ గుండలాంతముఁ గొంతరాయ
శీతాంశుమై తేట చిలుకుచునుండ
వాతెఱవంచి భ్రూవల్లి నిక్కించి

(సర్వేశ్వరుఁడు వేణునాదము సేయుట)

కారుక్రమ్మెడు సోఁగకటివంకబొమల
తోరబిత్తరిచూడ్కి యొరపు మీఱంగ.

మాయురేయన మంద్ర మధ్య తారములు
నాయతంబొనరించి యణకువమీఱ
రంగురక్తియు మధురములుట్టిపడఁగఁ
బొంగెడి రసముల పొలుపు దీపింప
వివిధంబులగు నేకవింశతి శ్రుతుల
జవకట్టినట్టియా సప్తస్వరముల
కులమేర్పరించి తద్గోపికాశ్రవణ
ములకలంకృతులుగా మొగినలంకృతులు
రూపించి గ్రామగారోహావరోహ
నైపుణ్య వివిధవర్ణములు చూపుచును
సమ శుద్ధ సాళగ సంకీర్ణ గతులు
క్రమముననెడుట రాగములు నర్తింప
నాణెమైమిగుల విన్నాణమై యొప్ప
వేణునాదంబు గావించెనవ్వేళ
గానంబు విమలంబు గానంబు సేయఁ
దానంబు లమృతసంతానంబులొసఁగ
జగతి బర్వినపూరి నగమేని మేసి
మొగి మృగంబులు మొగంబులు మీఁదికెత్తి
యరగన్ను లిడిమేఁతలాత్మలో మఱచి
సురభులు మోదించి చూడంగఁదొడఁగె
నురగనాథుఁడు చొక్కుచుండె నీరసపుఁ
దరువులిగిర్చె శిలాతలములు గరఁగె
రాగ మోహన మంత్ర రాజంబు సకల
భోగికన్యల నాగభోగికన్నికల
నరిదినాకర్షించి హర్షింపఁ జేసి
నరనాథభువన మంతయుఁ జొక్కఁ జేసి

భువనమోహన రసస్ఫూర్తిచే సకల
భువనముల్మఱపును బొందు లే మరుదు

హరియుఁ దన్మయుఁ డయ్యె నయ్యెడ నాథ
గరిమ యేమని చెప్పఁగా వచ్చు నంత
నందనందను వేణునాదేందు కాంతి
నందితానంద బృంద మరంద హృదయ
కుముద్వలై సమద్వలై గోపికామణులు
రమణుల మించి శ్రీరమణుఁ గామించి
కుచములు గేటాడ గొనబులూటాడఁ
గచములల్లాడ ముంగఱలు మల్లాడ
నడవడి కడఁక నెన్నడుములు వడఁకఁ
గడుఁబ్రేమ మొదవుల వేగనయముల్వదలఁ

బయ్యెదల్ జాఱఁ బైపై ముద్దుగాఱ
నెయ్యముల్ బెఱయ నెంతే సొంపు మెఱయఁ
జనుదెంచి జలజాస్త్రి జలజాస్త్రిఁడైన
వనజాక్షుఁ గదియ శ్రీవరుఁడు వారలకు
సమధిక సుమజల క్షాళిత మదన
సుమబాణములవాఁడి సోఁకనిట్లనియె
తోడిఁ బడసిట్లు వత్తురె వనంబులకు
నడురేయి మీరలెన్నఁడు రేయివగలుఁ
బతులు మాటకుమాఱు పలుకనివారు
సుతుల నాయకుల వస్తులడించి పొంచి

పరుననున్నఁ గామింపఁ బాడియె యనుడుఁ
బరుఁడవేయుల పరాత్పరుఁడ వేయనుచుఁ
దరుచుగా గోపికల్ తరువులు పెట్ట
నోఱపుఁ దొంగలితెప్ప లోకయింతవంచి

లలిత చంపక ముకుళములోను వాయు
వొలయు చందమున నిట్టూర్పులు నిగుడ
వరకూర్మపోతముల్వసుధ నటించు
సరవిఁబాదముల భూస్థలము వ్రాయుచును
హరినీలముల కాంతులలరుముత్యములు
గరిమఁదజ్జల బాష్పకణములు దొరుఁగ

మిసిమి బింబఫలంబు మెసఁగు కీరములు
కసరుచందమున గద్గద నాదమెసఁగఁ
వేఁడివాఁడియు నొల్కు వెడఁబల్కు మతులఁ
గాఁడి పాఱఁగనాడఁగా నీకుఁ దగునె
తలఁపులో నెపుడు మాధవుఁడు మాధవుఁడ
తలఁపమన్యులమని తలపోయుమమ్ము
చయ్యన మగుడంగఁ జనుమని పల్కు
నయ్యయోయెట్లు నోరాడెరా నీకుఁ
బతులను మీఱఁ బాపంబంటి వఖిల
పతి నిన్నుఁ జేరుటే పరమధర్మంబు

ముక్కుమో మెఱుఁగకమో మోటపడక
మొక్కవీఁడను చందమున విడనాడఁ
బాడియేలేకొక్క పదముపదంబు
లోడవుమగిడియే మరిగెదమన్న
నధరకోమల పల్లవాలోల శీత
మధురామృతంబుచే మదనార్చినార్చి
ప్రాణేశ దయఁ జూడు పదరితివేని
ప్రాణముల్నీకు నొప్పన సేతుమింక
నజుఁడు గాయజుఁడు రుద్రాదిదేవతల
భజియింపఁ గోరునపాంగ చంద్రికల

## ద్వితీయాశ్వాసము

సిరి తులసీదేవి చేరియెల్లపుడు
శరణొందు నీపదాబ్జములె కొల్చెదము
నెఱయంగఁ గామించినే నెమ్మినమ్మి
మఱచితి మిదేనేఁడు మాయిండ్ల పనులు
వలపించి పిమ్మట వావిగాదనుట
పొలుచునే నీయట్టి పురుషోత్తమునకుఁ
దొలఁగ ద్రోచినఁ బోము తుదినింకతమడు
తలలకు నీడు పాదములకులంకె
యేలరా కృష్ణ మమ్మేలరాచలము
చాలురా నీకును జాలురా యిదియె

కలిమిపూఁబోఁణి చన్గవ గోరిమారు
యలుగుల పొలుసే యంగఁ జూచెదవొ
సతత శిలీముఖోజ్జ్వ లితంబులైన
యతను పాశములకు నప్పగించెదవొ
వలరాజు పట్టంపు వాజులనొప్పు
డెలయించు కెమ్మోవి నిచ్చెదొ వేగ
చలమున నీరీవి సారెకుమమ్మ
నెలయించి మరుబారికిచ్చెదొ చెపుమ
అకట నిన్ననేల హరియేము వచ్చు
సకిన పంతమున నిచ్చకు రాముగాక

యెట్టైన నీకింత యెచ్చైన పనికి
మిట్టిమీనంబవై మెఱయుదువచట
వలసియెల్లమి గాక వలసియుండినను
దలకొని కొండైనఁ దల కెత్తుకొందు
పొరబొచ్చములుగాక పొసగునందులకు
దరమిడి పాతాళ దరిదైనఁ జొత్తు

ఇతవుగా మిదిగాక హితకృత్యములకు
నతులిత లోహంబునైన భేదింతు
కపటంబుగాకిటఁ గాకుండెనేని
యిపుడ ఈ లోకంబులెల్లఁ జేకొందు

చిట్టకంబులుగాక చింతనించినను
బట్టబద్ధులనైనఁ బారబట్టెదవు
వేసాలుగాక నీవేనేయనున్న
నాసముద్రములైన నడ్డకట్టెదవు
తలఁగాకిట్టె తలఁచితివేని
గలయంగనేటి వంకలు దిద్దఁగలవు
భ్రమయించెదవుగాక పాటించితేని
కమలజాండములు ప్రక్కనెయడంచెదవు
వినరోరి పీనుల విందుగాఁ బెక్కు
లననేల యింక నీవగుటమేమగుట

గచ్చిమాటలుమాని కడచి పల్కినను
గుబ్బచన్నులఁగూల ద్రొమ్మెదుమిపుడు
సరసడాసిసనేల చనిరొమెదువాఁడి
మరుతమ్మిమిట్టలే మాకుచాగ్రములు
పదరిపల్కెదవు చేపట్టినంతటనె
మదనపాశంబులె మాబాహులతలు
అరిది పల్కినఁ దూరనాడినమారు
తురగహేషలె మామధురభాషణములు
అకటచూచిన యంతనలుగనేమిటికి
మకరాంకుచిలుకులె మాకటాక్షములు

అనినదైన్యంబు నొయ్యారిచందంబు
గనుపట్టి సరసవాక్యములకు మెచ్చి

హరినవ్వి కౌఁగిటనలమి కాళింది
దరుల నాగోపసుందరులఁ జొక్కించి
అలినాద సామ గానాళితో బింబ
ఫలరస వరసోమపానంబు సేయు
శుక పిక ఘన ఋత్విజుల ఘోషములను
సుకుమార సుమలతా స్ఫురిత యూపములఁ
ప్రచురమరంద ధారావారమిళిత
రుచిరపరాగ పురోడాశతతుల

దర్పిత పారావత ప్రాంశునాద
దర్పక వేదమంత్రముల సంఫుల్ల
మంజరీ బహుపుంజ మంజు నికుంజ
రంజిత శాలల రత్నవహ్నులను
అరవింద హోమకుండాలు కల్గి
యరవిందనారామ యజ్ఞవాటంబు
కరణిఁగాళిందిలోఁ గాంచనద్యుతులఁ
గరమొప్పునొక్క సైకతము నేకతము
గఱగ నీక్షించి యక్కడకేగుదెంచి
పిలిచిపైకొనెడి రూపికల గోపికలు

ఫణిభోగభోగికై ఫణిరాజువేయి
ఫణములు పఱచిన బాలిచెన్నొందు
నెలచెల్వరాల వెన్నెల సొగడాలు
చిలుకొట్టి సేవంతి సెజ్జలమీఁద
నూరుకేళీలోల మతులగావింపఁ
జేరివారలఁ జేరి చెలకుచు శౌరి
కేలనందముల సాలగించుచు వలచు
వలపులగాలిచే వడాల సేదదీర్చ

లలిత కరాగ్రపల్లవ పంక్తిచేతఁ
దొలుతఁ గళావనుల్ తోరణకట్టి

రతిమనోహర మహారాజ్య వైభవము
లతిమనోహరలీల ననుభవించుచును
సతులయాగములుఁ దత్సామ్య వస్తువులుఁ
బ్రతివోల్పరాక మార్పడియుండ జూచి
జిగిమోవులని చెంతచిగురులనాని
మొగరైనఁగావని మోాలంచు సేసి
చనుగుబ్బలనుచు మంజరులజేపట్టి
ఘనమార్దవములైనఁ గావని విడిచి
యరిదిముంగురుల నియలులకు నొడిసి
మొరసినఁగావని మొగినవ్వనగుచు

చాలలనలకాప్త ఫాలలఁ జతుర
లీలలచేత మేలిమిఁ జొక్కఁ జేసి
శ్యామల మరకత శ్యామలమరుని
సీమల మిగుల మచ్చికలఁ దేలించె
ప్రౌఢల రతికళా ప్రౌఢులహోవఁ
రూఢలవింతకూర్మిలను మెప్పించి
తనువొత్తి సేయునేఁ తకువాఱు సేయు
ననువునఁ గొనగోళ్ల నలగుబ్బలొత్తి
బట్టిడనొకలేమ నొడికినెన్నడుము
పట్టిచిక్కఁడిటంచుఁ బలుకుటఁ జూచి

దండ భ్రూవిజిత కోదండయొకర్తు
నిండుసట్టాలయింపై నీలవర్ణుండు
కొలగేలఁ గొండగై కొనకెత్తువాఁడు
తనిసి మెత్తఁగఁ జూచెఁ దత్కుచద్వయము

రమణీయ సతులతో రతులనీగతుల
సుముఖుఁడై హరిగూడి చొక్కి వెండియును
అమలమైతార పద్మాకారమగుచుఁ
గమలాస్త్రుతోలిమాఁపు గతిశౌరి చూపు
మల్లికా ఝల్లరీ మహితధమ్మిల్ల
వల్లరిహృదయజే వనజముల్గెరఁప

నొక తెఱంగునను వేఱొక తెఱంగునను
జికురభరంబులోఁ జెప్పఁ జూపట్టు
నిండుతావులపిండు నెలువెడు పొగడ
దండ కృష్ణునిమెడ దండఁ గీలించి
యురుహార పద్మరాగోపలంబెత్తి
నిరతిమైఁ బండువెన్నెల యుండనాని
మసలక కైకొన్న మాయానధనము
లొసంగ దోసిరపుగానుండెదోయయినిన
సరస భావముల నాసకీయకుంగృష్ణుఁ
డరువిరాధరంబు భోగ్యంబుగానిచ్చె

జాంబూనద ప్రభ స్తనకుంభఘర్మ
జాంబుపూరంబుల నభిషిక్తుఁ జేసి
చెలువమెక్కటె మధ్యసింహాసనమున
బలసోదరుని రాజ్యపట్టంబు గట్టె
రోమాళినొక ముగ్ధరుచిరాంగి కపుడు
పామసి భ్రమయించి పట్టుచు శౌరి
యలక లలాట నేత్రాధర గండ
గళదండ కుచపక్ష గంభీర నాభి
కటిచక్ర జాను జంఘా పదాంగుష్ఠ
చటులదేశముఁ జంచద్విలాసములఁ

బట్టిచుఱున నఖ శౌహాంకృత్యముల
నిట్టిచేపెట్టెడి కృత్యచాతురులు
గలుగనంగాగ సంగతుల నీగతుల
లనిఁ జూపి సకలకళాప్రవీణతల
సకల గోపికల కాంక్షలు దీఱమఱియు
నొకపరివేయు బాహుల గౌఁగిలించి
తెరలక వేయివాతెరల చేనొకటఁ
దరుణుల యధరముల్తనివాఱఁ గ్రోలి
చదుకున నఖసహస్రముల నొక్కుడను
నుదుటు గుబ్బెతలపై నొత్తులొత్తుచును
నొక మోహనాంగిపై నొరగి లాలించి
యొకబిత్తరికివీడిమొసఁగి మెప్పించి
యొకవన్నెలాడితో నొఱపులు నెఱపి
యొకనేరుపరితోడనొనఁ గూడి చెలఁగి
యొకవిలాసినిఁ జూచి యొయ్యనఁ దెగడి
యొకచిలుకలకొల్కి నొరపి రమ్మనుచు
మకరాంకుకేళి నిమ్మాడ్కిఁ జొక్కించి
హరి గోపికా మోహనాకృతుల్జూచి
వరుసతో వేర్వేఱ వర్ణింపఁదొడఁగె
కండచక్కెఱొప్పుల కండంపుతునుకొ
దొండపండొనవాతో దీనిమోవి

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

సతతంబుఁ జెడని కంజము గల్గెనేని
సతిమోమునకుఁ గింతసరియన వచ్చు
వెలమఁగుత్తుకబంటి విషములోనుండి
కలువలుతప మెంతగాలించె నేని
సరవి నానాఁటికి జడియుకేకాక

తరుణి కన్నులతీరు తమకేలకలుగు
నతివనెమ్మొగము సోయగమెన్నఁ గుముద
పతిబింబ మదిపూర్వపక్షు మేతలఁప

నలవి మీఱిన ముత్తియంబులనొక్క-
కొలికికిఁదెచ్చు నీకొమ్మ పల్వరుస
వన్నెలాడుటగాక వనితమై బాయ
యున్నదే పగఁడికి నొఱసి చూచినను
గచ్చులాడుటెకాక కలికిపాలిండ్లు
బచ్చనసకినల పరిపాటులన్న
వడి చూచుకొని యంతవచ్చిన శిరము
పడఁతిమైడాలుకు బ్రతిమేల వచ్చుఁ
చౌరపొచ్చెములుగాక పొలఁతియూరులక్క-
సరసరంభలనెల్ల సాటివెట్టుటలు

యరసియుఁ బోదివిచ్చు నాడుటకాదే
తరుణిజంఘులకు చిత్తళిగలీడనుచు
ననుచు నీక్రియల మోహానరత్రిక్రియలు
దనిపియోలార్చున త్తఱిఁ జేలరేఁగి
దర్పకగురుతోడి దర్పక కేళి
దర్పించితిమో గోప దర్పణముఖులు
దక్కెఁబోఁ మకరకుండల భూషణుఁడు
చిక్కెఁబో నాకు రంజిత భూషణుండు
వలచెఁబో నాకు జీవనసన్నిభుండు
కలసెబో నన్ను శ్రీకామినీవిభుఁడు

యిచ్చెనే మడిగినవెల్ల భూధవుఁడు
వచ్చెఁనేమున్న క్రేవలకు మాధవుఁడు
అని నిజరూప రేఖాదిసంపదల

నన విల్తుసతినవ్వనినబోండ్లఁ జూచి
కలసి మేనులఁ దమకము పుట్టఁ జేసి
కలయుట రతికళా కౌశలంబనుచు
మలయుచు విటశిఖామణి శౌరివారి
నెలయించియటఁ దిరోహితుఁడయ్యెఁ జెంతఁ
జైకొన్నతదనులాపములఁ నన్యోన్య
లోకనాకృతులఁ నాలోకింపుచుండె

కాంతాకరాధీశ కరసుధాసిక్త
కాంతారమున గోప కాంతలాం శౌరిఁ
గానక చెగడి మేఘముఁ జూసి దెసల
నూనిన మెఱపుల యొఱపుఁ గైకొనుచు
విరహా తాపాంబుధి వెలువడుజాడ
లరసి యాతనినాను మనుతెప్పఁ జేరి
పన్నీటిచెమ్మచేఁ బదనైనయొక్క
తిన్నని కస్తూరి తిన్నె నెన్నడుమ
కమలాకుచాగ్ర సంగతి పాదకముల
కమలచిహ్నంబుల గలిగి యేర్పడిన

యడుగులఁ గాంచి కృష్ణాయంచునతని
నుడువుచుఁ గదిసి కన్నుల నొత్తికొనుచు
చీఁకటినరవాయు శశిరాంశుకళల
నాఁకటితమిగ్రోలియల చకోరాళి
నడలించెననఁగఁ గజ్జల జలధార
లుడుగక కన్నుల నురులనందంద
మొగముఁలువాడ క్రొమ్ముళ్లెంతవీఁడ
పగడంపువాతెఱల్పలువమాఱునెండఁ
జరణముల్దొట్రిల్ల జఘనంబులదర
కరములు చెమరింప గౌనులల్లాడ

పొలయుమక్కువమొల్ల పూచిన రీతిఁ
బులకలు సర్వాంగముల జాజుకొనఁగ
ననురాగవల్లి కలనఁగ నొప్పుచును
బెనగొన్న గురిగింజ పేరులల్లాడఁ
బరమయోగీంద్రుల భాతి గోవింద
పరచింత సేయుచుఁ బరచింతలుడిగి
సకలశరీరి యీశ్వరునూహ చేసి
సకలవస్తువులందుఁ జైతన్యబుద్ధి......
కానవే హరి జగత్కల్యాణమూర్తి
.......... ..............
ప్రకట సత్ఫల రసాభావంబులరయు
శుక కానవే మేఘశోభనగాత్రు
ఆరామవిభవంబు లరయుచుండుదువు
శౌరిఁగన్గొనవె యిచ్చట భరద్వాజ
ఘనతర హరిభక్తిగలుగంగఁ జేయు
మునులార కానరే మునిలోకవంద్య
ఆశలవాసించునట్టి పోఁడుముల
కౌశిక కానవే కాంచనాంబరుని
సకలద్విజాత్మ పోషక చారుశాఖ
సకలేసుఁ గానవే శాండిల్య నీవు
సుమనో మనోహర స్ఫురిత ప్రభావ
కమలాక్షుఁ గానవే గాలవయిచట
ముకుర కపోలాగ్రములదువాడించు
మకరకుండల కాంతిమండలివాని
అలకలజూడ నొయ్యారంపు సిరుల
బెళుకుఁ జుట్టినవెమ్మి పింఛంబువానిఁ
గొదమనవ్వులచాదు కొనిపేను సిరులఁ-

గదిసినసిడువాలు గన్నులవాని
పగడంపు వాతెరపైఁ బిసాళించు
నిగనిగ నవ్వువెన్నెల సోగవాని
గావికెమ్మోవిచెంగటఁ బిల్లగ్రోవి

తీవిమైఁ జొక్కఁ బాడెడు పాటవాని
నెడ జాజితటిమొల్ల విరులతోఁ దేఁటి
కడునొప్పు నెఱిఁగప్పుగల కొప్పువాని
బొదవిన వరహారముల మీఁద రుమలు
పొదవిన సోయగంబుఁ గళంబువాని
నిగుడుసన్నపు వంకసెల వంకఁ జూచి
నగుచుండునొయ్యారి నామంబువాని
వాసించు బంగారు వన్నెలదట్టి
గాసించువాని బ్రకాశించువాని
కానరే పక్షిసంఘములార ఘుమ్ముఁ

గానరేయలయించు కమలాక్షుననుచు
నడుగుచుమున్నుదా నడుగుచు. శౌరి
కడలేని తమినొక్క కడనొప్పు చెలువ
రాధనసంగ మర్మకళా ప్రబోధ
బోధించియటగాని పోయియొక్కెడను
గేరుచు రతులఁ బొక్కించి తక్కించి
కారించి తమ్మనే కనుమూసి యరుగఁ
నాచెల్వమగుత్రోవ నరుగుచు చేడువమీఁ
నాచెల్వఁ బొడగాంచి యందఱు గూడి
యమున సౌరభ నికాయమునఁ జూపట్టు

కమనీయమైన సైకతభూమిఁ జేరి
వెపలుపై వనమ్ములో శైషలుపై ఘంట

నుడిగించి మదనాగ్ని నుడికించఁ దగునె
గాలిచే భయమెల్లఁ గడపి యీనాలి
గాలిచేమమునింతగలఁ గించనేల
తలఁపులలో సేదదరలనీ పాణి
తలము నాత్మీయ కుంతలమునఁ జేర్చి
పదరెనగాలిమే ఘరెమదం బణఁచు
పదము గుబ్బలమోప ప్రాణముల్నిలుచు
చలువ తావ్రులువల్చు చక్కెరమోవి

తలిరు తేనియల మాతాపంబు దీర్చు
కరమునుత్కరము కాకరము నయ్యోగి
వరమునీంద్రులకు శ్రీవరమునై యొప్పు
తావక చరితామృతము నమచ్ఛ్రవణ
దేవాళిఁ బండువఁ దేలించి యప్పు
డతిమనోరంజని యగునీదు భవ్య
కృతియు నాకృతియు చమత్కృతి నలంకృతియు
దలపోయుమమ్ము వంతలఁడించి పోవఁ
దలఁ పెట్టుపుట్టె మాతలఁ పెటింగియును
జందనాంకిత కుచస్థలి సోఁకినంతఁ

గందునోయని యాత్మఁగంనుచుండుదుము
అట్టినీ మెత్తని యడుగుదామరల
నెట్టుమెట్టెదవు నీవీచట్టునేల
అలపెల్లఁ దెలఁగించు నట్టినీ ముద్దుఁ
జిలుకు జూపులు తమ్మిఁ జెనకునెమ్మోము
కలికి హేమాబ్జంబు కరణి గోధూళి
తళుకొత్తు కుటిల కుంతల తలంబులును
కలికి మాటలు మోవి గదియుచు సిరులు

గులుకు బంగరుపిల్ల గ్రోవి నాదంబు
భావించు తఱితెప్పపాటు గల్పించు

దేవాగ్రజుని దూఱి తిట్టుదుమయ్య
యొఱపులు నంతమాకు దుట్టులుంగఱఁపి
మఱియునెంచుటయెల్ల మగపాడియగునె
తల్లివి తండ్రివి దైవంబు పతివి
యెల్ల సంపదలు నీవే యనియుండి
నిను భాసి పొక్కెదునెలఁ తలలెక్క
గొనమేమి యనవాఁడు గొలనీకు మేలె
యీరాని నమ్మిక లిచ్చిపైఁబట్టి
పోరాములాకకొన్ని పొసఁగించి తెచ్చి
యడవిలో నడురేయి యడ్లఁ జేసితివి

కడపట దొరలకెక్కడి బాసలయ్య
నిలిచి రమ్మని నంతనే రొమ్ముఁద్రొక్క
తలమీఁద నెక్కుకోఁ దలఁచువారైతే
నెపమున నీవు నన్నీటిలోనున్న
నెపుడు నిన్నెలపోవ నిత్తురేనిన్నుఁ జూచి
మముగాఁగఁ దగులున్న మగువలఁగాఁగ
భ్రమలఁ బెట్టెదుగాక పద్మాక్షియనుచు
వగలఁ గ్రుమ్మరచు దేవగల నీరీతిఁ
దగులఁ దూఱినవారి దయ జూచి శౌరి
తుఱుము గ్రొవ్విరులఱదోఁపఁ గప్పారు

తుఱుము దాపలిఁచెంతఁ దుదబిత్తరింప
మిసిమి గొణపుచెంగు మెణకువగొన్న
పసిఁడికాయనొస పరిబాగు చూపు
జగిమీఁటు కుండల శ్రీలు చిన్నారి

నగుమోముదమ్మి చెంతలదు వాడింప
యెండతుమ్మెదలతో మేలంబులాడు
దండయట్టుననివా తాళింపు చుండ
వలలఁ జిక్కిన చెలువల సేదదీర్ప
మలయుచువచ్చె మన్మథ మన్మథుండు
ఆగోపసతులు కృష్ణాలోక రతులు
నాగోపవరు గాంచి రపుడు మోదమునఁ
బొదివి పాలిండ్లుపీఁ పునవెడలంగ
నదిమె కృష్ణుని మోవి నానె నొక్కర్తు
మోవిపైఁ బలుమొల్ల మొగ్గలూఁ దుచును
శీవిమై బొమలు గొట్టించె నొక్కర్తు
చేరిమే నొకవిలాసిని గోరఁ జీరి
కేరుచుఁ దిట్టి చెక్కిలియునుం గఱచి
మోము తామరతావి మూర్కొని చొక్కి
కామించి యరగంటఁ గాంచెనొక్కర్తు
నిగుడి నిట్టూర్పుచే నెఱిగొప్ప సొగయఁ
డిగిచిపై నొరగి సందిటఁ గ్రుచెనొకతె
గొబ్బితయొకతెమై గులుకులేఁ జెమట
గుబ్బలపై చెఱంగు నమస్త్రరించె
కుసుమాంగి యొకతెయక్కున నక్కడాయఁ
గొసరుచు గొణఁగిచెక్కునఁ జెక్కుఁ జేర్చె
గళముపైఁ జైవైఁచి కరఁగించి తెచ్చి
లలనయొక్కతె తమ్ములము గ్రుమ్మరించె
జలజాక్షు పదసారసము తారసముగఁ
గలకంఠియొర్తుచన్గవనొత్తికొనియె
హరియు వారలసేద హరియించి మిగులఁ

గరుణించె విమల సైకత భూమినపుడు
తెరవలపయ్యెదల్దివ్య పీఠముగఁ
బరచి కృష్ణుని నొడంబఱచి యామీఁద
నునిచి యాత్మల నిలికొత్తుమక్కువల
ననిచి తద్పద నలినముల హస్తముల
సొగయనొత్తుచును వాసులు సిగ్గుదమియు
నెగడఁ గృష్ణుని జూచి నేఁడుమమ్మిట్లు
చేసేత నీవు సేసిన చేతకేమి
చేసిన మతులనెం జెరివాయనోఁటు
వరుల సోదరుల బావలసరివారి
గురుల మీఱుచునిను గోరియేఁ తెంచి
దైవంబుననేల తమకించ నేల
నీవేమి సేతుమూనేరంబె యనినఁ
దోయజాక్షుఁడు కనుదుదఁ బాఱునవ్వొ
యాయలే యందురే మాయెలెమ్మనినఁ
బలుగప్పులరఁగాను బడబొమల్గుదిచి
మెలుఁగెతి యేమంటి వేమంటివనుచుఁ
గనుఱెప్పలల్లార్చి కన్నీరునించి
మునుమోములొందొంటి మోవఁ గ్రక్కుచును
గోరబఁగరు రంగు తొంగుచెరంగు
గీరుచుఁబలుమాఱు కిసలయాధరలు
కోమలుల్జిక్కఁ జిక్కుదురు నాయకులు
కామింప కుండనఁ గామింతురొకటి
చిక్కినన్నైనను జిక్కకయున్నఁ
జిక్కిన పతుల వచింపరు సతుల
ధరలాఁదొప్పోరొకాలతలఁ గాంతులిట్లు
వెరసినీవలెవెత వెట్టరుగాక

యన విని యవలోకనామృత రసము
చినుకుచు సీరదాసితవర్ణుఁడనియె
వాఁడిమాటలు వల్కవలదు నేనట్టి
వాఁడ నేనెపుడు మీవాఁడనేయనుచుఁ
గనుఁగొనుఁ దోకరీతిఁగను గొనవలవ
దనయంబు మీకునే నాత్మబంధుఁడను
విలసిల్లు మీభక్తి వెలసింప వలసి
కలసిడాఁగితినింతె కపటంబు గాదుఁ
అనిననేఁ జేయునీ యపరాధమిపుడు
మానినీ మణులార మన్నింపుఁడనుఁడుఁ
గలసి పైకొను నిజాంగంబు సంగంబు
వలన గోపికలమైవడ మెల్లఁ దీర్చి
యాపంచశరుమించు నలపుమై విశ్వ
రూపి యప్పుడు పెక్కు రూపముల్దాల్చి
కాంత చామీకర క్రమ పాత్రముల
యంతరాంతరమున నవలున్నకరణి
గారుత్మతములలో గాంగేయమణుల
చేరికల్ గాఁ గూర్చి చేర్చిన పగిది
మెఱుపుల యెడకెడ మేఘముల్దోలుచు
నెఱుగున శౌరి వ్రేఁతలయెడనెడను
దనమూర్తి యలరనా తరళలోచనలు
తనదుమూర్తులకుఁ జెంతలఁ జెన్నమీఱ
భాసిల్లు నుల్లాస భరిత విలాస
రాసమండల మహారంగ మధమునఁ
బలుమాఱుఁ జెలఁగి శ్రీభంగిగా మెలఁగి
నిలిచి వయ్యారివన్నియ వేణువంది

లీల నాలోలాంగుళీ పల్లవముల
మేలము ల్జేసి సమేళంబుగాఁగ
నతినీల ఘనముపై హరిచాపమొప్పు
గది వైజయంతి వక్షంబునఁ జలఁగ
జాంబూనదము నీనశైలంబు జుట్టి
పంబెనోయన హేమపటము శోభిలఁగ
మెఱుఁగులయనఁటుల మించెల్ల నిలిమి
యొఱపులై తళు కొత్తు నూరుకాండములు
సపరనై యఱచేయి జాడనేదరుల
నవరసంబులకు నెన్నడుమైన నడుము
చతుర శృంగారరస ప్రవాహంబు
గతినొప్పుచునుకాఱు క్రొమ్ముడియూరు
సిరిమేలు పట్టంపు సీమయపోలెఁ
గరమొప్పు శ్రీవత్స కలిత వక్షంబు
యమునాతరంగంబు లనమించి నిగిడి
యమలంబులైన బాహాదండములును
గుంకుమ పంక సంకులములై సిరుల
బొంకించు నాల్గుమూఁపుల సోయగంబు
చకచకల్గల పాంచజన్యంబుదాను
నొకకుత్తుకై యుండ నుంకించు గళము
సకలకళా పూర్ణచంద్ర బింబంబు
వికవిక నగుచుండు విమలాననంబు
మలయు సంపఁగితేకు మఱఁగించి సొంపు
గిలుజాడి తిలకంబు క్రియఁబొల్చునాస
నీలమేఘంబుపై నీలమేఘంబు
ప్రాలియొప్పెడిగతి వలనొప్పుకొప్పు
కొఱలుచందురులోనఁ గొమరొప్పుకప్పు

తెఱఁగునఁ గస్తూరి తిలకంబు బెడఁగు
గలిగి యయ్యెడనిరు గడనింపు సొంపు
బెళుకు మోహాన మంత్ర బీజముల్పోలె
నిరుపమ లావణ్య నిధియాయటంచు
ధరఁబోల్పఁదగు వసుంధరపేరి సతియు
శౌరి నిచ్చలు విలాసప్రసూనముల
నారాధనము సేయు నారాధగదిసి
యాంచిత గతిఁబట్టినట్టి విపంచి
పంచినై చినరీతిఁ బలికించితోడ
జోడుగానముగా సొగసుగాఁ గూడి

పాడనాబాల గోపాల బాలకుఁడు
చంద్రికల్ పొలసిన జాతిగామొదల
మంద్ర మధ్యస్వర మార్గముల్చూపి
వరుస లేర్పడ నిజావళి భజావళియు
నరసిసాళగము తాయము లేర్పరించి
మార్గ దేశిక తాళమాన ముల్వింత
మార్గములై యొప్ప మధురతల్గుప్పి
వేళలు జాతులు వేర్వేఱ దెలిసి
డాలుగా గాణతోడరుమల్లుఁడిట్లు
వేణునాదంబు గావించె నవ్వేళ

వాణీభవుండు శార్వాణీధవుండు
........................
సురలు నప్సరలు నాసురలు గిన్నరలు
ఉడురాజి యుడురాజు నుడువీధినిల్చి
జడిగొనఁ బుష్పవర్షములు వర్షించి
ఘుమఘుమ దుందుభుల్ ఘూర్ణిల్లఁ జేయ
కామినుల్పురుషులు గనిచొక్కి—గోప

కామినీ కాముకుఁ గామించిరప్పుడు
నవరసపూర్ణ తానముల గానముల
నవిరళగతి నారదాదులు పాడ

ధరణీశయా గోపదంపతుల్వ్రతులు
పురుడింపదాని సొంపులఁ దేలిదేలి
నలువొందసంఘన్న నలినమైనట్టి
పులినంబుపైఁ బదంబుల సంగడించి
కరములఁ గిరమొప్పఁ గిరపీరజాతి
నరిసూనముల చేతవడిఁ జల్లులాడి
వరణ మాలికలకై వడినొప్పు మృదుల
కరములనొంచారు కంఠముల్చుట్టి
చారునాదముల సంచార భేదముల
నీరీతి నటియించి రెంతయువేడ్క

సరసిజాక్షుఁడు విలాసమున రాసమున
సరసనాట్యముఁ జూపఁ జరఁగె వెండియును
తులితాంగ సంగబంధుర రాసబంధ
ములఁ బ్రవర్తిలి తానముల నిల్పి నిల్పి
వరమణి భూషణావలి వలియుఖము
నెరసి రేవగలుగా నిర్మింప భామ
మండలంబును దేవమండలంబులును
నొండొంటి విరచించి యొనరఁ జూపుచును
అరవిందగేహా గేహంబైన యురము
సరసమొప్పారు భూషలునటియింప

కమలాప్తు గుడిచుట్టు గతినంబరముల
భ్రమరింప విభ్రమద్భ్రిమలఁ జూపుచును
బ్రణవ సంపుట మంత్రరాజబీజముల

గుణుతి గోపీమధ్యగత మూర్తులలరఁ
గరణంబులును సుధాకర కరచారు
తరదర హాసముల్ సొంపెరయ
ముకుళాది నామకములుగల్గు పద్మ
ముకుళాది సౌందర్యములఁ జూపులలరఁ
బలుమఱు మోదితాభ్ర భ్రమద్భ్రమర
కులములగతి నొప్పు కొప్పులల్లాడ

భావముల్లరఁగ శుంభ......ల్లీవస్తు
భావముల్నెఱపుచుఁ బరిపరిగతుల
నంగహారంబు లుయ్యేల లూఁగుచుండ
నంగహారంబులనలవు చూపుచును
సారసాక్షుఁడు వికాసమున రాసమున
నీరీతి నటియించె నెంతయుఁబ్రీతి
అరయనగ్గలమయ్యె నారాత్రి రాత్రి
వరుఁడు వేడుకరమావరుఁ జూచి నిలువ
వనజాక్షు నెదుట జీవనజాక్షియొకతె
యనువుగానప్పుడు మోహనముగా నిలిచి

మధ్యమాద్రిగ్రామ మండితంబుగను
మధ్యమేళము సింహ మధ్యమేళముఁగ
గీలించియొనఁగెడు గిన్నెరనరుని
వాలుచేతులనేట వాలుగాఁ బూని
గురుమంజరుల తేఁటి గుంపుపై కొనిన
సరవిఁగిన్నెర కాయ చనుదోయిరాయ
మేలిమియగుతంత్రి మీటిచొక్కముగ
నాళవియొనరించి యవగడంబుగను
బెళుకుతాళములతోఁ బెఱయ సొంపరయ
బలసోఁకునిమీఁది పదము జక్కఁణియు

వన్నెగా వరుసగా వలువగామిగులఁ
దిన్నగా నున్నగా తేటగామించ
మిన్నఁగాఁజల్లఁగా మీటుగాసొలసి
వెన్నుని హృదయంబు వికసింపఁ బాడ
నలరుచుభళిభళీయనుచునానాతి
బులకింపనొసఁగెఁగప్పురపు వీడియము
రతిపతిగురుడిట్లు రాసంబు సలిపి
సతులతో జలకేళి సవరింపఁ దలఁచి
గరుడ సేనేశ నాగప్రభుల్చేరి
పరిచారములు పరిపరిగతి జేయు

గలకల నాదకోకముల లోకములఁ
గలికాగ్రకాంత భృంగముల భంగముల
సమధిక హేమ కంజముల పుంజముల
రమణీయ పుష్ప నీరముల పూరముల
లలిత మరాళ సారసముల జాలముల
గలిత సౌరభ పరాగముల ప్రాగముల
కలికి శ్రీకృష్ణు శృంగార రసాబ్ధి
వలెనొప్పునయమున పరపుత్రిగాంచి
మంచుతోనెడయు పద్మంబులు బోలె
మించి నీవులమీద మెఱయునాభులును

గుముదాస్త్ర శస్త్రిహింగుళరుచుల్ వోలెఁ
గమలనేత్రాంత రాగముల సొంపులును
కోయిలముక్కులాగుల పల్లవముల
చాయ కెంపులు మించుసన్న మోవులును
విరిజొంపముల విఱ్ఱవీఁగెడిలతల
సరవిమప్పిరిగొన్న సరులచేనొప్పు
నరవిందముఖులతో హాళియుఁ గుంజరుల

గరిమతో వచ్చు సంగతిఁ జేరవచ్చి
శరదమోఘాశక్తి శంపలుబోలె
వరదశూలములచే వనితలింపొంద

ఘన హాస్యరసము శృంగారమధ్యమునఁ
గొనకొన్నగతిఁ దాళి గోణంబు గట్టి
వారితో నొనగూడి వారిలోఁ జొచ్చి
వారికేళి మొనర్చి వారనివేడ్క
తరఁగలఁగనియొక్క తరాళాక్షి శౌరి
కరములోయని పట్టి కరమునవ్వినను
హరి కురులనియొక్కయతివ శైవలము
సరఁగునఁబట్టి వేసరి కేరితిట్టి
కేలెత్తియొకతె శ్రీకృష్ణుని రోగి
లోలవాలో యీలోలావు మెఱసి

రమ్మురమ్మనుచుఁ గీతమ్ము చందమునఁ
గ్రమ్మిపిల్చుట విని కమలలోచనుఁడు
తఱివేఁచిపట్టి సుందరి గుబ్బలలమఁ
దఱలక నిలచి యాతఱలాక్షి పలికె
నరయఁ బట్టెడితా వెయగునైన నీవు
తఱిచూడు కంససోదరి పుత్రయనిన
వేఁడక నవ్వి ధమున జలము
లాడుచు సరసంబులాడుచునుండ
లలనలపాంగ జాలకములచేత
సలిలంబులో బేడసలఁగుండఁ జేసి

యొసపరి కురులతో నొఱయుచుఁదమదు
బుసకొట్టులకుఁ బాఱి పొవ్రుతుమ్మెగలు
కవగుబ్బచన్నులు గనిరేసిడాసి

దరళ హాసములకుఁ దరలుజక్కవలు
పలుచని యధరబింబములకై సుడిసి
యొలయుఁమై తావులకుఱుకు గీరములఁ
దమ్ములఁ గుముద కందమ్మునుత్ప
లమ్ముల ఘన శైవలమ్ములఁ రువ్వి
వనజముల్చరణముల్వడిఁదడంబడఁగ
ఘన భాగ్యరేఖలు గనిపట్టికొనుచు
భ్రమరముల్నెఱుల నేర్పడకున్న హేమ
సుమవాసముల పసచూచి పట్టుచును
బిసములు హస్తముల్ఛేదింప లేక
పసని సొమ్ములు గాంచి పాఱిపట్టుచును
బులినముల్పిరుఁదులు పోలింపరాక
మొలమిఁ గాంచులు గాంచి మొలమిఁ బట్టుచును
గమలముల్పాదేనఁగ్రక్కు చందమునఁ
గమలముల్గరయంత్ర కములఁజిమ్ముచును
గమలభృంగముల వేగముల రాగముల
గమకింప వడిఁదోలికదియుచు సోలి
కమలాంతరపు సూన కమలముల్హస్త
కమలంబునందుఁ జొక్కమలర్పఁ బూని
సరములఁబూని సారసములఁ దేలి
బిసముల్ద్రుంచి తుంపనలాడి పాణి
బకములమరుని యంబకములనొప్ప
శుకముల దరులయా శుగములఁ గప్పి
యుదటుమీఱఁగఁ దమ్మినొక్కతెపమ్మి
మొదలుఁ గృష్ణునిఁ గ్రమ్మిమొద సోఁకజిమ్మి
నిలువ గోవిందుఁడూనిన ప్రేమఁ జలువ
వలచు చెంగలువచేపైచె నాచెలువ

కరమెత్తి చేగుత్తి కవలచే హత్తి
హరినొత్తి వైచి రాయతివలుమెత్తి
మతులు సంమతులుగా మహనీయబాహం
లతల గొల్లెతల ఫాలతలములుంచి
వెనువెంటఁ గళలంట విడియుంటవింట
ననజంటవైచె మానముగెంటె శౌరి
విలసించు నలయించు విలుమించుబోమలు
పొలయించి సొలయించి పొలఁతులవ్వేళఁ
గొంచపట్టుటకునై కొంచనియంచ
నంచబో నీకు వేయలి వేణి వేణి

పట్టినఁ గడునెగ్గు పట్టిన నిచట
నెట్టువేగించెద మీకనైన నీవు
గవకవనగకు జక్కవకవబెదరు
నవలివారల్లన నందిపట్టెదరు
వికవికలేలె విన్వారలకు ముకులు
కకపికలాయెఁ దక్కక పికవాణి
మరలని తెరలఁ బల్మఱును గొక్కరలఁ
గెరలి చేయకుఁడు చక్కెరబొమ్మలార
తుటుములు వెట్టుచుఁ దుటుము గట్టుచును
నటనిటరారె మిరనుచుఁ నొండొరుల

నాడుచు సరసంబు లాడుచునీదు
లాడుచువడిఁ జల్లులాడుచుఁ జెలఁగి
యమున తత్కుచకుంకుమాకులయగుచు
నమరెరేసంజ కెంపారుమిన్ననఁగ
సారసభవుఁడు వాసవుఁడు మాధవుఁడు
చారణ దేవతాసతులు నవ్వేళ

హరిఁగాంచి మోహించి హర్షంబు పెంచి
కరఁగి నీరై చొక్కి కామించిరంత
వనకేళిఁదేలి యవ్వనమాలిగొల్ల
వనబోఁడ్లతోడఁ గ్రన్నన నేఱు వెడలి

నీలమేఘంబు వెన్నెల సోఁగచుట్టు
వీలఁగోణంబు గీలించి యామీఁద
సరులు ధరించి శ్రీచందనంబలఁది
విరులు గీలించి పచ్చవిణాముగట్టి
నీలంపు సరులలో నిగ్గులు వెడలు
పోలికఁ గుంతలంబుల నీరుజాఱ
నుదురాజ బింబాస్య లొండొరులయొఱలు
సడలించుమర ఖడ్గశాఖలఁ బోలి
పట్టుమీపట్టు చూపట్టు నీపట్టు
కట్టు చీఱెలతల కట్టుఁచేకట్టు

తెముముత్యమ్ము పుత్తెమ్ము పోతెమ్ము
కమ్మపూఁ బొదరిల్లు కలికి నీసొమ్ము
కొమ్ముగంధము పూసి కొమ్మనీవంది
కొమ్మపూవులు జాతికొమ్మనామమ్ము
చీరి కస్తూరికై చేరిపోవకుము
రారమ్ము గంధసారమ్ము నిమ్మనుచు
తొడవులు తొడివి కస్తురిపూసి విరులు
ముడిచివన్నియపుట్టిములఁ గట్టిరంత
వసుదేవతనయుండు వలపుల మరియు
కిసలయాధరులఁ జిక్కించి చొక్కించి

తెలతెలవాఱనే తేరఁబల్లియక్కు
మలయుచువారితో మగిడియేతెంచె
వరులంత నభిమానవతుల నాసతుల

హరిమాయనేమియు నసరైరి యిట్టి
ధవళాక్షు మహిత వర్తనము కీర్తనము
భువి విన్నవారల భూరిసంపదలు
వనజాక్షుఁ డంబికావనము బావనము
నొనరింప నచ్చట నొక్కనాఁడరిగి
యుదుటున నందుని నొడసి గోపకుల
గదుము నాగంబు భోగంబు వేగంబు

చించి యాతండ్రి రక్షించి తద్భోగి
నంచితగతి నంచియట నొక్కనాఁడు
అన్నతోమరుఁగన్న యన్న వేడుకల
నున్నతోన్నతకాననోపకంఠమున
వల్లకీరాజిత వల్లవీ హస్త
పల్లవరాగ శోభన మూర్తియగుచు
ప్రోడనందు గూరుని దూతశంఖ
చూడుండుకొని పోవఁజూడు మటంచు
వడిఁబాటి పోమెడివాని ప్రాణముల
విడిపించి జనకుని విడిఁబించియంత

నతని శిరోరత్న మన్నకునిచ్చి
యతివలతో నుండె నతివైభవములఁ
దనమంచితనము మంచితనము గోపికల
ఘనత నెన్నుచుఁ దను గలయుచునుండె
పోమరి కంసు నిష్ణుండరిష్టుండు
భీమవృషాకృతిఁ బెటిగి బిట్టలిగి
వాడికొమ్ములు మలువాడివీనులును
గాడిమోవని యట్టుకదలు మూపురము
వాలువాలము నేలబడి వాలు గంగ
డోలునుగల్గి కాటుకకొండ వోలె

గోడలువడనూఁకి కొమ్ములునేల
గోడాడితోఁ కెత్తుకొని పంచవిలుచు
గడెఁది చిందరకొట్టి కడిమి క్రేళ్లుతికి
వడిరంకెలిడుచుఁ గ్రేవలినాకి కొనుచు
మల్లరంబై గోప మండలంబెల్లఁ
దల్లడిల్లగవచ్చు తఱి దైత్యమర్ది
సురలెల్ల నరుదంది చూడనయ్యసురఁ
బరిమార్చి తమవారి భయమెల్లఁ దీర్చె
బెగడెఁ గంసుఁడు గోపబృందంబు కృష్ణుఁ
బొగడెనభ్రమ్మునఁ బూవాననెగడె

నలరులతోఁ దేటి యలరుచందమునఁ
జెలఁగె గోపికలతో శ్రీకృష్ణుఁడంత
ప్రబలభా విజిత పారదుఁడు నారదుఁడు
సబలుఁడై కంసుని సభకేగుదెంచి
యమల నేత్రాంత దరహాస చంద్రికల
కొమరొప్ప మెఱుఁగు చెక్కులమీఁదఁ బొలయ
వెడమతి నీమతి వివరింపనిపుడు
వెడలనున్నదోబేలు జెందితివో
యిరుగింటిలో పని యెఱుఁగ వేమియును
బొరుగింటి పనిఁ దీర్పఁ బోవెదు కంస

వసుదేవుఁడిట్టు దేవరరేయిగన్న
పసిబిడ్డ పాపని పనిబూని
యతివేగమున మందకరిగి యానందు
సతియొద్దఁ బెట్టియా సతిగన్నపట్టిఁ
గొనివచ్చి నిన్నుదిక్కులఁ బెట్టికొనుచుఁ
దనుగానివాని చందమున నున్నాఁడు
కనలుచుమును నీవు ఖండించినట్టి

తనయాలిఁ గన్నట్టి తనయాలితోడఁ
దోడిబడఁ డాఁచి యందులనేయయున్న
పడఁతి దోర్బలభద్రు బలభద్రుఁ గాంచె
వారలే నినుజంపు వారలువారి
వారింపఁ గూడద వార్యులెవ్వరికిఁ
గన్నట్టి పనిదాఁపఁగా నేల నీకు
నున్నది యున్నట్లు లోనరఁ జెప్పితిని
నావుడు వహ్నిచందమున డెందమునఁ
గావరంబెసఁగఁ డిగ్గన గద్దెడిగ్గె
కైవాలుఁగొని శౌరి ఖండింపఁబోవ
దేవ మానీంద్రుఁడే తెంచి వారించి
తగున నీకిదిలెస్స తగవు జేసితివి
పగగొని నినుజంపఁ బగతురుండఁగను
సేయువాఁ డుండ నమ్మేమిగావించు
వేయేల హరియుండ వీఁడేమి సేయు
వారెవో దయ్యాల వలెమందలోన
శౌరి సీరియు నిన్ను జంపనున్నారు
అనుచు గంసుని కీర్తి మొగయుచందమున
జనియె నారదుఁడు భోజప్రభుండపుడు
ఖలబుద్ధినపుడు శృంఖలబద్ధుఁ జేసి
చెలియలితోఁ గూడఁ జెఱసాలవైచి
యటరేసి వడిగేసియును దైత్యనాథుఁ
గుటిలతనందుని కొమరుఁపై బనిచె
మంత్ర కూటమున దుర్మంత్రజ్ఞులైన
మంత్రులు భటులు భూమండలేశ్వరులు
గొలువ మీసలు దిద్దికొనుచు నేత్రముల
జలజలనిప్పుల జడియుప్పతిలఁగ

స్వారాజు గిరిరాజు సడ్డగావింప
సీరసాస్థతిమర్త్యుఁడే నాకు నెదురు
శూలిఁగేలిననవ్వఁ జూచునాతోడ
నాలంబులో వీరలా పోరువారు
గరుడ గంధర్వ రాక్షసులకేనోడ
నరునకేనోడుదు నాపోరిఁ బోరి

చటులమాద్రోణ భీష్మక శల్య బలము
నటుచూపిగెల్చె దననిఁబోవ నీను
వావిరితనదైన వంశమేనెఱుఁగ
నేవట్టి జర్జరనెఱప నేమిటికి
నెత్తిమాసారని నెత్తురుకందు
తిత్తజేననునాజి నీల్గింతమనుచు
అనికొండఱటవారి నటపోయియిటకుఁ
బనిఁ బూనిరప్పించి భ్రాపవలయుఁ
దవిలిహస్తినిబుర ద్వారమేమరక
కువలయపీడమెక్కు-వలావుమెఱయ

వడినెక్కియాచక్కి వచ్చువారలనుఁ
డెడలించికెడపు మందునుమీఱజేరని
సమమల్ల హృద్భల్ల చాణూరమల్ల
విలుపండువనిపేట వినన్నల్లచోటఁ
బలుదెఱంగులఁ జాటఁ బనుముఁడువేగ
రంగంబు క్షీరతరంగంబు చాయ
రంగు జల్లులరాజి రాజిల్లఁ జేసి
విమలముల్గావీథి వీథులనెల్లఁ
దమఁగముల్పన్నుఁడు తమకముల్మాని
యని యాత్మఁదల పోసి యక్రూరుఁ బిలిచి

తనకేల లీలనా తనికేలు పూని
యన్నదమ్ముఁడవైన నాప్తుండవైనఁ
గన్నవారలు నీవు గడియును నీవ
తనమేలుకీళ్లడుల కఁదగులైనవాఁడ
వని నిన్ను నమ్మితి నంతరంగమున
ననిమిషాధిప ముఖ్యు లాలంబులోనఁ
దనువేఁడికోడి శ్రీధరు వేఁడికొనిన
శౌరిమూతడె సీరి శౌరియుననఁగ
నారయ జన్మించిరని వింటినట్టి
బలకేశవులునందు పాళెంబునందుఁ

జలపట్టి తనఁబట్టి చంపెదమనుచి
నెన్నుదురటు వారినిటు తెమ్మవింటి
జన్నంబటంచు ధర్మము తొంటినాఁడు
మల్లనాగములచే మహిమెల్లఁదల్ల
డిల్లఁదద్బుల మెల్లడించి సంపదలఁ
జాలి కోసల సాల్వ సహితంబుగాఁగ
నెలెదమిాలోక మేకచక్రముగ
ననివేడు కలహెచ్చి యంబరంబిచ్చి
యెనయఁ గౌఁగిటఁగ్రుచ్చి యెత్తిననతఁడు
ఇది యేమి నన్ను నీవింతజేసెదవు

తుదినీదుపంప్రజాతులు ప్రసాదంబు
ఇందు మించిన భాగ్య మెయ్యది వేము
చందంబులనుమదిఁ జర్చింపననుచు
ఘన మనోరథము సంగతినొప్పారథము
నెనలేని వేడ్కతో యెక్కియందరిగె
వేగ కంసుడు మృత్యువక్త్రంబు దూరు
పగిగొల్సెడవించి భవనంబుజొచ్చె

అంతనంద వ్రజంబటు కేశిడాసి
యంతకోగ్రతమించు హయమూర్తిఁదాల్చి
తుంగ ఖురోద్ధూత ధూళి దిక్పాళి
నింగిగప్పుచు దేవనికరంబు బెటల
నాననంబెత్తంగ నా కేశిడాసి
పోనీక తత్పదంబులు పట్టి శౌరి
యతితీవ్ర గతినొప్ప నగలంగఁ ద్రిప్పి
శతచాపదూరంబు చనవైచియార్చె
చిమ్మి మోకాళ్ల మోచేతులం గ్రమ్మి
యమ్మహాసురవైరి యవనిపైఁ గెడపి
వ్రేలువ్రేతల వేవేలు చందముల
నాలీలనెన్నంగ నరిగెఁబల్లియకు
రమణీయ మౌక్తిక రదుఁడు నారదుఁడు
కమలాక్షు బల పాదకంజాతములకు
వినతుఁడై నుతుల గావించి భావించి
వనజాక్షుఁడటు చేయవలయు కార్యములు
పలుకుచు సకలసందలును బొదల
జలజాక్షుఁ గనికని చనియె భూనాథ
అటని లాయనకేళి వతివేడ్క గోప
పటలితోఁ బర్వత ప్రాంతంబునందు
గోలతాపడుచులు గొఱియలై యుండ
బాలకుల్గొందఱు పాలకుల్గాఁగ
గడుసులనెల్ల దొంగలు గొనమర్చి
వడిమీఱఁజెపంక్తికై వడినాడుచుండ
మాయాజి వ్యోమనాయక నిర్జరారి
యామెడ నెడకొల్లలై వచ్చిచొచ్చి

యేపురార్వురు చిక్కనందఱు బిలము
లోవైచి రాతపెల్లుగ రాయి ద్రోసి
యేతెంచి యిరుజేయి యెఱుఁగకయుండ
నాతఱితలనాఁడు నసుర నీక్షించి
నీయాటమేలురా నీచ నిశాట
కాయలునింక నెక్కడికే గెదనుచు
నలుకమై గోవిందుఁడా మందుఁ జంపి
బిలమువాకిటి రాయిపెడకేలఁ ద్రోచ్చి
లాలించి పిలిచి బాలకుల వేడుకలఁ
దేలించి మందకేతెంచె నత్తఱిని
ననవరతాక్రూరుఁ డక్రూరుఁడనఘుఁ
డనుపమ హరిభక్తుఁ డరుగుదెంచుచును
నేదానఫలమొనాకీదానవారి
పాదారవిందముల్ భజియింపఁ గలిగె
నజశంకరామరేశాది కిరీట
రజమెవ్వనికిఁ బాదరజమై చెలంగు
నామాధవుని గాంచునట్టినా పుణ్య
మేమని వర్ణింతు నిందిరాకాంతు
నరిబుద్ధినైనఁ దెమ్మని పంచెఁ నాకుఁ
బరుఁడై కంసుఁడు ప్రాణబంధుండుగాక
నావటి పామరనకుఁ గల్గె దేవ
దేవుఁ జూడ గనాదియపోతపంబు
ఈయెడ కంసుహితుఁడని యూర
సేయునోనను భక్తి సేయునో యేల
నాయెడ సర్వాత్ముఁడగుటఁ గృతార్థుఁ
జేయునేనను దయసేయు నేయనుచుఁ
గళుకులై బెళుకు నుంగరపు ముంగురుల

కళుకులై వెలిదమ్మిఁగసరు నేత్రముల
నిలసంపగుల హసియించు నాసయును
జిలుకు వెన్నెలతేట జిలుకులేనగవు
మొనరముల్లల శౌరి మోహనాననముఁ
గనుగొందు నేఁడెనిక్కముగఁ జొక్కముగ
వనమృగావలినాదు వలిచాయకలిగెఁ
జల్లప్రోద్దున నేను జలజాక్షుఁ గాంచి
యుల్లసమారంగ
నెమకెడు కేలమై నివురుగాయనుచుఁ
గందమాకందము కుందారవింద
చందన స్యందన తాల తక్కోల
బృదమై యొప్పారు బృంద సొత్తెంచి
పోదరి
పొదరిండ్లలోపలఁ బొదలు గొల్లెతల
తరిలేచిలేగలందల పోసి పాలు
కురియఁజేపిన పోదుగులనేల జీర
మఱల కిందులకునంభార వంబులును
బఱువ
పచ్చగందనియచ్చ పచ్చికల్మేసి
మచ్చరంబెచ్చ మర్మలయుచుఁబొదలి
బహు గుహాంతరములఁ బ్రతిరవం బెసఁగ
మహిజంకెలిడుచు
రిక్కలు వెట్టి హుంక్రిడిక్కుడటంచు
దిక్కోల్పి వికవికఁ దెగడు వల్లియలు
చేకొని వారింపఁ జేరు గోపికల
సొరిది గరాళింపుచును మందపట్ల
కరమె

చనిచని నోటికి చలిదైన పూరిఁ
దినివెన్న చఱచి పూఁదేనె తియ్యములు
నీరాని నెమ్మదినెమరు వెట్టుచును

జేరువ గుమురుగాఁ జేరి ధేనువులు
కొదమలేఁ గలతేఁటి కొదమల సూటి
కుడుచునప్పుడు పొదుగు లుపయోదములు
వడువున క్షీరముల్వర్షింపుచుండ
నడరఁ విష్ణుఁడె కృష్ణుఁడైన నాపాల
కడలియుఁ గడక నిక్కడనిల్చెననఁగ
నురువులు గట్టి మిన్నుల గబ్బమనుచు
నీఁతలై ప్రోఁతలై యేఱులై తరణి
కూఁతురిఁ గలసిపైకొని పారుచుండ
యమున గంగయుఁగోడె ననిసరల్మనులు

భ్రమసిరి సిరితేనిప
గనుకొని యాఁకడలింగడచియే తెంచి
కమ్మపూఁ దేనెలఁ గలయుపుప్పొళ్ల
నుమ్మలి రథముడాయుచు దొరగిలఁగ
వడిమీఱుమావుల వడిమీఱఁదో
బలరామ గోవింద పాదారవింద
హలజలజాత రేఖాంకములైన
యడుగుల పొడగాంచి యరదంబుఁ డిగ్గి
కడుబొంగి వేడుకఁ గన్నీరుగాఱ

హరిభక్త
శరదాగమోత్ఫుల్ల జలజ నేత్రులను
హరిణాద్రిజలద మోహన సుగాత్రులను
గురుతరోజ్జ్వల నక్రకుండల రశ్మి

సురనది యమునోర్వి శోభితభుజులఁ
హరిణాంక ముకుర సమానంబు జులఁ
గమనీయ వనమాలికా విభూషణుల
సమధికా మృతరస

జిరతర వైభవ శ్రీనికేతనుల
వితతకీర్తులనాది విష్ణుమూర్తులను
బుష్పిత హృదయుఁడై పొంగి యానంద
బాష్పంబువుల నర్ఘ్య పాద్యంబు

యక్రూర లెమ్ము లెమ్మని యెత్తికొనుచు
బలునకు నీరీతిఁ బ్రణతులొనర్ప
బలుఁడు శోభిత భుజాబలుఁడు నాభక్తుఁ
గ్రుచ్చి మోదమున నక్కున నక్కుఁ జేర్చి

హరిదాసునింటికి నతని దోడ్కొనుచు
నరిగి గద్దియనుంచి యర్చించి మంచి
పసిఁడి బిందియనీటఁ బాదముల్గడిగి
మసలకతోడ్తోడ

సకల రసాన్నముల్జనని వడ్డింప
జనకుండుదారు భోజనము గావింప
ఘనసార ఘనసార గంధముల్బూసి
ముఖవాస తాంబూల ముఖముల్లై నట్టి
యఖిలోపచారంబు లలవడఁ జేయ
నరిది నందుడు సేమమరసె నాపజ్జ
నరవిరి సెజ్జపై నక్రూరు శౌరి
తనువొయ్యనివిరి పాదము మీఁదవైచి
పినతండ్రి తానల్లి బిల్లియైయుండి.

కుశలమే నీకు నీకూర్చు వారలకు
జయమే శుభంబే భూజనులకునెల్ల
నయయుక్తమే జననాథు వర్తనము
భూమి పాలింపుచు భోజేంద్రుఁడైన
మామకు లగ్గనేమమె బంధువులకు
నని నీవు వచ్చుటేమనిని నాథునుఁడు
తనవచ్చు రాక కెంతయుచు నెంతయును
వివరింపగా విన్నవింప మాధవుఁడు
చివురుకెమ్మోవిమ్మోఁ జిగురొత్త నవ్వి
వలఁయు రీతులఁ జేయ వలయుఁ గార్యములు
బిలిచి నందునకుఁ జెప్పిన నతఁడపుడు
అరియప్పనంబు పుల్లరి నేయిపాలుఁ
పెరుగులు దెప్పించి పిల్చి గోపకుల
మనల బాణాసన మఖము చూడంగఁ
జనుదేర విమలనచారు నక్రూరు
ననిచె భోజుండదు నేఁడని చెప్పివయున
మునకుఁ దానాయత్తములు సేయుచుండె
నని యోగిజనపాలుఁ డాజనపాలుఁ
డనుమోదమంది నిట్లని యానతిచ్చె
నని సుధావాణికి నబ్జపాణికిని
వనజాస్త్రు మాతకు వనధి జాతకును
ననుగన్నతల్లి కనమ్రభల్లికిని
గనక గాత్రికిని బ్రకామ ధాత్రికిని
వాణీశనుతకు సువ్రతకత్తె విచల
దేశికి శ్రీవేంకటేశు రాణికిని
సారసగేహకుఁ జారుబాహకును
సారలావణ్యకు సకల గణ్యకును

బరమకల్యాణికి భ్రమరవేణికిని
దరుణేందుఫాల కుదారశీలకును
రామాభిరామ కప్రతిమ ధామకును
హైమసంవ్యానకు హంసయానకును
నింద్రభావితకు గజేంద్ర సేవితకుఁ

జంద్రికాహాసకుఁ జారునాసకును
నగసుతానతకుఁ బన్నగసుతావృతకు
మృగమదాంగకు నలమేలుమంగకును
నంకితంబుగను శ్రీ హరిభక్తనికర
పంకజాకర తాళ్లపాకాన్నమార్య
తనయ తిమ్మార్యనందన రత్నకుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశ దత్త
మకర కుండల యుగ్మ మండితకర్ణ
సుకవిజీవంజీవ సోమరాజీవ
సదనావధూ లబ్ధ సరసకవిత్వ

విదితమానస తిరువేంగళనాథ
విరచితంబగు ప్రతిద్విపదసంశ్రవణ
తరళిత కవిమస్త ప్రణీతోరు
మనసిజ జనకాష్టమహిషీ వివాహ
మనుకావ్యమున ద్వితీయాశ్వాసమయ్యె.



శ్రీరస్తు

# అష్టమహిషీ కళ్యాణము

## తృతీయాశ్వాసము

(శ్రీదేవీ మహిమవర్ణన.)

[ ద్విపద ]

శ్రీకరవర్ణ యంచిత హేమవర్ణ
యాకీర్ణభుజజాల యనుపమ శీల
మునిలోకనుతలీల ముకురకపోల
యనఘామృతాపాంగ యలమేలుమంగ
యవధరింపుము దేవి యమ్మహామాని

కువలయేశుఁడువల్కెఁ గువలయేశ్వరుని
నావార్త విని వల్లవాంగనామణులు
భావజాశుగములు భావముల్ దూర
గాఁవింపరాని యంగజతాప మొదవ
గణములై గిరివనాంగణముల నిల్చి
హరివిలాసములు నొయ్యారిబాగులును
బరిరంభణములు చుంబన రసక్రియలు
సొలుపు చూపులు తలచుట్టు గన్నులును
గలికి పల్కులు ముద్దుగారెడి మోము
డాలుచెక్కులును బిడారువన్నియలు

నాలీలలును విన్నాణంపు నడలు
తలపోసి తలపోసి తలయూచి ప్రేమ
కులుకంగ లోలోన గుబ్బతిల్లుచును
కలువతూఁపులు కడుగా జాఱుజాలు
జలములోయన సకజ్జల భాష్పతతులు
యిఱిగుబ్బ పాలిండ్లనెదలఁ బయ్యెదల
నెఱియఁ గ్రొమ్ముళ్లూడ నిట్టూర్పులిడుచుఁ
జెక్కుటద్దములగైఁ జిగురాకుతెరలు
నెక్కొనఁజేర్చి యూనిన తమకమునఁ
గటకట బ్రహ్మకెక్కడి పాటి పాటి
ఘటియించెనేసి యిక్కడ మమ్మునిట్లు
వాసుదేవునికేల వలవంగఁ జేసెఁ
జేసెఁ బోయెడబాయఁ జేయనేమిటికి
ఆయెఁబో శౌరి దానైననేమయ్యె
నాయెడఁదుగులైరి నమ్మినారనక
కనికరింపక యిట్టి కట్టడిమరుని
కనలుతూఁపులకు నగ్గము సేతుననక
వోరినెకోడెను వారి వారలను
వారినిగూడ నెవ్వారి దూరుదము
అక్రూరుఁ డక్రూరుఁడని యదరంద
నక్రూరునేతి బీరనెడి చందమునఁ
జుట్టంబువలెనె కృష్ణునినే జయింపఁ
గట్టడి నరకిఁ డెక్కడనుండి వచ్చె
హరిరేఁపె హేమహర్మ్యముల భోజేంద్రు
పురము కామినులు కప్పురపు క్రొవ్విరులు
కనకలాజలు చల్లఁగా నుల్లసిల్లఁ
గనివారిగోరియిక్కడ నేలతలఁచు

మధువైరి యిదిగాక మధురలోఁదరుణ
మధురాధరాధర మధురముల్గ్రోలి
మఱియున్న వేటికి మఱుఁగు నేఱుపులఁ

గుఱువాడినను కొన గోరుతాఁకులను
నయగారి మాటలనటన చూపులను
బ్రియముల నయముల బెల్లించి పొంచి
కాంతా నిశాకాంత కాంతసౌధములఁ
గాంతలేకాంత ముల్గలుగంగఁ జూచి
లాలించి సకలకలలను మెప్పించి
తేలించి తక్కించి తిరుగఁ జొక్కించి
తనువింతరతుల చిత్రమైన రతుల
నెనయ వ్రేతల పొందు లేలచింతించు
నాపొందు మఱువని యాపురికాంత

లాపద్మ నేత్రుఁబాయఁగ నోఁపరెవ్వరు
నటు కృష్ణుఁ గొనిపోకుమని ప్రణమిల్లి
కుటిల విచారున క్రూరువేఁడుదమొ
లోలోనవిరుల చాలుపుల వేలుపులఁ
జాలపూజింతమో శౌరి నిల్చుటకు
మన మందరము మన మందరోద్ధరుని
జననీక చరణకంజముల వ్రాలుదమొ
యనికామభీమ సామాంబకా హతులఁ
దనువులు జర్ఝరితంబులై జడియ
హరి పరాయత్త చిత్తాధీనలగుచుఁ

బ్రమ మానులు బోలె బాహ్యముల్మఱచి
జారుకొప్పుల వెడఁ జాఱుపయ్యెదలఁ
దోరంపు తుదలందుఁ దొరఁగుకన్నీట

## అష్టమహిషీ కళ్యాణము

మాధవ ధవళాక్ష మధువైరి శౌరి
భూధవ శివవంద్య పుండరీకాక్ష
పరమేశ మునివేద్య భవరోగవైద్య
హరి కృష్ణ మామొఱ లాలింపు మనుచు
నంతరంగార్తిచే నడగు గీతముల
నింతులెలుగెత్తి నెంతయు నేడ్చి
తలఁపులొందించు మాధవమూర్తి పూర్తి
తల పోసి యొకకొంత తాళిరంతటను
గరఁగుబంగరుగుండు గతిభానుఁ డుదయ
గిరినిల్వ నుచిత సత్క్రియలెల్లఁ దీర్చి
జనములువెట్టు బ్రసాదంబు బంధు
జనములు దాను భోజనము గావించి
లాలిత భూషణాలంకృతుల్రామ
నీలవర్ణులు రోహిణీ యశోదలకు
మ్రొక్కినమస్తములూ మ్రొక్కినియక్క
నక్కడాయించిముద్దాడి దీవించి
కడుమోహముల కజ్జములొబ్బెట్టి
తడుపులుగట్టి యిద్దఱిరెయొడిఁబెట్టి
క్షేమంబుతోఁ బోయి క్షేమంబుతోడ
రామ కేశవ వేగ.........
బదనంబుసిరికున్కి పట్టగుఁగావఁ
బమున నీబంటు బంటిల్లు మెట్టి
తుదలేని దయ బవిత్రుని జేయుమిపుడు
నను గృతార్థుని జేసి నావిన్నపంబు
మనవి చేకొనినన్ను మన్నింపుమనుచుఁ
బదములఁ బడిపాలుపడి వేఁడికొనిన
మదనగురుండు సంభ్రమమున నెత్తి

వింతయే నీవింత వేండ నేమిటికిఁ
జింతింప నేలవచ్చిన పనిఁ దీర్చి
వచ్చెదనీవేమి వసుదేవుఁ డేమి
యిచ్చలోఁ దలపోయ కేఁగుసీవనినఁ
బని విని మొదనంచుఁ బ్రణతుండై యరిగి
కనికంసుతోఁ దదాగమనంబుఁ జెప్పి
సుజనులు పొగడ దుష్టులు కడుబెగడ
నిజవసతికిఁ గాందినీసుతుండరిగె

బల కేశవుల శత్రుబల హార విపుల
బలపరాక్రముల గోపాలకల్లోలువ
నిరుపమోన్నత మణినికర సాలములఁ
దరణిసంగత మహోత్తాల సాలములఁ
నహిలోకమొరయు మహాపరిఖములను
బహు చంద్రకాంత శుంభద్గోపురములఁ
జండకరాభ కాంచన కవాటముల......
రమణ జలాముఖ రంధ్రకుట్టిమము
లమరఁ జేకొని జంటలై దంటలగుచు
నుత్పలబాణ మంత్రోపదేశంబు

నుత్పలాక్షులకు నత్యున్నతి నొసఁగు
గతులకుఁ బరిపరి గతుల కాముకుల
మతులనీరుగఁ జేయు మదితనాదముల
ధళుకొత్తు పారావతముల మొత్తముల
సలలిత బహుకేళి శైలజాలముల
నవల మాణిక్య సౌధాంగనావికచ
కవభరంబులుగని ఘనములోయనుచు
నాకాలకంఠ మూర్ధాగ్రముల్నిగుడఁ

గేకాధ్వనుల్జేయు కేకిబృందములఁ
గిసలయ మాలికాకీర్ణంబులగుచుఁ

బసిఁడి కుండలను దర్పణగణ స్ఫురణ
నుదటుపూఁబోణుల యూరుకాండములఁ
గదలికల్ పచరించు కదళికల్పొదలి
సంతత చిత్రసజముల సౌవృంత
కాంత పూఁగములఁ బూగముల పూగముల
పులుఁగు జవ్వాది గప్పురము గస్తూరి
కలయంబు వులుచల్ల కలయంబు పసలఁ
గమనీయ సూత్ర సంగతుల నారతులఁ
దముదామె యిచ్చు రత్నంబు బొమ్మలును
సలలిత హేమ తేజముల లాజముల

విలసిల్లుచుండెడి విపణిమార్గముల
నజపురందరుల యక్షాధీశుఁ దెగడు
ద్విజుల భూభుజుల సందీపితోరుజుల
సమధి కాలంకృతుల్జడిగొను పుష్ప
కములకై వడి శీతాంగముల సంఘముల
హరుల బింకము గెల్చు హరుల దిక్కరుల
గిరులనవ్వెడి మదఘీంకార కరుల
నవికల బకచక్ర హంసజాలముల
కొలకులమును కెలంకుల కొలంకులను
ఫలిత పుష్పిత రసభరిత సంవలిత

కలితలై యున్న శృంగారోపవనుల
రవిబింబనిభ పద్మరాగ దీపముల
భువన మోహనములై పొల్చు ధూపముల
నడలక తమకు నీడను బేడసలకు
గొడిమెడి నవరించు గొప్పకన్నులను

బనిపడి తముదాము పవడంపులతల
గనియలుగాఁజేయు కావిమోవులును
నిలదొమ్మిఁదవ లెక్కలెక్కటి మాకు
నేలెక్కలని హసియించు వీనులును
వడిఁదన్ని తనకొప్పుఁ బట్టివంచినను

విడదు గుణంబని విలుఁదిట్టుబొమలు
దొరసి వాళ్లకుఁ బొత్తులు దుగించె గొట్టు?
లరయఁ బాగముగనియాడు కంఠములు
గట్టిగాఁ దనుగాంచి కఱచి చూచినను
వెట్టబంగారని విసుగు మేనులును
నొగిలినతము చూచి నోము నానాఁట
దిగఁగాఱఁ జేసిన తేటమోములును
బిరుదులఁ దమతోడఁ బెనఁగునెమళ్ల
పురివిచ్చుఁ జేయు గప్పుగల కొప్పులును

1.........................
పొదలురే నారికొప్పున నొప్పువికుల
చదరునమింట నక్షత్రంబు లెనఁగె
దలఁకు భోజునకు వంతలు దుర్నిమిత్త-
ములుదోఁచె దుస్స్వప్నములు చూపెనంత
తలికుఁబోణుల మానధనములఁ దివియు
నలినాస్త్రుఁ చోరు కన్నపు కత్తియనఁగ
నామీనసతి దాల్చునట్టి దైవంక
నామమోయనఁ దోఁచె నలినారి యపుడు
లలిత మాణిక్య వల్లరుల వల్లరుల
తులనించు చిత్రధాతువులఁ గేతువుల

Note 1:—కం ॥ 180, 181, 182. మాలపత్రములు నిరిగినవి.

లాలిత వివిధ జాలముల జాలముల
జలజాక్షు పీరరసంబు చందమున
జలజాప్తు డుదయించె జననాథయంత
నగరు చీకట్లు చక్రాంతరంగముల
పొగులెల్లఁ దేరుఁ దూర్పునరవి దేఱె
నుడువీధి యనెడు పయోరాశినొప్పు
బడబానలంబనఁ బ్రభలు చూపట్టె
శ్వేతపాటీర మంచికల మంచికల
ధౌతమయాతపత్రములఁ ఛత్రముల
తలకొన్న భేదనాదముల నాదముల

వలగొన్న పౌరభూవరుల భూసురుల
గలిగి చందన పూగ కర్పూర మిళిత
జలముల యంబునఁ జల్లరాజిల్లఁ
గమ్మగస్తురి మట్టిగను పట్టినట్టి
యమ్మహారంగ పరాంగణస్థలిని
భోజేంద్రుఁ డప్పుడొప్పులు మీఱు రత్న
రాజిత భూషణ రాజిఁ గైసేసి
దొరలు బాంధవులు మంత్రులు పడవాళ్లు
పరిచారకులు ససంభ్రమముగఁ గొలువఁ
జంచదుత్తుంగ కాంచనమయమంచి

కాంచిత పీఠిపై నాసీనుఁ డగుచు
బలువైన జగజెట్టి పౌఁజులతవణి
మలహరి మొఱయింప మరసాహసములఁ
బొంగారు భుజములఁ బూజించి చెలిని
జంగాలిముత్తెంపు జల్లిఁ గేలించి
నున్నని మెరమట్టి నూఁగైన పసపు
వన్నియ పుట్టంబు వలెవాటుగైచి

కదిసి హీరమ్ముల గదివాడియనుప
చదురుల వలెదాల్చు చేముల్లఁ దాల్చి
జగజెట్టి యగునట్టి చాణూరు డపుడు
తగునుక్కుగట్ల సత్త్వముగల జెట్ల
నొనగూడి భోజేంద్రుఁ డున్న యచ్చటకుఁ
జనుదెంచి కాంచి భుజంబప్పళించి
యెదుటుమీఱగ మ్రొక్కి యొకచక్కి నిలువ
నదనువాటించి నందాదు వేతెంచి
యరయుకానుకలిచ్చి యతని పంపునను
నరసడింభముల మంచములపై నుండ
నంత రామాచ్యుతులంత ః ంతకుల
వింతశృంగారంబు బీరంబు మెఱయఁ
గఱపట్టుదట్టి బంగరు వన్నెకాసె
నొఱపుగా సవరించి యురగేంద్రులీల
నిడుదలె ఱుగారు నెఱివంకజడలు
వెడలకప్పులుఁ తోడ వెన్నలు మెఱయఁ
దీర్చిన కస్తూ తిరుమళిమణులఁ
గూర్చిన కపురంపు కొమరు దీపింప
వడిమల్లబిరుద రావములు మిన్నందఁ
గడిఁది డక్కలు హుడుక్కలును ఘూర్ణిలఁగ
విని చూడఁ గోరి యవ్వేళ గోపాల
జనములు సేవింపఁ జనుదెంచి యెదుట
జలజాప్తుఁ డుదయాద్రిచరి నొప్పుకరణిఁ
దళుకుటద్దము ఫాలతలమున మెఱయు
గగనభాగము సంజగావిఁజెన్నొందు
పగిది మస్తంబు కెంబట్టుపట్టమర

నీలాద్రితట మహానిర్ఝరుల్ పోలె
లాలిత కర్ణఝల్లరులు శోభిలఁగ
మింటబర్వెడు తీఁగ మించులు వోలె
జంటలై బంగారు సరపెణల్ బెరయ
నాలోల కర్ణవాతాహతినద్రు
లాలోలగతిఁ జెందనాశలూఁ టాకఁ
గటతటి పటుదానకంటసలబ్ధి
పటలిభవద్భ్రిమ భ్రమరంబు లెగయఁ
ఝూత్కారముల నూర్ధ్వభువనంబు లెగసి
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
పలవదు తివియు మావంత నీవింత
చలముఁ జేసినఁబట్టి చంపుదుమనిన
లావునఁ గుంభి పాలకుఁడా బాలకుల
పై వారణంబు కోపమునఁ డీకొలుప
నింతైనఁ దెరువీక యీవంతయంత
నెంతగావించె వీఁ డెంత గొట్టనుచు
దట్టిబిగ్గఱ జుట్టి దట్టించి పలికె
దిట్టయై నిలిచి దైతేయమర్దనుఁడు
గదియఁ బాదముల నక్కరినాది కడిమిఁ
గదిమి యంకుశగతిఁ గావింప గజము
కడురేసి నిజతుండ కాండంబు సాఁచి
యొడిసిన హరిదాని యొడుపుఁ దప్పించి
కరమున హస్తి పుష్కరము బీరంబు
బెరయంగఁ జఱచి దర్పించి కొప్పించి
గడగడ దైత్యాళి గడగడవడఁకఁ
బిడుగుకై వడిముష్టి నేర్చిలెల్లార్చి

వడిఁగుంభ మధ్యంబు వ్రయ్యఁ గాఁబొడిచి
కడచిలో నిక్కడక్కడఁ జూపిలాచి
పదములలోఁడాగఁ బదపడి కుంభిఁ
యెదుటఁ గానక కోపమే పారఁ బ్రకట
కటముల మదము లుత్కటములై తొరఁగఁ
గుటిలత గొమ్ములకొలఁది భూతలముఁ
గ్రుమ్మికోరాడి నాకల మూకలగలఁ
జిమ్మ జాడింప రాజీవలోచనుఁడు
బెడిదంపుకడఁకమై బిరుదనే తెంచి
వడిమహాపాత్రాలవాలంబు వట్టి

పంచవింశతి ధన్వ పరిమాణ దూర
మంచితగతి నీడ్చి యలవోకడాఁకఁ
గరబట్టిహావి కరకర బెట్టి కొట్టి
సరగున సవ్యాపసవ్యయముద్ద్రిప్పి
యవలీల గేలమోమగలంగ నడఁచి
భువిఁవ్రాలుగతి జొచ్చి పుటముగా నెగసి
చిరిమి హస్తము వట్టి చిర చిరగనలి
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
బిరబిర ద్రిప్పి మూర్ఛిల నేలత్రైచి
సిరివరు జయలక్ష్మి నేసఁ బ్రాలనఁగ
వరకుంభ మౌక్తిక వ్రాతంబురాల

విలవిలఁ బ్రాణముల్విడువంగ దరము
నలవజ్రగతి ముష్టి హతినుగ్గుఁ జేసి
దాని దంతంబు పంతంబున నూడ్చి
పూనితానా హస్తిపుని ముక్తిఁ గనిచెఁ
మేలనియటఁ బుత్ర మిత్ర కళత్ర

అష్ట. 18.

జాలంబుతోఁ బౌరసంఘంబు వొగడ
సమరంద బిసహస్త సామజ యుగము
క్రమమున రక్తాక్ష కరదముల్దాల్చి
బలునితో హరి నిజబల పరాక్రమము
లలరంగ నలరంగమపుడు సొత్తెంచె

మల్లులకశని భూమండలేశ్వరుల
కెల్ల రాజంతుల కెల్ల నంగజుడు
గోరక్షకులకు సఖుండు వైరులకు
వైరిగేఁ గన్నట్టుదారికి శిశువు
అల భోజునకు మృత్యువగు నలజాల
ములకు విరాట్టు సన్మని వరేణ్యులకు
బరతత్త్వ మచ్చటి బంధు సంతతికిఁ
బరమ దైవతమునై బలునితోనొప్పు
భోజుండపుడు భయమునుబొంది పౌర
రాజి రాజీవాక్షు రాజితమూర్తిఁ

గని మోదమును జెందికడు వెఱగంది
తనువులు గరుపారఁ దమలోనఁ దాము
ఈతని కరినిమో మీతని మోవి
చూతమో మదిఁ జవిచూతమోయనుచుఁ
బొందున నితని కపోలంబులలమె
కొందమో ముద్దిడి కొందమోయనుచు
రామ కేశవులు నారాయణమూర్తు
లే మర్త్యులై యవలీల బాల్యమున
బదరు ప్రలంబుండు బకుడు ధేనుకుండు
మొదలైన యసురల మోది మోదించి
యిలభారమణపంగ నీ కంసు జంపఁ
జలములు రెట్టింపఁ జనుదెంచిరనఁగ

గుటిలతలోనుండి కొనసాగి వెలికిఁ
జట మరించిన రీతిఁ బొరిగొన్న సికయు
ననుపమ కాల దండావతారంబొ
యన నొప్పు భయద బాహాదండములును
గలిగి యయ్యెడల యకాలపాశంబు
వలగొన్నగతి మెడవడిజందెమొప్పఁ
గాలవర్ణములతోఁ గాలకూటంబు
జ్వాలలఁ బోలు మీసలు డిడ్డికొనుచు

జేవురుఁ గోరాడి చెలఁగు నాగంబు
శివమై మెఱయు మట్టియకాలిమించి
పొదలు మూఁపులు శిరంబును దడబడక
మదియించి త్రిశిరుని నూడ్కొనుప్పొంగి
చాణూరుఁ డనియె మచ్చరమున సీర
పాణి యాదవ వజ్రపాణి నీక్షించి
మిగుల గోపకులతో మెఱసి పోరాడ
జగజెట్టులని మిమ్ము జగము వారెల్లఁ
జెవులు పండువులుగాఁ జెప్పఁ గంసుండు
తివిరి మిమ్మిటకుఁదోఁ దెప్పించినాఁడు

మిన్నంట నారాజు మెచ్చఁగానొక్క
నన్నఁ జూతమురమ్ము జలజాక్షయనిన
నంతటివాఁడ వీవెంత మేమెంత
యంతరంబరయ నీడగునె మమ్మెఱయఁ
జెల్లునేమైన నీ క్షితినాథు వేడ్కఁ
జెల్లింపవలయు నేర్చినపాటి మనము
పోరుదమిపుడు నీ పొంతమ్మిటైకునిఁ
జేరి సీరిని బోరఁ జెప్పమటన్న
మనను చూడఁగ నొక్కమాటన్నఁ గ్రొవ్వి

యనిమొను నీకునే నలవియె కృష్ణ
యెనసి యేనుఁగులతోనే లాటమాడఁ
జనఁ జూచెడింత విచారంబు లేక
తనివి వారును వీరుఁ దలఁ చూపిఁ జుట్టి
సివము రేవఁగ వచ్చి చెనకెడవేల
కరకలాడెదుమమ్ముఁ గదసి పోరాడఁ
దరనో యీవట్టి పోతరమేల నీకుఁ
పొలసినఁ డాగినఁ భువి దూఁకినటుల
మలసి వేఁడినను ముమ్మాటికి నిన్ను
బోనియ్య నియ్యెడ భోజుండు మెచ్చ
నానెదుఁ బాదంబులందు రమ్మనుచు
మదినుబ్బి చాణూరమల్లుండు చలము
పొదలించి యదరించి భుజమప్పళించి
యెదురుగాఁ దురదురనేతేర శౌరి
గదలక రిపులు గ్రక్కదలఁ బెల్లార్చి
ధరతల్లడిల్లఁ జెంతలనున్న మల్ల
వరులెల్ల భీతిల్ల వడిమల్ల చఱచి
తలపడి రిద్దఱుతగఁ చిత్రగతులఁ
బలువిడి పిడివిళ్లు పట్టికొట్టుచును
డాయుచు ముష్టిఘట్టనలు చేయుచును
బాయుచుఁ గదిసి యార్భటులఁ జేయుచును
విన్నాణముగఁ బట్టి పెనఁగుచు వింత
విన్నాణములరెసి వ్రేశి గద్దించి
శిరమును శిరమును జేతులుఁ జేతు
లురమునురంబును నూరులూరులును
బెరయ బాహాబాహిఁ బెనఁగు లాడుచును
దొరసి ముష్టాముష్టిఁ దొడరి పోరుచును

నొకకొంత తడవు నీ యుద్ధముద్ధతిని
ప్రకట సత్వంబునఁ బ్రబలికావింప
తాణమైయప్పుడడ్డము దూరి శౌరి
చాణూరులైచి శౌలమునకు వచ్చి
యుల్లాంగమునఁ బట్టి యూరులనొక్క
మల్లుండు మెచ్చి మమ్మారేయుటంచు
నేర్పునం గాలులోనికిఁ జొరనిచ్చి
దర్పించి పొరలించి దనుజారి కెరలి
నటనను దాటంబునకు వచ్చి చొచ్చి
పటుముష్టి చేవెన్ను పగుల ముష్టింపఁ
దరలక జెట్టియత్తఱి జోఱగొన్న
తెఱఁగునఁ బెడఁ బాసి తివిరి మార్కొనిన
డీకొని హరివాని దిణికించిలైచి
పైకొని జఠరంబు పట్టిలోఁగించి
కనలుచుఁ బొడిచి వేగంబ ఢొక్కరముఁ
గొనుచు మల్లుని మన్నిగొనుచుండ బలుఁడు
మొనసి ముష్టాముష్టి ముష్టికుని నిట్లు
పెనగుచులైచి యభేద్యుఁడై పోరఁ
గని పౌరకాంతలు కనికరంబంది
యనిరిలోలోన యోయమ్మ కంసుండు
చెండమ్మ గతినొప్పుచే సోఁకినంత
గండుదురోయన్న కరణినున్నారు
తేటికన్గొనఁ జెక్కుడెసఁ బాలువెన్న
గాఱెడు ఝాముద్దు గాఱెడివారిఁ
గటకట చెలరేఁగి కనలి దానవులు
యిటువంటి నరకలతోడఁ బెనంగు
లాడంగ బడ్డను బెలుచ కై వడిని

గనుగొను బిడ్డలఁ గనడెపో వీఁడు
రాజుగన్గొని చూచు రసవేత్తలైన
యీరాజగ జట్లకు నీ బాలకులకు
నీడుగాదనియన రెంత యిచ్చకము
లాడుదురా కంసుఁ డాడినయట్లు
అతని కిం పని ధర్మ మాడకయున్న
నతని నంటునపాప మంటదే తమ్మ
నీయెడ గోవిందు హేమాంబరముల
మైయున్న నతనిబాయకయుండ వచ్చు
నగపడిహరి వేణులై యున్నఁ దిన్న
నగుమోవితేని యలానంగ వచ్చుఁ
బంకజోదరు కౌస్తుభంబులమైన
నంకెల నతనిబాయక యుండవచ్చు
నిట్టు పుట్టించువాఁ డిందేలమమ్ముఁ
బుట్టించె బ్రేపల్లఁ బుట్టింపకజూఁడు
దొరసి యాగోవిందుతోఁ గూడి యాడి
తిరుగుచు సుఖకేళిఁ దేలియామూర్తిఁ
జెలువుమైనొంద వీక్షించు నాగొల్ల
చెలువలే పుణ్యంబు చేసినవారో
యనువారి యాత్మల యనుతాప మెడల
దనుజారి మల్లయుద్ధము చేత జడిసి
దగఁ దొట్టి జెట్టి మైడఁబుచుగాఁ జెమట
దిగఁగాఱ మిగులవేఁడిమి దానవారి
కములసంభవముఖల్గనవేని పాద
కములమున్మల్ల వక్షము బిట్టి సోఁకఁ
దన్నిన వడివేచి దర్పించి వాఁడు
లెన్నని యంసంబు వ్రేసి డాసినను

వలపులపూఁ బందిలైనఁ గుంజరము
తలఁ కనిగతి నింత తలలకపోంగి
కరిఘాల మగివించు కరివైరిపోలె
హరివానితలచిప్పలై పోవఁ బొడిచి
కురియు నెత్తుటను జేగురుగొండవోలె
ధరసోలువాని పాదమ్ముల నొడిసి
నూఱునునిండెఁ జాణూరు నకనుచు
మీఱి దేవతలెల్ల మెచ్చి నుతింప
బిఱబిఱఁ ద్రిప్పి కుంభిని మీఁదవైవ
నఱిమఱిఁ బరలోక మరిగెవాఁడంత

బలుఁడు ముష్టికు ముష్టిఁ బలు విడిఁ బొడిచి
పొలియించెఁ జాణూరుఁ బొలియించు పగిది
కనలిమీటు గనిటు గలకూటఁ డనెకి
పెనుజెట్టి బలుడిట్టి పెనఁగి వెండియును
ఛలతోసఁలాంబులు జగజెట్టి శౌరి
చలమునఁజేసి నిశ్చలముగ నిలువ
బలుఁడు కృష్ణుఁడు వారిబలమెల్లఁ దక్క-
బలుపిడిపిల్ల దెబ్బలఁ జాలనొంచి
తొలుతఁ బోయినవారె త్రోవనే పనుప
నులికి చిక్కిన మల్లులుల్లముల్లలుఁగఁ

దొలఁగి సందులును గొందులు దూరిపాఱ
నలిగి కంసుడు భటాళి నీక్షించి
యిట్టి యీగొల్లల నీ వీడువెడలఁ
గొట్టుఁడానందుని గొట్టుఁ డాలోన
దేవకి వసుదేవు దేవకుఁ జంపి
జీవముల్గొనుఁ డుగ్రసేనుని ననినఁ
గరివైరి పర్వతాగ్రమునకై యురుకు

సరణి గృష్ణుండు మంచము మీఁది కెగిరి
వాలుమీఱగ వాఁడి వాలిచర్మంబు
గీలించి సింహంబు ప్రియుఁ గంసుఁ డెదుర
హరియును మానవ హరి హేమకశిపు
కరముగ్రముగఁ బట్టుగతి వానిబట్టి
తల్లడిల్లఁగఁ దన్నితల కిరీటంబు
డొల్లఁ బెల్లార్చి తిట్టుచు నేలగెడపి
తోనకుప్పించి నందుని పట్టిపూని
వానిబోనీక జీవంబులఁ బాసి
పులివేటి గఁబళించి పొరలించు పగిది
నల కంసు మేను రంగావని నీడ్చె
నరిబుద్ధినైన శ్రీహరి నెంచెఁగాన
ధరణిఁ గంసుండు నత్తఱి ముక్తుఁడయ్యె
హరియుని యూరీతిననిన వారలకుఁ
గరతలామలకంబుగాదె మోక్షంబు
క్రోధంబుతోనన్య క్రోధకంకాది
భూధవావరజు లప్పుడు చుట్టుముట్ట
నెంతయు బలకృష్ణులెదిరించి దంతి
దంతములూనిత దంతముల్గొట్టి
దము చూసి నిమిషంబు ధరియింపలేని
తమయన్నయున్న చెంతకువచ్చి రంత
వాసుదేవుల జగద్వాసుల నుతులు
నేసి మ్రొక్కిరి మునిశేఖరుల్సురలు
ఆడిరి రంభాదు లంతంత మెచ్చి
యాడిరి బ్రహ్మాదు లలరి కిన్నరులు
పాడిరి మిగులఁ జొప్పడి సరివారి
బాడిరి శత్రు భూపతులెల్ల జెదరి

యంతఁ గంసుఁడు మొదలగు వీరవరుల
కాంతలు ఘనశుగా క్రాంతలై వచ్చి
కదసిన దుఃఖాంధకారమ్ము తమ్ము
బొదవఁగనిరీతి కొప్పులు వీడిపోరల
జెన్నీట నఱ్ఱగుంటు బేడసలొప్పెతె
గన్నీటఁ బెనగొన్న కన్నులింపాఱవఁ

దగుదమ్మి మొగ్గలు తరగలఁ బొరలు
పగిదిగుబ్బలుమీఁది పయ్యెదజాఱ
హానాథ! హానాథ! యనుచుఁ బల్మాఱు
దీనలై విలపించు ధృతిఁ జాలివారి
యుల్లంబులందులనున్న శోకాగ్నిఁ
జల్లార్చివారికి సంస్కార విధులు
కావింపఁ బనిచిదిగ్గన శౌరి హరియు
దేవకి వసుదేవ దేవసన్నిభుల
మొనసిన భవబంధములు వాపుకరణిఁ
బెనుసంకెలలతోడఁ బెడఁబాయఁ జేసి

రావించి చరణసారసముల వ్రాల
దీవించి వసుదేవ దేవకులప్పుడు
డానంద బాష్పంబు లడరికాయముల
నానంద నూజుల నలమి ముద్దాడి
యోయన్న మీరలీయుర్విఁ దెగడుచును
నాయచ్యుతుని మూర్తులని సన్నుతింప
వినతులై యారామ విభుఁడును విభుఁడు
మునుకొనితమ బాల్యమున నెడయుటకు
వగచి వారలలోని వగపెల్లఁ దీర్చి
జగతి మాతాపితృ చరణాబ్జ పూజ

గావించు పుత్త్రుఁడు గాంచు ధర్మములఁ
గావింప కుండినఁ గనున ధర్మముల
నెనలేని దైవాజ్ఞ యిట్లున్న దయ్యా
జననిమా నేరముల్ క్షమియింపుఁ డనుచు
నరసి మాతామహుండగు మహా మహుని
జిరవైభవుని నుగ్రసేనురాలించి
మధురకురాజునిఁగా మన్నించి సకల
బుధులును విబుధులు పొగడనల్లడల
వివిధభూముల నన్యవేషముల్దాల్చి
చెవిరి కంసుని భీతిఁ జెందియున్నట్టి
యాదవోత్తముల దయార్ద్ర వాక్యముల
నాదటరప్పించి యవ్వోచట నునిచి
యాపూర్ణ సదనాంబరాదులతోడ
దీపించు సిరులఁదెం దేఁపగా నొసఁగి
కన్నవారలతోడ గరిమమైఁ బెంచు
కొన్నవారలతోడఁ గూడియాపీట
నెన్నుచు లోకంబు లెల్లరంజిల్ల
మన్నింపుచుండె భూమండలాధీశ
నందనందనులు సనంద సన్నుతులు
నందగోపునకుఁ బ్రణామంబు లొసఁగి
పొత్తుల ..................
నెత్తురు కందుల నీవు నీ దేవి
కన్నబిడ్డలకంటెఁ గడువిశేషముగఁ
జెన్నుగానెత్తి పెంచితిరిమో తండ్రి
వెన్నలు గావు దేవకి శౌరిమమ్ముఁ
గన్నవారను మాటగాక మీజోకఁ
జన్నిచ్చి యుగ్గిడి సకల సౌఖ్యములఁ

చిన్ననాటను గోలెపెంచిరే యెలమి
నోత డ్రి వేయన నేలను నీవె
తాతవు నయ్యశోదయుఁ గన్నతల్లి
యనియుండు మముం జక్కనఱియు మీజనని
జనకు సంతసమంద జనకయోజచక
వచ్చిన పనులెల్ల వరుసతోఁ దీర్చి
వచ్చెదమొక కొన్ని వాసరంబులకుఁ
దడవును జేయ మందఱి వేఱు వేఱ
నడిగె రాముడు కృష్ణుడఁని చెప్పి పిదపఁ
గుమతి కంసునిఁ బట్టి కూలిచిరనుచు
మమునెన్ను తమదు నేమము నెన్నుమను
హారులునుంగరులు భూషాంబరావళులు
వరుపుల్లు నూళ్లును వలయునట్లొసఁగ
బడినున్నయట్టి గోపాలశేఖరుల
కడిగినయట్ల యిష్టార్థంబు లిచ్చి
పనుప నందుఁడు కూర్మి బాష్పములు గ్రుక్క
కొనుచు వస్తువులు గైకొనుచుఁడా లాంకు
హరిఁ బాసి పోవఁ గాళ్లాడక మఱలి
మఱలి చూచుచునేగె మందకునంత
దేవకీవిభుఁడును దేవకి సతియు
రావించి బంధువర్గముల రప్పించి
కడుసంభ్రమంబున గర్గాదులైన
పుడమి వేలుపులనప్పుడ పిలిపించి
వడుగుల కెలమిమై వడుగులు సేసి
యుడుగని వేడ్కతో నుబ్బియందఱును
కనకముల్పుట్ట ముల్గరులు ధేనువులు
తనియంగనిచ్చి యెంతయు వేడ్కమున్ను

దానంబు లోకనిదానంబు గూర్చి
యానీలవర్ణుఁ గన్నప్పు డిచ్చుటకుఁ
దలపోసి యావస్తుతతుల సమ్మతులఁ
బిలిచి ప్రార్థించి యర్పింప నంతటను
అమిత విద్యావేత్తలయ్యు సత్కృతులఁ
గ్రమమున నలుఁపు సంగితి కనిడాసి

దేవాఖ్యయగు నవంతీపురివాసు
దేవుండు నాబలదేవుండు జేరి
యచ్చట సాందీపనియను విప్రు చేత
బ్రచుర విద్యావిచారతసించి తాము
విలసచ్చతుర్దశ విద్యలు నేర్చి
విలసిల్లు గురుఁ జూచి వేఁడుమిష్టంబు
చేకూర్తుమన విని చెలఁగి యవ్విబుధుఁ
డాకూర్చు శిష్యులకనియె నంభోధి
బహుపుణ్యావాస ప్రభాసతీర్థమున
విహరింపుచుండెడి వేళనక్కడలి

కొడుకుఁ డెక్కోలుగాఁ గొని పోయెవాని
బడయుట సకలంబు వడయుటయనిన
స్ఫురిత తుంగాంశుగా శుగనేనథములఁ
గరమొప్పు తేరు డిగ్గనెక్కి కదలి
కడలి చెంగటికేగఁ గడలేనివేడ్కఁ
గడలియేతెంచి చక్కఁగ సాగిమ్రొక్కి
రామపాలిత రమారామ విచ్చేయ
నేమికారణము నాకెఱిఁగింపుమనిన
గురుతనూభవు నేలకొంటి తెమ్మనిన
గురుతర భయముచే క్షూరుడునిట్లనియె

తనకేమి పని దేవతలలోని పంచ

జననాముఁడగు పంచజన భోజనుండు
హరియించెనన విని హరిమింతునుక
శరధిలోఁ జొచ్చియచ్చటవాని పొట్ట
చించి నిర్జించి యాశిశువును గనక
పంచాస్త్రిమాతులు పగిదిఁ జూపట్టు
పాంచజన్యంబునాఁ బరగు శంఖంబుఁ
గాంచి యంచితముగాఁ గరశాఖనుంచి
యన్నతో జముఁడున్న యటకేగి శంఖ
మున్నతోగ్రారవ మొదవఁ బూరింపఁ

గడగడవఁ డకుచుఁ గాలుఁడేతెంచి
తడయక యాసీరధరుని శ్రీధరుని
గనిమొక్కి పూజించి గర్వంబు దక్కి
చనుదెంచు టేమియో సామిమీరిటకు
ననుఁడు సాందీపనియనెడు మద్గురుని
తనుజుఁ దెచ్చితివి తత్తనుజుని నిమ్ము
అన సమవర్తి మహాప్రసాదంబు
కొనుఁడు వీఁడనివాని గొనివచ్చి యొసఁగఁ
బరమ సాహసులైన బల బలానుజులు
గురుపుత్రుఁ గొనివచ్చి గురునకునిచ్చి

నిలువ సాందీపని నిగమవేద్యులను
బలకేశవుల సర్వఫలదాయకులను
దీవించి తనపాలి దేవతల్గాఁగ
భావించి పొగడనబ్బలుఁడు మాధవుఁడు
గురువుచే ననిపించికొని సమ్మతమునఁ
బురసతుల్దమ్ముఁ జూపులచేతఁ గ్రోల
మధుర గీతవ్రాత మధురమైనట్టి
మధురకేతెంచి నెమ్మదినుండిరంత

పద్మాకళత్రుండు భక్తవత్సలుండు
పద్మాక్షుండా యదుపతి యొక్కనాడు

తతన యాగమచరయోద్ధవుని నుద్ధవుని
గుతుకంబుతోఁ బిల్చి గోపికల్దమదు
తలపులు తనువు లర్థంబులు ప్రాణ
ములు భ్రతుకభిమానములు నేడుగడయు
దనుదాన తలపోసి తసుదాన పిదప
తనులేన రీతుల ధరియించి నారో
యఱలేక నన్నాత్మ ననిశంబుదలఁచి
మఱువని వానినే మఱవలెఁ గాన
వ్రేఁపల్లె కరిగి యాఁవ్రేంత విరహ
తాపంబుల ను ననుతాపంబులెడము

మొదలి కూటములెన్ని ముదమందమంద
కిదెవత్తుమని చెప్పు మేకతంబునను
నంద యశోదలానందంబు నొంద
ముఁదుగా జెప్పుమీ మొదలి పల్కనుచు
జడిగొనవారికా సఖులకు నాత్మ
నుడుగనితమితోడ నుడుగరలొసఁగ
నతఁడు గోకులమున కరిగెఁ దేరెక్కి
యతని గన్గొనినందుఁ డతిమోదమంది
యందికాఁగిటఁ జేర్చి యాతనిగూర్మి
విందుగాఁదలఁచి గోవిందుగాఁ జూచి

రాజిల్ల గోపాలరాజితోఁ గూడఁ
బూజించి యిష్టాన్నములఁ దృప్తుఁ జేసి
బలబలానుజులకు భద్రమేమన్నుఁ
దలఁతురే పెంచిన తలిదండ్రులనుచుఁ
దనతోడి గోపాలతనయుల గోప

వనితలఁ బసులనివ్వనము లెన్నదురె
చిన్నారి మాకృష్ణు చెనొక్కనాఁడు
కన్నులు చల్లఁగాఁ గనుఁగొందు మొక్క
బకుని ధేనుకుఁ బ్రలంబకుఁ బరిమార్చి
యకలంకమముగాఁచి హరియించు మఱియు
నలవి మీఱినయట్టి యతని కృత్యములు
తలపోసి తలపోసి తనలోనడొచ్చి
కన్నీరుఁదొఱఁగ గద్గదకంఠుఁడగుచు
నన్నందుఁ డేమియు ననసేరకున్నఁ
గనుదోయి బాష్పముల్గ్రిమ్మంగఁ బాలు
చనుదోయినుప్పొంగి చాలఁ బాఱంగఁ
గొడుకు నామము పేరు కొని కొని యాడి
నిడుద నెయ్యములోన నిగుడ యశోద
యన్నలినోదరుం డన్నతోఁ గూడ
నన్నయెన్నఁడు వచ్చునన్న యుద్ధవుఁడు
తడవునెన్నఁడు మమ్ముఁ దడవుమూర్తరను
బుడమిపైఁ గెడపియుప్పడ యరుదెంచుఁ
దనువులు సడలించుతఱి హరియన్న
జనులకు వైకుంఠ సామ్రాజ్యమబ్బు
నాదివిష్ణుని మూర్తులగు సీరి శౌరి
నే దిన మీయాత్మ నిలిచిరిగాన
నేమని నీ భాగ్యమెన్నుదుఁ దండ్రి
యేమని నీ పుణ్యమెన్నుదుఁ దల్లి
యని యింధన జ్యోతియనువున సకల
జనులందు నిచ్చనిచ్చలునుండు హరికి
జననముల్జనకులు జననులుఁ గలుఁగ
రనఘులత్రోవ మీఱటనుండుఁడనుచు

హరివారి కొసఁగు భూపాదికం బిచ్చి
హరివర్ణనలు సేయ నార్యాతివేగఁ
జలదంబర స్తన జఘన తాటంక
ములఁ గుంకుమాననముల గోపసతుల
నలకించి యంకించి హరిఁ బాడి పాడి
పొక్కించి దధిదర్పఁ బొడముచునున్న
ఘుమఘుమ ధ్వనులు దిక్కులు నాకసమ్ము
గమకమైపొడవ మేల్కాంచి యుద్ధవుఁడు

అనువొంద సాంధ్య కృత్యము లాచరించి
మునువిన్న సంకేతముననున్న యపుడు
రాజీవ నేత్రముల్ రత్నకుండలము
లాజానుబాహువు లంబుజాననము
తామరపూదండ దరహాస లీల
హేమాంబరంబు వహించి యచ్చోటఁ
బొడమనద్భుత వేష భూషణుండితని
బెడగాంతమని గొల్లపూఁబోణులెల్ల
నగవుజూపులతోన నానలోనావ
నగధరు చెలికాఁడవగుటెఱిగితిమి

తలిదండ్రు లింపొందఁ దనదు సేమంబు
తెలుపనిన్నుపనె తెంచితొయిటకు
నూరివారలతలఁ బొల్లకుండినను
వారినై నను మఱువఁడుమేలె శౌరి
యని తూఱఁ దూఱంగ నందులో నొక్క
వనితచెంగటి మధువ్రతము నీక్షించి
యతనికిఁ దెలిపె నన్యాపదేశమున
నతనుని నెంచియు ననియె నేర్పునను
మధుపమోహితవాప్త మాయంఘ్రులంటు

విధమెట్లుతొలఁగు నీ విధమెఱుంగుదుము
నగరకామినుల చన్గవకుంకుమముల
జిగిమించు విభుఁడు దాల్చిన తమ్మిదండఁ
దొఱఁగుప్పొడిఁ దొప్ప దోఁగిననిను
బరమాత్ముఁ గానమ్ముఁ బతిచంచరీక
దానవబల భేది తానవ పౌర
మానినీసక్తుఁడై మమ్ము నవ్వుచును
నొకనన తేఁటి వేరొక విరిదాఁటి
మకరందమానిన మాడ్కి మామోవి
యిగురువిల్తుని నలయించినవింత
నగరకామినిఁ గూడ నగరెకామినులు
ఇంతగొంటడసిననేరీతిఁ జిక్కు
నంతయు పోతానెయని కోరి ప్రేమఁ
జిక్కుచు వలసివచ్చినవారిఁ బట్టి
ముక్కును జెవులునుమోఁడు గావించె
దనుదానెదలఁచని తరుఁ జెరెనొరుని
గనుమూసి చంపు నిక్కంబుగానెపుడు
బాలకుఁడని నమ్మ బలిగావెంట
నేల్రబామిన యతనికె మేలుగలదె
యొరులు సంసారంబు లుడిగించునాతఁ
డరయ మాకాపురంబది యేలసేయు
వేటరి పాదరుల్వోనినమ్మితేఁడు
గాటంపు త్రోపులఁ గందుచందమున
బయలు వందిరివెట్టు పంకజోదరుని
నయమున నట్లు మన్ననెమ్మి నమ్మి
మారునమ్ములు మీఱి మారమ్ములగుచుఁ

తూరంగ నాటంగఁ గుందితిమనుచు
మూమాఱుగా మ్రొక్కి మామారు వేఁడి
మేమోర్వలేము మమ్మొడయంగఁ దగునె
యని భృంగయొనరంగ హరియంతరంగ
మునకు నింపగు చందమునఁ జెప్పుమనిన

విని యుద్ధవుఁడు గోప వికచాబ్జముఖులఁ
గని మెచ్చి పలికెనో కమలాక్షులార
పుట్టుగానవముల బ్రుంగుఁడై పొరలు
పొట్టయ్యు జపతపంబుల గానలేని
యట్టి శ్రీకృష్ణుని ననిశంబుదలఁచి
నట్టి మీపుణ్యమేమనియెద మనుచుఁ
బద్మాక్షు సఖుఁడు హృత్పద్మముల్బెలఁగఁ
బద్మాక్షు మారుగాఁ బలికె వెండియును
గదుఁ జేర్వనున్నట్టి కాంతుఁడొక్కింత
యెడసినప్పుడు కూర్మి హెచ్చుగావునను

నెడపక ననుమీఱలెప్పుడు భక్తి
నడఁగకతల పోయుచుండంగవలసి
తొలఁగితినింతె తోడ్తోడ నామీఁద
తలఁ పింపబాయక తనుజేరఁ గలరు
అన వినియోయన్న హరి యెన్నఁడిటకుఁ
జనుదెంచుఁ గుశలమే జలజోదరునకుఁ
గనుగవల్ పండువుగావింప నతని
గనుగొను భాగ్యంబు గలుగునే మాకుఁ
జెలిమిమై శౌరి వచ్చెదనన్ననచటి
యెలనాగలతని రానిత్తురే యిటకుఁ

దడవునేమమ్ముఁ గూర్మిఁదలఁచునే పేర్లు
నుడువునే పొందులెన్నునె నిన్ను గూడి

నలినాక్షునిఁకనొకనాడు కౌఁగిళ్ల
నలమి భోగించు భాగ్యము గల్గునొక్కొ
మాధవునిఁక నొక్కొ మావిచే యధర
మాధుర్యములు గ్రోలమాకబ్బు నొక్కొ
కమలాక్షునిఁకనొక్కొ కాలంబునందు
దమిఁ గూడియుండు చందము నొందునొక్కొ
యని శౌరి సౌందర్య మందంద తలఁచి
తనువులు తాపము ల్తనువులై సడల

దేవకీసుతుమిత్రు దేవకీపుత్రు
శేవడెందములఁ జాటించి పూజించి
వసుదేవసుతుఁడిచ్చు వసుదేవ యోగ్య
వసన భూషలవారి వారికినొసఁగె
సదనంబులకు మంచి సరమిమ్మై మదన
మదన సంగతచిత్త మదవతీమణుల
వివిధ భక్తికి నాకు వెలఁదుల ప్రేమ
.....................
మదినెన్నఁగా నవాఙ్మనస గోచరము
.....................

అని విరిపదరేణువంటి విపునము
మననులతోఁ......బ్రదుకుచును
అని గోపికాతతి నాత్మ భావించి
చన నిత్యబుద్ధియై సరవివేర్వోఱ
క్షితి నమస్తే నమస్తే యని మొక్కి
ప్రతిలేని యానందపాథోధిఁ దేలి
దినదినంబును గృష్ణుఁ దెలుపుచుఁ గొన్ని
దినములచ్చోట వర్తించి యామీఁద
నందుపీడ్కొని నఁదనందన సఖుఁడు

నందనందనుగాంచి నందాదులొసఁగు
కానుకల్వారి తదగ్రజ శౌరజోగ్ర
సేనులకిచ్చి మచ్చిక మ్రొక్కెనంతఁ
గలపమిచ్చిన యట్టికాంత మన్నించి
తలఁచి మాధవుఁడు తత్పరవృద్ధవుండు
కొలువంగఁ బనుపట్టు కుచ్చులతోడఁ
దళుకొత్తు గిరుకుటద్దంబులు మెట్టి
సవరని దంతవస్త్రంబులుకవర
కవరఁగా వీడెంబు గావించి మించి
ఘననాట్యతర నీలకంఠ కలాప
మనమూపుపై తురుమల్లాడ ముడిచి
యలపోనలంచిన నంటుగందంబు
కలికిచొప్పులు బొమకవచంపనొప్ప
భుగభుగమను గందపొడి మేననలఁది
ధగధగయను పచ్చతాళి గీల్కొలిపి
జాతి సంపఁగి పూవుచాయ జవ్వాది
నూతన ప్రేమ వీనులనిండ మెత్తి
తెలిమించు సన్నంపు తిరుమణిమీఁదఁ
దులనించు జాతికస్తురి బొట్టు వెట్టి
యనువైన కస్తూరి యంటులచెంతఁ
గొనబుకప్రంపు పోగుల పొందుపఱిచి
తిలకించునిండు చంద్రికదట్టిఁ గట్టి
వలిపంపు గెంటెముల్వలె వాటువైచి
వన్నెలు సవరించు వారెల్లఁదనదు
వన్నెలుగనినేఱ వలఁయుఁబొమ్మనఁగ
నరిది మించులమించు లలరించునడల
విరులబొందియు కోల విసరియాడుచును

నడపంబు పిడియంబు నందులాగించి
యడపకత్తియ వింతసంతనే తేర
కర పికములు చండకర కరస్ఫురణఁ
బరఁగి రాత్రిని బట్టపగలు గావింప
మలయజ కర్పూర మహిత నీహార
జలజ పంకజ లిప్త విశాల దీపికల
లాలీత రత్నజాలకకుట్టిమాంత
రాలిని బారావతార వంబులును
మణుల దీపముల సాఁబ్రాణి ధూపములఁ
బ్రణుతు ముక్తాఫల రంగవల్లికలఁ
జిత్యకుడ్యముల విచిత్ర సూత్రములఁ
జిత్రమైయొప్పు నచ్చెలువ యింటికిని
నేతేరఁ దనరాక నెదురగన్గొనియు
నాతలోదరి హరియరుదెంచు టెఱిఁగి
గద్దియడిగి చెల్మికత్తెలుఁదాను
నిద్దంపుతావుల నెఱయు పన్నీట
హరి పదాబ్జములు నీరార్చి యర్చించి
సరసనుద్ధవుని బూజలు సేసియంత
గల కలహంసికా కలకల ధ్వనుల
కొలకొన గోళ్లను కొలకెలంబులును
జల్లుల ముత్తెంపు జల్లుల పుష్ప
జల్లరీతతులఁ గాంచన వితానముల
నలవడు చంద్రశాలాంతర స్థలికి
జలజాక్షుఁదోఁ కొని జలజాస్య యరిగి
కలపంబుచిప్ప బాగాలు కుందనపు
టెలతట్టపడి నీరునించు బిచ్చెలును
ఉదయ భాస్కరముపై నుండల సంకు

మదమును సురటికమ్మదనంపు విరులు
చుట్టును విలసిల్లు సొగసుకన్పట్టు
పట్ట నిర్మించిన పరపునింపార
జలువలుదేరు పచ్చడ మప్పళించి
తలకడ మృదువైన తలగడనునిచి
పుటపుటగా జాజి పూవులు దాల్చి
బటువులు గలమించు బటువులింపొందఁ
దళుకులు సవరింపఁ దనరి మంజిష్ఠ
తెరచాయగల దోమతెర సెజ్జమీఁద
హరినుంచి సకలభూషాన్వితయగుచు
మరునియాఱవతూఁపు మహిఁగల్గెననఁగఁ
గొసరు చూపులమును కూటంబుగాన
ముసిముసి నగవు కెమ్మోవిపై నెఱయ
నునుసిగ్గునెఱపు కన్నుల కల్కి కేలు
తనకేలఁ గీలించి తనకేల వెఱపు
అని శౌరి సెజ్జపై కాలేమఁ దిగిచి
కొని వీడియంబుగై కొని బుజ్జగించి
చూపులఁ గొనగోరి సోఁకుల రతుల
నైపుణిఁ గళలంటు నలనచెంతలను
బరిరంభణములఁ జుంబన విలాసముల
మరుకేళి నిట్లువేఱుఁ దేల్చి తేల్చి
వనిత గాంక్షించిన వరమిచ్చి మెచ్చి
ననవిల్తు జనకుండు నగరికేతెంచి
యన్నతోఁ గమలాక్షుఁ డక్రూరుఁడున్న
యన్నగరికినేగి యతఁడు గావించు
పూజ గైకొని నెమ్మి పొలయంగ ధవళ
రాజీవ రాజీవ రాజవీక్షణము

లతనిపై నించి యక్రూరుని బాండు
సుతుల త్రిలోకవిశ్రుతుల సేమంబు
నరసి రమ్మని పంచి యతనిచేవారి
పరిణామమెఱింగి యప్పంకజోదరుఁడు
తనరుచు సకలయాదవులు భూధవులుఁ
దనుగొల్వ మధురనెంతయువేడ్క నుండె
అంతఁ గంసుని కాంత లంతరంగమున
సంతత శోక మనంతమై పొరలఁ
దముఁగన్న రాజసత్తము జరాసంధుఁ
గ్రమునఁ జేరి గద్గదకంఠలగుచుఁ

దమచేటు పాటు నెంతయుఁ జెప్పఁ గ్రూర
తమ దృష్టి నజ్జరాతనయుండు గినిసి
యక్షీణ బలకరి హరిరాజరాజ
దక్షోహిణులు పదినైదు నెన్మిదియు
కూడి కొల్వఁగ వచ్చి కుటిలుఁడై మధుర
వేడింప విని క్రొవ్వి వేడింపకున్నఁ
గాదని బలుఁడు సంగత రమాబలుఁడు
నాదటఁ దలఁపఁ జయ్యన మింటనుండి
శర శరాసన చక్ర శస్త్ర సీరాది
భరితమై వచ్చి చొప్పడు దేరుజోడు

నెక్కి మాగధుబలంబెల్లఁ బెల్లవియఁ
జెక్కు చేసిన జరాసంధుఁ డావేది
లోనైనవాని బలుండు మర్దింపఁ
బూన దానవమర్దిహో విడిపింప
భజనదక్షగజరపట్టి సైనికుల
వ్రజము బాయుచు గిరివ్రజమునకేఁగె
బలకృష్ణులరి బలభల జిష్ణులగుచుఁ

జలఁగి యప్పురిఁ బ్రవేశించి యున్నంత
బాణాది పటుశత్రు భయదంబులైన
వెండియు మధురపై వెడలి కాళింది
దండనమ్మగధుఁ డుద్దండత విడియు
నిచ్చలుదనపోటు నెఱివాసిలోని
యచ్చాళియెఱిగిన యచ్చాళితోన
నాలోన వధియించి హరివాని సేన
కోలకారుండఁ గగ్గోలు గాఁబడిన
నారూఢ గతులన య్యాకృష్ణయనుచు
పేరులువారి గంభీర విక్రమములు
పటహ భేరీ తూర్య పణవశంఖాట
పటలంబు మొఱయ దిక్పటలంబు బెరయ
ఖోవని నాల్గు దిక్కులు జుట్టి పెటులు
కొవ్వులు జబురు జంగులు పిరంగులును
బుసకోవులునుగ సాబులుతు పాశలును
వసుధ లీలగనొక్కవడిఁ గాల్చి రిపుల
దళముల కలికి కత్తెరములఁ ద్రెంచి
తలలుత్తరించి డెందమ్ముల వ్రచ్చి
కరములఁ దెగటార్చి గళములఁ దునిమి
చరణముల్నమయించి జానువుల్దఱిగి
హరులఁ జెండాడి రథాళి నుగ్గాడి
కరుల భంజించి యుక్కళములఁ ద్రోచి
డంబుల చెదర గుడారము ల్చించి
పంబులు: దెగఁగోసి పడగలఁ గాల్చి
ధనువులు విరిచి శస్త్రంబుల నలచి
కనలి చూఱలు వట్టి కలగుండు పఱుప
నపుడు వకావకలై పాళెమెల్లఁ

గపురుమాయుచు హల్ల కల్లోలమైనఁ
గూటి సొక్కున మేలు కొనలేకమూఁక
గాటంపు నడల భూగతులైనవారు
బలువాచతమహితోఁ బోరులమనుచుఁ
బొలు పేది జన్నిదంబుల చూపువారు
కళవళించుచుఁ ద్రోవగానక యమున
జలములఁ బడిమింట జరిగెడువారు
చెలువలతో నిద్రచెందుచు బెగడి
తలమొల వీడ మర్దెసఁ బాఱువారు
పొగరేది రణభీతిఁ బొందెడువారు
నగుచుఁ జిందరవందరై లజ్జ దక్కి
నుగ్గు నూఁచంబులై నుఱుములై జడిసి
కగ్గులౌ మగ్గులై కకపికలగుచు
నీ విధంబున మాగధేంద్ర సైన్యంబు
లావెల్లఁ బొలిసి చెల్లాచెదరైన
బెగడొంది మగధుండు పెడకంత వెడలి
జడిదప్పి మిగుల నొచ్చి సంగంబు జచ్చి
నమ్మిన సకల బాంధవుల రాజులను
సొమ్ములన్ని యునుగృష్ణునిపాలు చేసి
పోయె గిరివ్రజంబునకు గంసారి
నాయెడ మధురకు నరుదెంచెనంత
మగతనంబెన్నక మగధుండు మగుడ
జగతీశ్వరులఁ దొంటి సరవిమైఁ గూడి
పసుబుద్ధి వచ్చి శ్రీపతిచేత సప్త
దశవారములు నిట్లు దశఁబొంది యలిఁగి
బలసి క్రమ్మర భుజాబలముతోనంత

బలముతో దనుజారిపై దండు వెడలి
సురమాని చాతగా సురవైరిడాఁక
నరసి యుగ్రతఁ గాలయవనుఁడవ్వేళఁ
గలితులక్రాయ కాలోగ్ర తదండ
తులితాంగ జగదరాతులఁగి రాతులను
మూఁడు కోట్లను గూడి మూఁడు నేత్రముల
వాఁడునుబోలెఁ దీవ్రతవచ్చి మధుర
వలగొన్న నన్నతో వనజాక్షుఁడనియె
జెలి మీఱి మనమింక వీనితోఁ బోర

నెల్లి జరాసంధుఁడేతెంచి నగర
మెల్లఁ గొల్లఁగఁ బటునెడము లేకుండ
నరులకభేద్య మంతంతనభేద్య
శరధి మధ్యమునఁ గుశస్థలినాఁగ
నున్నది దిక్కులేకున్న దీపురము
మున్నయీ పురజనంబుల నందునునిచి
వచ్చి యిచ్చటనున్న వైరుల నిచ్చ
వచ్చిన గతిఁ జెండి వైచెదమనుచు
మధురవెల్వడి పశ్చిమంపు మున్నీరు
మధువైరి చేరి తన్మధ్య దేశమున.

ఘటదీప మునుబోలి కడలిలో మెఱిఁగి
పటుకాంతి నలరు నప్పట్టణం బరసి
జలధి పండ్రెండు యోజనముల మేర
తొలఁగించి మిగుల సంతోషించి యపుడు
అలఘు విస్మయకర్ముఁడగు విశ్వకర్మ
దలఁపనేతెంచి పాదంబుల కెరఁగి
పని యేమి యననటఁ బట్టణంబొకటి
యొనరింపు మింపు సొంపొదవ నెందనుఁడుఁ

దననేర్పు మెఱసి సంతత చిత్ర మహిమ
పసుపడ వనధియె పరిఘమ్మై తనర
జలజాప్తు శతకోటి శతకోటిఁ దెగడు
ధళధళ రుచుల కుందనపు కోటలును
నాపూర్ణ వర్ణ రత్నాకరంబు లగుచు
గోపురంబుల డాయు గోపురంబులును
హైమ విద్రుమ దీప్తులడర ద్వారకల
సీమకు ముట్టళ్లు సేయు నట్టిళ్లు
లలితేంద్రనీల జాలముల జాలములు
గలకాంత యామినీ కాంత సౌధముల
నవిరళ వజ్రమయంబులై భవన
భువనేశ్వరములైన భువనేశ్వరములు
సాంద్ర చందన పారిజాత నీహార
చంద్ర చంద్రోజ్జ్వల చంద్రశాలలును
మరకత మణి కుట్టిమముల హేమముల
దొనసిన విప్రవేదవిదుల వేదులును
రజతశాలల మహారజతాంగణముల
నిజ విహారోపల నిచయ పద్మములఁ
గలిత షట్పదపుంజ కలితంబులగుచుఁ
గమలాకరములైన కమలాకరముల
జారు భావముల వాసవ యక్షపతుల
యారామముల నవ్వు నారామతతుల
హిమశైల నిభముల నిభముల వేగ
రమణతా మిళిత ఖర్వముల నర్వముల
వర్ణితాలంకార వాస సంకీర్ణ
పూర్ణార్క విధు పథంబుల రథంబులను
దేవాగ్ర భూతేశ దేవేంద్ర ముఖ్య

దేవసన్నుత దేవ దేవాలయముల
లోలుండై యాలి నాలుగనోళ్లఁ బొగడు
వేలవీఁడకె వేల్పు పెద్దలు యనుచు
బ్రహ్మఁ గైకొనక యపారంబులైన
బ్రహ్మవిద్యలు గల్గు బ్రాహ్మణోత్తములు
వరుస వాసవునిమై వ్రణములై తలఁచు
స్ఫురిత ప్రతాపాంక భుజులు భూభుజులు
ఘనదుని ధనమెల్లఁ దమవట్టి పైఁడి
కెనరాదటని హసియించు నూరుజులు
నింటఁదలేరు నొక్కెద్దు గల్గియును
బంటగానక నేలఁ బట్టి కీలించె
ఫాలాక్షు బ్రతుకును బ్రతుకేయటంచుఁ
జాలనవ్వెడి హరిచరణసంభవులు
చిదిమి పెట్టిన లావుచే వసింగంపుఁ
గొదమల గతినజ్జు కుప్పలఁ బోలి
పటు భుజాస్ఫాలన భంజిత వైరి
భట పటలోగ్రగతార్భటులైన భటులు
సాన దీర్చినమారు శరముల పోల్కి
మీనులఁ గదిసిన వెడఁద కన్నులును
ముసి ముసినగవు లిమ్ములఘువాళింప
మిసమిస మిన్నుల మెఱుఁగు చూపులును
పసిఁడి సంకులురాలు బాహుమూలములఁ
గినలయంబుల పసగెల్చు హస్తముల
ధళధళఁ బొల్లు నిద్దములఁ యద్దముల
పొలుపు నటించు కపోల పాళికల
కటికెక్కు మెఱుఁగులు గ్రమ్మినల్లడల
మిఱుమిట్లు గొల్పు ధమ్మిల్లభారముల

మీఱియుప్పొంగు క్రొమ్మిసిమి కన్నులును
జీఱుకల్వారు గొజ్జెఁగిచన్ను గవలు
బాలాబ్జములై పై పై తేట నిగ్గు
డాలు వాటించు మిటారి నవ్వులును
క్రొవ్వు చన్గవల వేగున నివ్వటిలుచు
జవ్వాడు నొయ్యారి చన్నుకొనలును
పొడవులై బటువులై పులినంబుమీఁది
వెడగులఁ బచరించు పెనుబిఱుందులును

మెఱుఁగు పుట్టంబులమీఁద గ్రేళ్లుఱుకు
నొఱపైన మించుల నొదవు నూరువులును
పసిఁడికాళ్లెల మాఱువడి యొంటకరుల
యొసపరిబాగులై యున్నలేఁ దొడలు
నచ్చుఁ దామరల మేలంతయునూర్చి
పుచ్చుకొన్నట్టి యొప్పుల పదంబులును
జెలువొంద మాఱుఁదేర్చిన తూఁపులనఁగ
విలసిల్లు ధవళారవింద లోచనల
చనుగవల్వీమల మంజరుల మార్పడిన
జినుగు పయ్యెదలై యాచింతలఁ దీర్పఁ

దమ్ములు నేత్రముల్దారు మాఱైనఁ
గమ్మకాటుకలెయాకలఁక తేర్పఱుప
నిల సంపఁగులు నాసలెఱుఁగ రాకున్నఁ
జలువ యూరుపులెయా సందేహముడుప
దంతముల్పొంతలుఁ దడమెడ మెఱుంగు
వింతకావియుయద్ది వెఱగు జనింపఁ
దలిరులు హస్తముల్దబ్బిబ్బులైన
నలపొమ్మలా సంశయంబులఁ దీర్పఁ
బొన్నలు నాభులుఁ బోల్ప రాకున్న

సన్నంపుటారులా శంకలుమాన్ప
నొప్పూచ నటనల నొఱపు చిత్తరవు
గుప్పూచు ముద్దుగులుకు నొయ్యారి
చివురు విల్తుని కేలిసెల గోలలనఁగ
భువనమోహినులైన పుష్పలావికలఁ
దావుల దశదిశల్దడ కట్టిమెట్లు
బావులు నావేల్పు బయ్యగేలించు
నావుల మిగుల మోహనములైనట్టి
శీవులఁబురము వాటిలఁగ నిర్మించి
తదనంతరమునఁ దత్తరమునఁ గముల
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
తమ్ములో యని పట్టి దంబులు బ్రమయఁ
దమ్మి చెక్కడపు రత్నంపు బోదియల
నలిన నాళంబులు నములు హంసికలు
మలయు క్రొంబటి కంపు మదిరచేతులును
గళుకుల పికమాలి కలవింతవగల
గలుగు వైడూర్యంపు కట్టు దూలముల
కాంతిచే వెన్నలఁ గబళించు డెసల
దంతుల జీవ దంతపుబోదియలును
నలఘు రత్నాకృతులై సూత్రగతులఁ
బలుకు పారవముల పసిఁడి చూర్కులును
మేలైన ముత్యంపు మించు పట్టియలు
డాలైననును బవడంపు కఱ్యములఁ
జిత్రంబులగు హరిచేత లన్నియును
జిత్రింపనలరు విచిత్ర దేశములఁ
గలికి ముక్కుల కీరకలు చిక్కడివియఁ
జిలుకలు దిద్దిన చీర్ణంపు బనులఁ

దిలకించు రతి పల్లె తీరుల సిరులఁ
దళుకొత్తు పచ్చల ద్వారబంధములఁ
గమకపుటపరంజి గంధవట్టియల
సమకొన్న విపుల వజ్రపు కవాటములఁ
గలితంపు గోమేధికములఁ గెంపులను
ధళధళన్మణి నిబద్ధ ప్రదేశముల
మును సుధారసవర్గముల మాఁగిపదను
మునుపు ముత్తెపు సున్నములఁ ద్రిలోకముల
నీడు జోడును లేని యింద్రనీలముల
నోడ బిల్లలనేత నొప్పు మాళిగల
నవరత్న తతుల విన్నాణంబులైన
నవరంగములను వింతల బవంతులను
పై ద్యోటజలమాడు పడఁతులు వచ్చి
బయ్యెకలంచు దిద్భ్రమ ముట్టియరుగ
నిలనీరు మేడలు నిక్కి మిన్నేటి
జలములఁ దోలఁగించు జలసూత్రములను
నగరంబు వైకుంఠ నగరంబు భాతి
మిగుల నొప్పఁగ నేర్పు మెఱసి నిర్మించి
యావేల్పు గ్రమ్మరి యరుఁదెంచి మ్రొక్క
నా వేల్పు వేల్పు సప్తాంగంబు లిచ్చి
యవురవురమేలు లెస్సాయె నటంచు
వివరంబు ననుగార వించి వీడ్కొలిపి
వారక యిహ పరద్వారక యగుట
ద్వారక యను పేరు తగుదీనికనుచు
నాపూర్ణమణి భర్మ్మయగు సుధర్మయను
నాపారిజాతంబు హరి సమర్పింపఁ
జెవులందు నల్లనై చెలువొందు పెక్కు

ధవళాంగముల జవోత్తమ తురంగముల
సింద్రుఁ డొప్పింప నాయడ వచ్చి కిన్న
రేంద్రుఁ డెన్మిది నిధులెలమి నర్పింపఁ
బొలుచు కానుకలు వేల్పులు తమకలిమి
కొలఁదిమై నొసఁగఁ గైకొని రమావిభుఁడు
బాగునానెకచిప్ప బంతులొక్కటికి
లాగించు యాంత్రికులాఁగు దీపింపఁ

దన యోగమాయనత్తటి బుత్రమిత్ర
ధన వాహనాది సంతతులతోఁ గూడి
వలనొప్పఁ గాద్వారవతికి నమ్మధురఁ
గలవారినెల్ల నాకర్షించియుంచి
చయ్యన మధురకుఁ జని తత్పురంబు
ముయ్యంచులును జుట్టి ముట్టియున్నట్టి
యాకాలయవను గాలాకారవర్ణు
నేకాకిఁగా నెలయించి దాఁగొనుచు
మునుకొని నిద్రించు ముచికుందు గుహాకుఁ
జనిత దీక్షణ వహ్నిజముఁ గూర్చి పేర్చి

యారాజు మెచ్చి చయ్యనవరంబిచ్చి
శౌరి గొబ్బున వచ్చి జడియక మధురఁ
గట్టల్కనల్లడఁ గలయఁబోరుచును
జుట్టున తురక పౌఁజుల మట్టి పెట్టి
వెండియునచ్చోటి వెండియుఁ బసిఁడి
భండారములు గజవ్రతతు లశ్వములు
ఘన వస్తువులు ద్వారకాపురంబునకు
ననిచి పీతాంబరుఁ డసితాంబరుండు
దానుగామంతంబు దక్కిన గిరులు
గానఁ బోమెడువాని గతిఁ దీవ్రగతిని

నరుగుచోఁ గాళింది యవల శోభిల్లు
పర వీరకుల భీము భార్గవరాముఁ
గని తదనుజ్ఞచేఁ గరవీరపురము
పని బూనియపుడ హంబ్రహ్మ యటంచుఁ
జాల గర్వించి నిచ్చలుఁ గయ్యమునకుఁ
గాలు ద్రవ్వెడియా సృగాలు ఖండించి
కరవీరపురము భీకర వీరవరుల
హరియించి సంపదల్హరియించెనంత
గరుడుండు గొని వచ్చు ఘన కిరీటంబు
ధరియించి జయలక్ష్మి దరియించి చేర్వ

ననఘు ప్రావర్షణంబను ధరాధరము
గని వసించిన నదిగని మాగధుండు
చనుదెంచి కానకా శైలంబు కనల
ననలంబు దరికొల్ప హరి కృష్ణులపుడు
వెల్లి మీఱిన గృపావృష్టిఁ దదగ్నిఁ
జల్లార్చి మగధుండు జడియఁ బెల్లార్చి
కనలి జరాసంధు కడిమి బోకార్చి
........................
సురలు డెందమ్మునఁ జొక్కఁన మాని
వరులు మెచ్చఁగ ద్వారవతికేగుదెంచి

హితమంత్రి బల పురోహిత సేవ్యులగుచు
నతుల వైభవయుక్తులై యుండిరంత

నని యోగిజనపాలుఁ డాజనపాలుఁ
డనుమోదమంద నిట్లని యానతిచ్చె
అని సుధావాణికి నబ్జపాణికిని
వనజాస్త్రు మాతకు వనధిజాతకును

ననుగన్నతల్లి కనత్రమభల్లికిని
కనకగాత్రికిని బ్రకామదాత్రికిని
వాణీశనుతకు సువ్రతకక్షీ విచల
దేశికి శ్రీవేంకటేశు రాణికిని

సారసగేహకుఁ జారుబాహకును
సారలావణ్యకు సకల గణ్యకును
బరమకల్యాణికి భ్రమరవేణికిని
దరుణేందుఫాల కుదారశీలకును
రామాభిరామ కప్రతిమ ధామకును
హైమసంవ్యానకు హంసయానకును
నింద్రభావితకు గజేంద్రసేవితకుఁ
జంద్రికాహాసకుఁ జారునాసకును
నగసుతానతకు బన్నగ తల్పయుతకు
మృగమదాంగకు నలమేలుమంగకును

నంకితంబుగ శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్లపాకాన్నయార్య
తనయ తిమ్మార్యనందన రత్నశుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశ దత్త
మకర కుండల యుగ్మ మండితకర్ణ
సుకవిజీవంజీవ సోమరాజీవ
సదనావధూ లబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
విరచితంబగు ప్రతిద్విపద సంశ్రవణ
తరళిత విబుధ మస్త ప్రణీతోరు

మనసిజ జనకాష్ట మహిషీ వివాహ
మను కావ్యమునఁ దృతీయాశ్వాసమయ్యె.



శ్రీరస్తు.

# అష్టమహిషీ కళ్యాణము.

## చతుర్థాశ్వాసము

(శ్రీదేవీ మహిమవర్ణన.)

[ ద్విపద ]

భూమిసపత్ని యంబురుహాక్షు పత్ని
కాముని తల్లి చక్కని కల్పవల్లి
కలకంఠ వాణి సైకతనిభశ్రోణి
యలఘు గుణోత్తుంగ యలమేలుమంగి
యవధరింపుము దేవి యమ్మహామాని
కువలయేశుఁడు వల్కెఁ గువలయేశ్వరుని
వసుదేవ దేవకల్ వసుదేవముఖ్యు
లసమానగతిఁ బొల్చు నాత్మజాతులకు
రామ కృష్ణుల కభిరామ మూర్తులకుఁ
బ్రేమఁ బెండ్లిండ్లొనరింపఁ దలంప

(శ్రీబలరామ రేవతీ పరిణయ వర్ణనము.)

వసుమతి నిక్ష్వాకు వంశసంభవుఁడు
వసుధేశ్వరుండు రైవత నామకుండు
నెలను వెన్నెలను వన్నెలను గేలించు
లలితాక్షి గళరోమలత లబ్ధపూగ

ముల పూగముల పూగముల నవ్వుచుండఁ
కలిత వళుల్నాభి కౌనుతరంగ
ముల తుంగముల సింగములనణకింప
మిక్కిలి చెలువొందు మీనాయతాక్షి

చక్కని గుమ్మ వాసనపూవురెమ్మ
సతత శోభనవతిఁ జతుర శృంగార
వతియన నొప్పు రేవతియను కన్య
బ్రహ్మపన్పునఁ బరబ్రహ్మాగ్రజునకు
బ్రహ్మగ్నులలర శోభనవేళనొసఁగె
నీలాంబరుండు నానీలాభ్రవేణి
కై లీలఁబట్టె నాగమ ధర్మసరణి
వరవైభవముల వివాహమై దేవ
వరముఖ్యులెన్న నద్వారకయందు
రేవతీందులఁ బోలె రేవతి సతియు

రేవతీవిభుఁడుఁ గూరిమిఁ బెచ్చుపెరుగు
నిలయెల్ల జయలిడ నిష్టభోగముల
సలుపుచుండిరి మహోత్సాహంబులెసఁగ
అంత విదర్భదేశావని విభుఁడు
సంతత జయశాలి సద్ధర్మశీలి
జలధిగంభీరుండు శత్రుసంహారుఁ
డలఘు గుణోద్ధారుఁడగు భీష్మకుండు
రుక్మమయూద్రిధీరులను ముప్వురను
రుక్మి యాదిగఁ గుమారులఁ గాంచెనంత
సరవిందవాసిని హారితాఘుఁడైన

## చతుర్థాశ్వాసము

# 1. ప్రథమపట్టమహిషి

### శ్రీరుక్మిణీదేవి వివాహ వర్ణన ప్రసంగము.

---

ధరణిజ యను పేర ధరణి జన్మించి
యారాముఁడీ రామునను జన్మెఁడైన
నారామ రుక్మిణి యను పేరఁ బరఁగి
జనకసమాన భీష్మక మహీపతికిఁ
దనుభవాభావంబు దాల్చిననాఁట
నిండు గాలాముల నిజపోషణముల
రెండవ తరుణేందు రేఖయో యనఁగ
నొకనాఁటఁ బెరు గుట యొకపూఁటఁ బెరిఁగి
. . . . . . . . . . . . . . . . . . . . . . . . . .
బాలయై యలకాప్తఁఫాలయై బద్ధ
చేలయై శుభగుణ శీలయై పొదలి
బాలయయ్యనుగుణ ప్రబలతఁబ్రోడ
బోలి యౌవనకళాస్ఫూర్తిఁ బెంపారి
యాకంజబాణు మోహాన పుష్పశాఖ
లాకయో హేమశలాకయో యనఁగఁ
బసిడి జక్కవ కవబటువు పాలిండ్ల
మిసమిసఁ బయ్యెద మీఁదఁగ్రేళ్లుఱుకఁ
గొసరి సిగ్గులఁబెన గొని బిత్తరించు
నొసపరిచూపుతో నొయ్యార మొలుకఁ
బరమ లావణ్యాబ్ధిఁ బ్రభవించు సుడియుఁ
దరఁగలు నానాభిఁ దరలుఁ జూపట్ట
భ్రాజిత మధ్యా ఘాభాగ శృంగార

బీజాంకురాళి దీప్తిచినారుమునుప
రుక్మ భూషణవతి రుక్మ వర్ణాంగి
రుక్మి సహోదరి రుక్మిణీదేవి
యారూఢ యవ్వనయై సంచరించు
సారసాస్త్రుని మంత్రశక్తియో యనఁగఁ
బ్రతిలేని యారమాపతి పతికాఁగఁ
గుతుకంబుతో నాత్మఁ గోరినిచ్చలును
గురుభక్తితో మరుగురుఁ గూర్చి యాత్మ
గురుతర వ్రతము గైకొని సేయుచుండె
ద్వారకాపురినుండి వచ్చినవారి
వారిజోదరునెన్ను వారినల్లడల
నారసివారితో హరిచందమెఱిఁగి
వారిజాననలైన వారిరప్పించి
యొకనేర్పుమైఁ బ్రసంగోచితంబుగను
సకల యాదవులనచ్చటి మహీధవుల
బలభద్ర కృష్ణుల బలభద్రరూప
ములు విని పుష్పకార్ముకు తండ్రిఁ దలఁచి
యతని సద్గుణకీర్తులనెడి చంద్రికల
శ్రుతి చకోరములచే జూరలాడుచును
బరులకుసమీక పంకజోదరుని
నిరుపమ లావణ్యనిధి మూర్తిఁ దలఁచి
యతిదూరముననుండి హరిఁ గూడియుండు
గతినుండె ధ్యానసంగతి నంతమఱియు
మఱియు నానాఁట సమ్మానినీమణికి
నెఱిజవ్వనంపుమున్నీరు పొంగారఁ
దలిదండ్రులికఁ గాంతతలఁ బొందుతలఁపఁ

దలకూడ వజ్రాక్షుఁ దగిలెనా తలఁపు
అతఁడె నేనోయంచునతనినే కోరి
యతనుధాటకు నోడి యతివయుండఁగను
బూరుష పరమనంబునకు మనంబె
తారకాణ నెడు చందమునఁ గృష్ణునకు
వైదర్భి నింతగా వరియించు తలఁపు
మోదంబు ననురాగమునఁ దేలువాఱఁ
గనుకలికన్ననంగనలకుఁ బ్రేమ
విను కలిచే నెచ్చు విధమునఁ జేసె
కమలాస్త్రజనక సంగత చిత్తయగుచుఁ
గమలాస్త్ర కమలాస్త్ర కంపితయగుచుఁ
గొనకొన్న కోర్కె సిగ్గునఁ గప్పిమేను
ఘనతాపమేమిటఁ గప్పంగలేక
చిలుకలలోనిరాఁ జిలుక చందమునఁ
జెలులతోఁగూడిలోఁ జిగిరించుకూర్మి
మానంబు పెనఁగ భీష్మకపుత్రి శౌరి
ధ్యానంబుతోడ నుద్యానంబు చేరి
యందునే కాంతంబు నందులోలోన
దండడి గొనువెండిఁ దలఁక నవ్వేళ
నన్ను మీఱుట యెట్లు నాదువింటికిని
గన్నులు గలవని గర్వించిమరుఁడు
తీవువింటను బూవు చేనెక్కొనలరు
తూపు సంధించి కందువచూపు నిలిపి
చెవిసోఁకఁ దిగిచి యేసినఁబోను వెలిగ
నవలీల బాల బాహామధ్యసీమ
వడిఁదాఁకి యీవలావల దూరిపాఱఁ
బడఁతుక పరవశ భావంబుచెందఁ

దలపోత సఖులు వైదర్భి తాపంబు
తలపోఁత సేయుచుఁ దమలోనఁ దాము
ధవళాయతాక్షి కి త్తఱిఁ బల్కు కీర
రవము కైరవము భైరవములై తోఁచెఁ
గ్రొవ్వలకావరె కోమలిమనము
నవ్వ నట్లనెయుఁడు నాలివెన్నెలలు
తుంటవిల్లేఁడుండి దొరకెనో దీని
గుంటఁ గూలఁ గమన కొమ్మనెంచఁగను
నడరెడు నతినేఁప నందుమై మఱియు
పొడివోసుకొన్న యాపూదెట్లు గలిగె
వాడిన మలలక్రేవల చల్లగాలి
నేఁడేల వచ్చె దీనిని బాముతినను
వడినోటఁగోయని వగమీఱివనరు
చెడుగుచిల్కలు వీని జెట్టులఁ గట్ట
గట్టిగాఁ దనునోచి కన్నతల్లికిని
పట్టెమె మరుఁడేల పగదాయి యయ్యె
జాతియంతేయుఁ గీడు జాతియే జాతి
నీతి గల్గినదిపో నీ యింకనైన
నొంటని మరువింట నొనగూడకుండ
నంటువాయఁగఁదివ్వుఁడమ్మ సేమంతి
మరునివేఁగూడి యుమ్మడిఁ గురువేరు
పెరిగనేవ్రేళ్లతోఁ బెకలింతమనుచు
జలజాతనేత్రి భీష్మకపుత్రినపుడు
చలువగొజ్జఁగి సెజ్జ సవరించియునిచి
పొగులుచుఁగదిసి కర్పూరఖండముల
నొగులంగఁ గొఱికి వీనులఁ బారనూఁది
కన్నీరు పయ్యెద కడలనొత్తుచును

బన్నీటిచేత రెప్పలమీఁదఁ దుడిచి
సరసగంధంబుమైఁ జల్లఁగానలేది
విరిదమ్మి సురటిచే విసరియొండొరుల
కప్పరె చెంగావి కమ్మపూఁదేనెఁ
గ్రుమ్మరేయడుగుల గోవ కస్తూరి
దిప్పరే బలిమి యీతెరవ పాటెల్ల
జెప్పరే మరుఁడు రంజిలికావఁ డనుచు
భారంబులగునును పాలిండ్లకాక
హారంబుచేఁ బరిహారంబు చేసి
చిలుక పల్కులు ముద్దు చిక్కుమాతోడఁ
బలుకవే యొకమాఱు బంగార కొండ
నగవువెన్నెలల విన్నాణించు మించు
మొగమెత్తి చూడవే మోహనవాణి
చేడియముద్దురాఁ జిలుకతో మాట
లాడవేమను గూడి యాడవే తల్లి
నెఱతావి దిక్కుల నెఱపు క్రొవ్విరులఁ
దుఱుమవే నీకొప్పు తుఱుమవేకోరు
కొమ్మ విపంచిఁ గైకొనవెయోముద్దు
గుమ్మడాఁపకు నీదు కోర్కెమాతోడ
ముకురంబు చూడవే ముకుర బింబాస్య
పికములఁ బిలువవే పికవాణి నీవు
జడియకు మింకనో సాంకవీగంధి
సుడియఁగ నెఱచునీ శుకముల యెదుట
నుడుగవే తహతహ నోరావాలువేణి
యుడురాజు నీవన్నె నెలయఁగ నెఱచుఁ
బెలుచైన మావినీ పెంపుడుగున్న

వలరాజు నీ పట్టి వామాయతాక్షి
యెలనాగ యింతేల యెదుటఁ జూడంగ

కలువల గమిబంతి కట్టితిప్పుదుమె
యిట్టి యీమరుతూఁపు లెల్లను విఱిచి
కట్టితెత్తుమె నీదు కడకు రాకుండ
గోరఁ బోవుటకల్ల గొడ్డలియేల
యూఱకేయని యెన్ని యుండితిమింతె
పగసాటుగావిని పని యంతనేము
తెగువఁ బుప్పొళ్లనూఁదినఁ బాఱవలెను
నెలంత గిన్నెరకుఁ గిన్నెరకు నోడకుము
యిలమొల్లగిల్ల నీ కెదురుగాఁ గలదె
కెరలు నీ చిలుకలఁ గిలుకల విరుల

గిరుల వీక్షించు వీక్షింపకు మబల
కోకిలముల బెచ్చు గోణఁగిన కేకి
కాకులకిత్తమో కంజాయతాక్షి
యరులైనయట్టి యాయనఁటి మొత్తముల
శిరము నలఁచివై చెదము తన్వంగి
యని యిట్లు చతుర వాక్యప్రౌఢి నెఱపి
జననాథ సుతమెద చల్లఁగాఁ జేసి
యంతరంగముగ దదంతరంగంబు
నెంతయుఁ దెలిసిన యింతులిట్లనిరి
దానవారాతి నీ తలఁపులోవాఁడె.

కాని యన్యుఁడు గాఁడు కలకంఠకంఠి
నమ్ము నీ సేయు దానమ్ము ఫలమ్ము
నమ్మాధవుని నీకు నాత్మేశుఁ జేయు
నని యిట్లు తనయాత్మ ననురాగవల్లి

ననలొత్తఁ జేయు క్రొన్నన బోండ్లతోడ
నంచల నడుమరా యంచయుఁ బోలె
నంచిత నై జగేహామునకే తెంచి
యలఘు భావములఁ బద్మారాగలీలఁ
జెలువొందు రుక్మిణీ శీతాంశువదన
విభుని గానాత్మ శ్రీవిభుని గోరుచును
శుభగుణ యౌవన స్ఫురితయైయుండె
మఱి భీష్మకుఁడు సతీమణికి రుక్మిణికి
నెఱ జవ్వనము మేననెఱయ నీక్షించి
యీ చంద మీయంద మెందునుగాన
మీ చంద్రబింబాస్య నెవ్వరికిత్తు
వనజాస్త్ర కోటి లావణ్యుఁడై నట్టి
వనజోదరునకె యీ వామాక్షి దగును
అని యిట్లు తలపోసి యంతఁ నొక్కనాఁడు
తనయులఁ బిలిచి యెంతయు నూహ సేయఁ
దనుమున్న మగధయుక్తముగ భజించు
దనుజారి యైకచిత్తంబులో నిగుడఁ
నాకాత్ము తమ్ముని కరణి నారుక్మి
వనజాక్షుఁ డనినంతవడేఁ గోపగించి
యవివేక చిత్తుఁడై యాతండ్రికనియె
అవునౌనె యేమంటివయ్య యోయయ్య
యతఁ డెవ్వఁ డెందుండుండు నతనికి మనకు
క్షితినెంత దూరంబు క్షితినాథవాఁడు
నెట్టన నీ కన్య నృపవంశజాత
పుట్టు గొల్లలలోనఁ బుట్టినవాఁడు
కుల మెన్న [illegible] బెట్టి

తలఁ పెట్టు తలఁ చెదు తగునె యీతలఁపు
నీ మదిఁ గలిగెనా నిఖిలంబులోన
భూమీశ చైద్యుఁ డిప్పుడు గలవాఁడు
అతనితోఁడ నె వియ్య మందుదుగాని
యితరుల కొసఁగనే నీను నీయాన
యనవుఁడు తనపట్టియను మాటఁ బట్టి
యనుమానపడి తెగనాడలేఁ డయ్యె
వనమాలిచే మున్ను వధియింపఁ బడిన
కనకాక్ష గాంగేయకసిపు లిద్దఱును
బరమ దుర్జనులు ద్వాపర మధ్యమునను
ధర శిశుపాలుండు దంతవక్త్రుండు
ననఁ జేదివంశజులై రందులోనఁ
జనటు జగద్ద్రోహి శిశుపాలుఁ బిలిచి
చెలియలి పెండ్లి నేఁ జేసెదననుచు
బలము మీఱఁగఁ దనబలగంబు గూర్చి
యొనరనాయిత పడుచున్న యాసన్న
వనితలచేనంత వైదర్భి తెలిసి
హరిమీఁద ననురక్తి యన్నపైఁ గినుక
యురుతర కోపంబు నూర్పులు నిగుడఁ
గుటిలాత్ము రుక్మి నాకును నన్నగాఁగఁ
గటకటనే రీతిఁ గావించెనజుఁడు
శౌరి నొల్లనివారు జగతిఁ గల్గినను
వారినేనొల్ల మావారైననేమి
యీమేని దీనతలెల్లను మాన్ప
నేమందుకలదింక నేమందుననుచు
వదలని తహతహ వంచింప లేక
తుదలేని చింతఁగుందుచు నున్నఁ జెలులు

చెలువ యున్నట్టియా చెలువంబు దెలిసి
పలికిరి యేకాంత భవనమధ్యమున
బొందుల్లు వేఱుంతె పొలఁతుక మనకు
నిందఱకును బ్రాణమేకమేతలఁప
వింతవారమె మేము వెలఁది నీవింత
వింత సేయఁగఁ దగవేదమ్మ యనిన
హితమతిఁ దనకోర్కె యెఱిఁగించి మిగుల
హితుఁడైన కులపురోహిత సుతుఁ బిలిచి
యంతరంగంబున నతనికిట్లనిరి
వింతవాఁడవుకావు విను మొక్కమాట
పరమ నిశ్చయముగా భావించి యేను
హరికిఁ గట్టెఁతిమున్న నాత్మకంకణము
రేఁపె లగ్నము సిరిరేఁడు రంజిలఁగ
నీ పని యెఱిఁగింపు మీప్రొద్దుపోయి
దిక్కెవ్వరును లేరు దేవరే కాని
దిక్కు రుక్మిణికని తెలియంగననుము
తలి దండ్రి నాయన్న దమ్ములు నాదు
తలఁ పెరుంగరు శౌరి తానేగుదెంచి
తనుగన్నవారలఁ దనునిమ్మటన్నఁ
దనకన్న వారలెంతటి వారుకినియఁ
గాదని నన్నుఁ బల్మిగైకొని యచటి
చేదీశుఁ బట్టి నిర్జించి పొమ్మనుచు
వాని దార్చుటకు భవానినోమనుచు
వేయి లాగులనాదు విధమెల్లఁ జెప్పి
తోయజాక్షుని వేగఁ దోడితెమ్మనుచు
నే నిల్లు వెల్వడి యే తెంతుననుచు

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

విన్నవింపుము యదువీరుతో నొరుల
కన్న నీమాట యేమన్నఁ జెప్పకుము
పన్నగశయనుఁ డాపన్న శరణ్యుఁ
డన్న నీమాట సత్యము సేయుమనుచు
వేయు బాగుల నాదువిధమెల్లఁ జెప్పి
తోయజాక్షుని వేగఁ దోడితెమ్మనుచు

ముద్దుల తన కుచంబులనాను హారిని
దిద్దిన హాహామముద్రిక యేకతమున
హరికి నిమ్మని సీత హనుమంతు నకల
సిరము మానికమంపు చెలువున నొసఁగఁ
దల్లినీ పనుపున దానవారాతి
నెల్లి యెల్లుండిలోనే తోడితెత్తు
నీ పని శీఘ్రంబె యీడేర్తు నేని
మా పురోహితుఁడని మఱినమ్మ మమ్మ
యింక నీ సౌందర్యమెన్ని చొక్కించి
పంకజోదరు నీదు బంటుగావింతు

ననుచు రుక్మిణిచేత నాధరాదేవుఁ
డనిపించుకొనికొని యాడుచుఁ గదలి
యురుతరా యతమైన యుపవీతజాల
మురముపైఁ బెనగొని యుఱ్ఱూతలూఁగ
వెడజాఱఁ జుట్టుచేర్చిన శిఖాశాఖ
మెడలపై నొకయింత మిటిమిటి పడఁగ
మిగులు నీర్కావితో మించుపింజయులు
జగజంపు దోవతి చరణంబు లొరయ
నొఱపుగాఁ బెట్టిన యూర్ధ్వ పుండ్రంబు
చిఱు చెమటలతోడఁ జిప్పిలి జాఱఁ

పొడవుగా నిక్కి యుప్పొంగి వర్తించి
యడుగడుగునకు శ్రీహరి హరి యనుచు
సార కస్తూరికా సహిత నీహార
నీర కహ్లార వర్ణిత కాంతిజాల
హార కల్పిత గృహానేకాంశ విజిత
తారక వేష్టతో దార సముద్ర
హారక కమలా కరాంచిత హంస
కీర కదంబ సంకీర్ణ సౌధాగ్ర
చారక గగనాధ్వచారక వ్యూహ
దార కనమ్మహాద్వారకఁ గాంచి

యం పురాంతరమున కరుదెంచియచట
దీపించు నాదేవదేవు మందిరము
పాటించ కాంచి లోపల రత్నరుచిర
కూటంబు హరికొల్వు కూటంబు చేరి
ద్వారపాలకులచేఁ దనరాక తెలుఁగు
శౌరికిఁ దెలిపి తత్సమ్మతమ్మునను
హితులు మంత్రులు పురోహితులు బాంధవులు
యతులును దండనాయకులు మల్లులును
దివిజులు కిన్నరుల్ద్విజేంద్రముఖులు
కవులు గాయకపాఠక వ్రాతములును

గనఁబట్టు పేరోలగంబు గన్గొనుచు
మునుదెచ్చు వైదర్భి ముద్రికఁ గొనుచు
సంతత వాసనాంచద్ధూప ధూపి
తాంతరాళంబు లత్యంతసంకులము
మాంజిష్ట పట్ట చామర హిమకంజ
మంజీర పుంజ నిర్మల వితానంబు
చారుత వలికాగ్ర శోభాప్రిణ రత్న

కీర కపోత కోకిల శోభితంబు
ఘనపుష్ప మాలికా కలితంబులైన
యనుపమ మణిమంటపాంతర సీమ
కమఠ నాగేంద్ర దిగ్గజరూప విలస
దమలమాణిక్య సింహాసనాసీమ
లోలనేత్రీక రాలోల విశాల
తాలవృంతానిల తరళితాలకుని
కంకణ ఝణఝణత్కార సంకీర్ణ
సంకుల పద్మ హస్తాహస్త వళిత
వర శుభ్ర చామరావళి జాతశైత్య
కరపోతవారిత ఘర్మ శీకరుని
గనక చేలాంగద గ్రైవేయ హార
వనమాలికా బాహువలయ శోభితుని
నంపోవ వితత వజ్రాంక చూడావ
తంస నానావిధోత్తంస మండితుని
మలయు కుండలముల మాణిక్యరుచులు
ధళధళుక్కున గండ తలములు నిండ
వెలిదమ్మి రేకులవెడద కన్గొనల
నెలకొన్న చూపు వెన్నెల చల్లువాని
కొమ్మయొక్కతె కేరుగుళిగెకప్రంపు
కమ్మఁబాగాలుకై కరణిగానిచ్చి
వలనారు సపరంజి వన్నియడాలు
తెలనాకు మడిచి చేతికినందియొసఁగ
జిలుగు నవ్వులతోడఁ జెనకంగనొక్క
సెలవినెమ్మేలు నిక్కఁ జేరినవాని
నెడయ నొక్కబిటారి మెలమిఁ గటారి
హడపంబు గీలించి యందందగొబ్బ

కలువ చూపులదండి గలయొూర్పుగిండి
వలిపె చెంగావి పావడ పట్టి నిలువ
పోలికె వైరిరాజులఁ జెక్కియున్న
కాళాంజియొక పద్మగంధి గావింప
వలరాజుకైదువ వలకేవఁ దొలఁకు
కలికిముద్దియ విరుఁ గడల సేవింపఁ

జతుర సీమంతినీ సంగీత సరస
చతుర వాణులలోన సమకొన్నవాని
దారలలో మించు తారేశు పగిది
నారీమణులలోన నలువందువాని
మురవైరి హరి జగన్మోహనాకారు
సిరికూర్మి మగని వీక్షించి యుప్పొంగి
యల్లనల్లన వచ్చి యందంద నిలచి
యల్లలనామణి యంగుళీయకము
హరికుపాయనముగా నర్పించు భూమి
సురవర్యుఁ గని సర్వసురవర్యుఁ డప్పు

డర్ఘ్యపాద్యాదుల నర్చించి లసద
నర్ఘ్యపీఠంబుపై నాసీనుఁ జేసి
యూదేవుఁ డంత నిశాంతంబునకును
భూదేవుఁ దోకొని పోయి లాలించి
చుట్టును మున్నీరు చుట్టినయట్టి
యిట్టి పట్టనమునకే తెంచుటేమి
యూనతిమ్మన్న ధరామరేంద్రుండు
దీన శరణ్యాయో దివిజారి వైరి
హరి నీవెఱుంగని యదియొండుగలదె
ధరలోన మముమాయ ద్రవ్వింప నేల

వినుము కుండినపురవిభుఁడు భీష్మకుఁడు
తన తనూజాత వైదర్భి దేవరకు
నిచ్చెదనన్న నయ్యేలనాగయన్న
కుచ్చితంబునఁ దండ్రిఁ గోపించి పలికి
శిశుపాలునకు నియ్యఁజెల్లుఁ గాదనిన
ఆచెలి మీఁచెల్వ మరయుచునిన్ను
నీచెల్వుఁగాఁ గోరి నీచాత్మ రుక్మి
పలుకులకాత్మలోఁ బలుమారునులికి
యల కీర పికముల కందందయులికి
యిట వచ్చి యీకార్య మెఱిఁగించి మిమ్ము
నట వేగఁదోడి తెమ్మని నన్ను బనిచె
నేఁటి మాటలుగావు నిఖిలేశ నిన్ను
నాఁటఁ గోలెను బిన్న నాటనుండియును
జెలువ రూపగుణంబు శీలంబు సొంపు
వెలయ నేర్చిన పాటి విన్నవించెదను
యీ రాజబింబమ్ము నీఁడెన్ను టెట్లు
శ్రీరామరామ యచ్చెల్వమోమునకు
సరసిజ పత్రముల్సరిపోల్చు టెట్లు
హరి హరి జగతిలో నతివకన్నులకు
భూధరంబులనెన పురుణించు టెట్లు
మాధవ మాధవ మగువ గుబ్బలకు
పంకజనేత్ర యప్పడఁతిలావణ్య
మింకొక్క తెఱఁగున నెఱిఁగింతు వినుము
మాటలా చిలుకల మఱపించు మోవి
తేటలా సోనగాఁ దేనియల్లురియు
వదన మాకమ్మని వాసనల్గ్రమ్ము
రదనంబు లాను వజ్రములఁ గీలించు

వేనలి యావిఱ్ఱ వీఁగుచునుండు
లేనవ్వులా వెన్న లేపి సాళించు
చూపులా పఱపులే చూపుఁ గంఠంబు
ప్రాపుఁగాశంబంబు భావంబుఁ దెగడు
పిరుదా రథాంగంబు బెగడించుచుండుఁ
జిఱుదొడలా సొంపుఁ జిల్కుచునుండు
నడుగులా తమ్మిల నణగింపుచుండు
పడఁతి రూపేమని పచరింతుఁ దండ్రి
నీవె శ్రీహరివి యానీలాహివేణి
భావింప నాదిమా పద్మా వధూటి
యని యాత్మనుండు యథార్థంబుగాఁగ
ననయంబు మాకు నీయాన గోవింద
కామధేనువు పాలు ఘనుఁడైన యట్టి
సోమయాజికిఁ గాక శునకార్హమగునె
నిగమ గోచర రుక్మిణీదేవి నీకె
తగుఁ గాని యెంతైనఁ దగదు చైద్యునకు
నది కాక యొక యుపాయంబును గలదు
పదిలంబుగా విన్నపము సేయుమనియె
జనకుని యింటిలో జలజాక్షి నెట్లు
కొనివత్తుననుచు సంకోచింప వలదు
అల పెండ్లి తొలినాఁడె యన్నపెంపునకు
వలగొనము త్రైదువులతోడఁ గూడి
ధరణీశ్వరులు గొల్వతన యంతిపురము
పురము వెల్వడియేను బొత్తు కత్తియలుఁ
గడువేడ్కతో నోము గలదని గౌరి
గుడికేఁగి మఱలి గ్రక్కననేగుదెంచు
సమయంబు నీకును సమయంబటంచు

సమకట్టిపనిచె నిశ్చయము నన్ననుపు
మింతియె కానినే నింతియెకాని
వింతవారెఱుఁగ రవ్విధమన్ననపుడు
అంబుజాక్షుఁడు దరహాస చంద్రికలు
బింబాధరంబుపై బెఱసి సొంపరయఁ
గరమున నావిప్రు కరము గీలించి

కరము సంతసమాత్మఁ గడలొత్తఁ బలికె
నా రుక్మిణీకన్య యాకారమహిమ
నారామచే విన్ననాఁట నుండియును
నాయింతి నాయెడ ననిశంబు నిలిచి
పాయదగానరేవగలు కంటికిని
నిదురచెందదు రుక్మి నిరసించి పోరి
మెదురించు రాజుల నెదిరించి తఱిమి
జలజాతనేత్రి భీష్మకపుత్రి ధాత్రి
వెలయంగఁ దెత్తునే విధినైన ననుచు
ధవలాక్షి యవతారకరణ మెఱిఁగి

యువిదకు నాకును నొకరాశియనుచుఁ
బ్రతిభటజన విదారకుని దారకుని
గుతుకంబుతోఁ గనుఁగొని దానవారి
రథము వేగమె కొని రమ్మన్న విష్ణు
రథసమబలమైన రథము దెచ్చుటయు
మించుల నదలించు మించులమణుల
మించులొయ్యారముల్మించఁ గీలించి
లోకేశుఁ డని సర్వలోకంబులెన్నఁ
డాకాలగండ పెండారంబు పూని
మెరసి కల్పకము విద్రుమవల్లి పొదవు

కరణిఁ జంద్రిక దట్టి గట్టిచూప
నటన మీఱఁగ గీరు నామంబుఁ దీర్చి
నవరత్నమయ కంకణముల లంకించి
నవరంగడాకాల సరిపెణ్లుజుట్టి
నీల భూధరముపై నిర్ఝరుల్ప్రోలుచు
పోలికమై హారములు నిండవైచి
రవికోటి కోటి కైరవమిత్రరుచుల
శవణించు మకరకుండలములు దాల్చి
గురురత్నకాంతి దిక్కులను బల్మాఱు
పురణించునొక బాహుపురిఁ గీలు కొలిపి
మును భీష్మసుత పంపుముద్దుటుంగరము
కను పట్టఁగాఁ జిటికెన వ్రేలఁ దాల్చి
శరదభ్ర శారదచంద్ర చంద్రికల
నిరసించు వలిపె పేరణియొప్పఁ దొడిఁగి
తీవిమై బిందిచుట్టిన యట్టిమరుని
మావుచాయల చక్క మావుకుల్లాయి
ధరియించి యెదుట నిద్దంపుటద్దమునఁ
గరమొప్పఁ దన యలంకార మీక్షించి
మలయరింగులు వారమడిచి బంగారు
వలువ చిత్తరముగా వలెవాటు వైచి
వేదవేదాంత సంవేద్య చిత్తములఁ
బాదుగల్గిన యట్టి పాదుకల్మెట్టి
వలుద చక్కని పిండు వలపించునిండు
వలపుల విరిచెండు వలకేలఁ బూని
దండియుద్ధపునిగ్గై దండగాఁ బట్టి
దండిమై సకలయాదవులు సేవింపఁ
బుడమి వేలుపులు సొంపులు మీఱ రెండు

గడల గోవిందాష్టకంబులు చదువ
హైమకాండోజ్జ్వలాయత పూర్ణ శీత
ధామ సమాతపత్ర ద్వంద్వమెసఁగ

నొరపైన మిన్నేటి యూర్మ్మలచాల
మఱపించు నుభయచామరములు వీవ
మాధవ శౌరి భూమానమెచ్చరిక
భూధవ యని రాజపుంగవుల్పొగడ
భోజేంద్ర మదహర్త భువనైకకర్త
రాజీవనేత్ర శ్రీరమణీకళత్ర
యదుకులాంబుధిరాజ యఖిలైకరాజ
పదమలాంబుజధామ సన్నుతధామ
హతబకాసుర వీర యసహాయ శూర
జితపూర్వదేవ రక్షితవసుదేవ

యవన రాజీవనకాననానల మగధ
కువలయాధిప సైన్యకుధర దంభోళి
యని వంది మాగధులను మోదమొంది
వినుతింప గని లింపవితతి సేవింపఁ
జిలుగదపారంబు చింగులింగీలు
బెళక కట్టుకవారు పెన్మ్రోతలడర
జతనము దేవ యెచ్చరిక పరాకు
జితనిశాచరవీర చిత్తేశ కృష్ణ
యనుచు నెచ్చరిక లంతంతఁ జేయుచును
ఘన వేత్రహస్తులై కడలనేతేర

ధవళలోచను బిరుదములుగ్గడింప
ధవళ శంఖములు ముందర భోరుకలఁగ
మునుకొని యూడిగంబుల వారునడువఁ

గనక తప్పెట చిత్రగతులు వాయింపఁ
గాళెలు మించుపాగ్గాళెలు సన్న
గాళెలు రాతులగ్గలముగా మొఱయఁ
బటహా భేరీ తూర్య పణవాది వాద్య
చటుల ఘోషంబులు జగమెల్లనిండ
బహుదేవతా సార్వభౌమ చిహ్నములు
వహి కెక్కి హరి విప్రవరులతోఁ గూడి

హరిహాయ హరిదశ్వ హరిహరి వేగ
హరమహాజవ వలాహక ముఖ్య తురగ
దర చక్ర శార్ఙ్గ నందక గదా శస్త్రి
వరకింకిణీ పక్షివర కేతు రుచిర
చక్రారి చక్రస్త సమచక్రచక్ర
శక్రారి భీకరస్యందనం బెక్కి
దళముగా నిరుమేల దళము గన్పింప
బలిమిమై యాదవ ప్రముఖులు గొల్వ
బారై యలో తమ్మబందను కృష్ణ
తారాయా హరిగె సాధనమాడ బేకు

అనుచుఁ గర్ణాట దేశాగతానేక
ఘన వీరభటులు చెంగటఁ జేరికొలువ
ఆయిత్తమాఘు వందలిమున్ని బన్ని
ఆయుధం గొండు నియంగెవా యనుచు
వివిధ వాక్యములచే వేర్వేఱఁ బిలిచి
ద్రవిడ సద్భటులు చెంతలఁ జేరికొలువ
ఆసా ఆడె ఆగె హరి జగన్నాథ
దాసు పేంబలు ఖండదారురే యటంచు
వంతంతదాఁటి సాహసము చూపుచును
వింతగాఁ గాళింగ వీరులే తేర

వెండియు దేశాధివిభులు శ్రీవిభుని
దండిమైనిట్టు నుద్దండతఁ గొలువ
ఘన మదోత్కట కుంభి కట భూరిదాన
వనములు బహుళ జీవనములుగాఁగఁ
గ్రమ్మెడి తళుకుల కైదువుల్మార్గ
ణమ్ములు వివిధమీనమ్ములుగాఁగఁ
దమ్మి మార్తుని మార్పఁదగు శిరోవేష్ట
నమ్ములు చారు ఫేనమ్ములుగాఁగ
శైలోపమాన కుంజరపుంజ వాహ
జాలముల్నక్రాది జాలముల్గాఁగ
రోష సాహస బలారూఢ వీరాళి
ఘోషంబుతరఁ గలఘోషంబుగాఁగ
సకల సన్నాహ భాస్వర శతాంగముల
నికరముల్విపులినా నికరముల్గాఁగ
గడుఁ బొడవగు తురంగములమై సుడులు
సుడులుగా బహువిధ స్ఫురణ చూపుచును
వాహినీపతివలె వాహినీ సమితి
వాహిని దశదిశల్ వడఁకనే తేర
వాహినీవిభుఁడు భూవరయొప్పా మిగిలి
యాతత చైద్య శౌర్యచ్ఛేదహేతు
కేతువుగతి తార్క్ష్య కేతులింపొంద
మాగధోత్పాత భూమహిత గర్జనము
బాగున రథ సముద్భట నాదమడర
హరి రుక్మి తేజంబు నణఁగించునెడను
సరవి బైన్ధూళి కంజాతాప్తుఁ బొదువఁ
బ్రతిలేని కడకమై బలములుఁ దాను

నతి ప్రమదముతోడ నరుగు నత్తఱిని
దమ్మనిమై కూర్మిఁ దమ్మ నిచ్చలును
గ్రమ్మ పోరఁగఁ జూచు కపట శాత్రవుల
రాకయుఁ దల పోసి రాకానిశాక

రాకార శోభితుండగు సీరపాణి
తాల హలాంకితోత్తాల ధ్వజాంశు
జాల సంవృత దిశా సంఘమైనట్టి
తేరెక్కి సైన్య సందీప్తుఁడై వేగ
సారసాక్షుని గూడఁ జనుదెంచెనంత
కరమువేడుక భీష్మక రమావరుండు
పరిణయోత్సవ లీలఁ బడవాళ్ల బనిచి
పురము సంకలితగోపురము శృంగార
కరమును శోభనాకరమునై యొప్పఁ
జేయించి పుత్రి విశేష దానములు

సేయించి భూసురాశీర్వాదమంద
దమఘోష సుతుఁడు దుర్దమఘోష వాద్య
సమధిక బలబంధు సహితుఁడై యపుడు
విక్రమాద్భుత మహావీరుండు దంత
వక్త్రుండు మగధభూవరుఁడు సాల్వుండు
మొదలైన రాజులిమ్ములఁగొల్వఁ జల్వ
మదటుమీఱఁగ వచ్చెనంత రుక్మియును
నెనసిన వేడ్కతో నెదురేగి కౌఁగి
టను గ్రుచ్చి మిగుల వేడ్కల హెచ్చి చైద్యు
వివిధార్చనముల గావించి యాభూమి

ధవునిఁ జైద్యుని విడిదలలందునునిచె
యంత నే కాంత కాంతాకీర్ణమగుచుఁ

అష్ట. 25.

చింతమై హరిరాకఁ జింతించి నొగులు
ఘనమైన వైదర్భి గర్భీకరించి
కొని తాపమెసఁగఁ జెక్కునఁ జేయి చేర్చి
యేమొకో రాఁడయ్యె నిందిరావిభుఁడు
భూమి..................
అక్రూరుఁడట నాలుగైదు బాణముల
వక్త్రవర్త్మను దంతవక్త్రు గుఱ్ఱములఁ
దఱిగి కేతనము గోదండ సారథులు

నఱికి రథంబెల్ల నజ్జు గావింప
నప్పుడు వాఁడొక్క యరదంబు కడకుఁ
గుప్పించి మఱియు మార్కొని పోరఁ దొడఁగె
ప్రతిలేక చనుదెంచు పౌండ్రకనామ
కృతవర్మవరుఁడైన కృతవర్మకినిసి
తరణి కాంతులు ధగద్ధగితంబులైన
శరములు నిగిడింప జడియకారాజు
నిప్పులు గ్రక్కెడి నిశితాంబకములు
కప్పినఁ గృతవర్మ కడఁకతో వాని
ఫాలభాగమున నంబకములు మూఁడు

కీలించి లయకాల కీలివై వాని
శరముల ముంచి తచ్ఛరములఁ ద్రుంచి
తురగాళి నొంచి సూతుని విదారించి
విలుద్రుంచియంత నిర్విణ్ణుఁ గావించె
చలము ముప్పిరిగొన సాల్వుఁ డవ్వేళ
ననల సన్నిభుని సాత్యకిఁ దార్చి యార్చి
కనక పుంఖోజ్జ్వల కాండముల్బఱపఁ
దొడనే యతఁ డొక్క తూఁపునవాని

జోదును ధనువును చూర్ణంబు జేసి
మూఁడు తూఁపులు ఫాలమునఁ గీలుకొలుప
వేడి యాతనికంటె వీరుచందమున
వీరరసావేశ వివశుఁడై వాఁడు
క్రూరత నాలుకగ్రోయు బాణంబు
తమ్మి పొక్కిలివాని తమ్ముపైఁ జొనుప
నమహాశరమునా గారిబాణమునఁ
దెగటార్చి యార్చి సందీప్త బాణంబు
తెగనిండవింట సంధించి యాపగతు
చను బ్రోలనాటింప జడిసి-యారాజు
చనియె నాహవ రసాస్థలినుండి వెఱచి
అప్పుడు జరాసంధుఁ డంగభూవిభుఁడు

కుపితుఁడై సేనడీ కొలువ బలుండు
తడయకుత్తుంగ మాతంగంబు నెక్కి
వడిఁ బోరు కాళింగ వసుధాతలేసు
గణుతికెక్కిన హలాగ్రంబు చేసవుడు
రణముతో గూల్చె వారణముతోఁ గూఁడ
నాని విదూరథుఁ డాదంతవక్త్రు ........
నేను తూఁపుల బలహీనుఁ గావించె
రణచిత్రకుండు చిత్రకుఁడు సత్యకుఁడు
మణిపుంఖ శరదంబకముల చేగ్రుచ్చి
వంగాధిపతి రథ వాహినీతతుల

బంగంబు నొందింప బలుఁడేగుదెంచి
బలువిలు గొని వంగపతి కేలి పసిఁడి
విలు ద్రుంచి విరథుఁ గావించి తద్బలము
చెండాడి పసిఁడి పింజయు తూఁపుఁ దొడిఁగి
చెండాడినట్లు తచ్ఛిరము త్తరించి

కౌశలం బేర్పడఁ గాహలాగ్రమునఁ
గాశికాధిపులఁ బెక్కండ్రనుక్కడఁచి
ధీరోష శీలులఁ దెగియరవదఱఁ
గారువర్ణాదుల ఖండించి వైచి
వరవంకపక్ష సంవళితంబులైన

శరముల సింహాక శతముఁ గీటణఁచి
కల్పాంత భైరవాకారుఁడై పేర్చి
యల్పమానను మగధాధీశుఁ బొదువ
నలిగి యమ్మగధుండు హలపాణిఁ గదిసి
బలముఁ జూపుచు మూఁడు భల్లముల్ గొనుప
బలదేవుఁ డామూఁడు బాణముల్ దునిమి
యలఘు చిత్రముగ బాణాష్టకం జేసి
యులిగి సూతుని విల్లు నరదంబు సిడము
తిల సమానములుగాఁ దెగటార్చి యార్చి
మొదగదగొని వ్రేయనిల వ్రాలితేలి

పదజెందివా డాహవక్షోణి వీత
వీరంబు విరదంబు విక్షీణదళ నవిహ్వలుఁడు

. . . . . . . . . . . . . . . . .

హరిహరియరదంబు నరదంబు చలము
విడువక పౌండ్రకుఁడీ విక్రమాగ్రజుఁడు
కడు రెసి వైరిచక్రంబు పై నుఱికి
పటుతర కరిఘటాభటవాజి నిటులపటలు
చటులాశుగములచేఁ జక్కసేయుచున్న
రంగదుత్తుంగ తరంగ సంఘముల
భ్రుంగుడు సేయుచు భూపాలవరుల

శిరములు పత్తములెత్తక్కటుఁ దొడలు
కరవాల శరచక్ర గదలఁ జిత్రముగఁ

దరిగి నాటించి విదారించికాఁటి
యఱి ముఱి దశదిశలందు నింపుచును
స్ఫుట హాలంబును బలంబును జలంబలరఁ
జటుల హాసలపుఁ గౌశలము చూపుచును
ప్రథన సంభృత విజృంభణ భీషణాంక
రథుల రథాళి సారథులఁ జెండుచును
భట కదంబము కదంబములు కంబువులు
తోటతోట ధరరాలం దునియ నేయుచును

రణభూతసమితి పారణలు నేయించి
గణుతింపరాని విక్రమ శక్తి మెఱసి
మార్గణములు మాఁట మాగధుండారు
నిర్గణముల నణఁగించి పెల్లార్చి
పాశంబు చేఁబట్టి పౌండ్రకనాముఁ
గీశంబు కై వడిఁ గిచకొట్ట జేసి
గ్రావంబు గఱివచ్చు ఘనునంగనాథు
గ్రీవంబు ద్రెంచి తక్కిన రాజవరుల
వేమరునహీ రెండువేల నాలుకల
పాము గీమున కేఁగఁ బటుఘాట నేయఁ

దిరిగె సాల్వుఁడు మోఁగఁ దిరిగెను మగధు
డరిగెఁ గోసలుఁడు పౌండ్రాధిశుఁ డేగె
విఱిగె సంపీరుండు వీగెఁ ద్రిగర్త
జఱిగె గ్రాథుండనుజని మొగుహాుండు
నగధరాగ్రజుని బాణములకు జడిసి
పగతురీరీతి నేర్పడ లజ్జదించి
యచ్చుగామును మున్న ధూకుండినంబు
జొచ్చినవాఁడెపో శూరుఁ డటంచు

పురుడుల తమపారి పోవు చందమున
బరువిడి కుండిన ప్రాంతంబు చేరి

చెదరవైచినయొడి నెలవాటులకును
బెదరి వచ్చినయట్టి పెడచలకరణిఁ
గుత్తుకల్దడుపుచు గుములుగాఁ గూడి
తత్తరంబును జెంది తమతోడఁ గూడ
రాకయా శౌశపురంబులోఁ జింతఁ
జీకాకు పడియున్న శిశుపాలుఁ జేరి
మేలు నీవును రాక మేలు చేసితివి
పాలు గల్గిన బలభద్రుండు కొంత
చాయవాటుగఁ జేయఁ జరిగి వచ్చితిమి
పోయిన వేకావె భువిని ప్రాణములు

ఆలేమ పట్టు దయ్యెమెఱుంగుఁ గాని
చాలు మాదెస జన్మజన్మంబులకును
జెలఁగి యేనుఁగుచేతి చెఱకుఁ గైకొనఁగ
నలవియే యెవ్వారికైన నాకరణి
నాదానవారికి నగపడినట్టి
వైదర్భిఁ గైకొన వశమె యివ్వేళ
యుద్ధంబ నెడుమాట యుడిఁగి పూనుంచి
బుద్ధి చేకొని నీదు పురమునకరుగు
దీమ సంభేది చింత్రింపంగఁ దలఁప
నేమి సేయంగ వచ్చునిది దైవకృతము

పోయెదమని చెప్పి భూపాలురెల్లఁ
బోయిరి తమ పురంబులకు నవ్వేళ
యాదవాధీశు సాహసమెల్లఁ దెలిసి
చేదీసి కొనిపోయెఁ జేదీశుఁ డంత
కనలి రుక్మియు దురాగ్రహ వృత్తిఁ బొదలి

కనుఁగవ విస్ఫులింగము లుత్పతిలఁ గఁ
బసులకాఁ పరినని పరికింపకెట్లు
కుసుమ కోమలినెత్తుకొని పోయె వీఁడు
చుట్టంబు గతివచ్చి సూఁడుబంటయ్యె
..................

దోరతనం బెఱుఁగక తుదిఁ బాటి పోయె
దోరకూళమైన చేతులఁ బట్టరాదు
తనమాయఁ గడుఁబిన్న తనమయ్యెననఁగ
ననిలోన గెల్చి సాహస వృత్తి మగుడ
వై దర్భిఁ దెచ్చిన వత్తునిచ్చుటికిఁ
గాదేని నాపెకు గ్రతఁ బ్రాణమిత్తు
నని తండ్రితోఁ బల్కి యాహవోదగ్ర
ఘన రథారూఢుఁడై క్రథకైశికాది
జననాథులును సర్వసైన్యంబు గొలువ
నెనలేని కినుకమై నేతేరబలము

దుర్మద రంపశాఖ దూరమానీంద్ర
నర్మదయైనట్టి నర్మదచెంత
మునుమున్న యరిగెడి మురదైత్యమర్దిఁ
గనుఁ గొనిపోకు మెక్కడ పోయదనుచు
గణములుగాఁగ మార్గణములు పఱుప
ఫణివైరి కేతుండు బలువిడి విఱిఁగి
కోపించి శార్ఙ్గంబుగొని పారపాటు
తూపులనాని దుత్తుమురులుగాఁ జేసి
మును శిరంబులును రంబులు కరంబులును
పెనునరంబులు విజృంభించి మోదుచును

దోనల సూతులను గేతులను రౌతులను
ఘన హేతులను బిండిగాఁ గఁజదుపుచును

మొగిఁ జర్మములు వర్మములు మర్మములును
దెగి ధర్మములతోడఁ ద్రెళ్లఁ గొట్టుచును
సురలెల్లఁ బొగడన సురలెల్ల బెగడ
ధరణీశ శౌరి యుద్ధము సేయునపుడు
వ్రాలు గాత్రములు పత్రములు ఛత్రములుఁ
గూలునక్కలును ముక్కలును జెక్కలును
గ్రుంగు నూరులును శూరులును నారులును
బ్రుంగు మూఁపులును గోపులును దూపులును

నయ్యెండు శౌరి నాహవ చిత్రకేళి
నయ్యెడఁ జరుపుచో నరిగి యారుక్మి
వెన్నతోఁ బెట్టినో వివరింపననుచు

. . . . . . . . . . . . . . . . . .

విలినారిదీడివే వేగంబొవాఁడి
బలునార సంబులఁ బద్మాక్షుఁ బొదవ
నరుణ పత్రోజ్జ్వలాయత మార్గణముల
మురవైరి వాని నిర్మూలంబు సేసి
విలుద్రుంచి రెండవ విలుద్రుంచి మరియు
విలుగొని నిలువ గోవిందుండు వాని

సూతుని ధనువు కంచుకము గుఱ్ఱములఁ
గేతువున రథంబు గెడప నారుక్మి
హరిమీఁద నడిదంబు హరిగేయువ్రాని
సరభస గతి వచ్చు సమయంబునందు
పలకయుడాలు నంబకములు నూరాఁట

. . . . . . . . . . . . . . . . . .

శైలోపమాన కుంజరపుంజ వాహ...
జాలంబు నక్రాది జలములల్లాఁగ
నలినలి గావించినలి దైత్యమణియు
యాశార్ఙ్గ [illegible] శేల నమరించి శేలఁ

బాళంబు గతినొప్పు పాళంబు ప్రాని

................

మల్లరి పెద్ద ద్రిమ్మరి తనముడుగ
వల్లవై చిన క్రియవడి వాని బట్టి
తగఁ దొట్టి యురమెల్లఁ దటదటనదర
మొగము మీఁదికి నెత్తి మూల్గుచునలయఁ
బుడమిపై మకుటంబు బుడిబుడి దొర్ల
చిడిముడి వెన్నుపై సికవిడిజాఱఁ
దడబాటుతోడ దంతములిలకఱవఁ
బెడమలరఁగఁ బట్టి బిగియించి కట్టి ......

ధళధళమనుడాలు ధరియించి వాని
తలఁ ద్రేయఁ బూన వైదర్భియత్తఱిని
నన్నచందముఁ గృష్ణుఁ డడిదంబు కేలఁ
గొన్నచందముఁ గనుఁగొని యాత్మలోనఁ
గని కరింపుచుఁ గరకమలములొడ్డి
పెనగొన్న సిగ్గును బ్రియము రెట్టింపఁ
ముంగురు లల్లాడ మోమింతయెత్తి
తొంగలి ఱెప్పల తుదఁబాఱఁ జూచి
చనుదోయిడాయు వాసననించు కదిమి

నునుపు కస్తురి పూఁత నూఁగుగారాలఁ
గుచ్ఛలు మెఱయంగఁ గొనకొన్న సరులు
తచ్చరలాడ బిత్తరమిట్టి పడఁగ
బాలేందు రేఖకుఁ బ్రతివచ్చునట్టి
ఫాలేందు రేఖ శ్రీపాదంబు నొఱయ
జోట జోట తేనియ లొనగాఁగ గుతియఁ
గుటిల కుంతలవల్లి గోవిందుతోడ

ప్రాణేశ నామాట పాటించి వీని
ప్రాణముల్గొనకింకఁ బాలింపుమనినఁ..
గదమున నాబాల కరమర్థిఁ గ్రుచ్చి
యురమున నునుగుబ్బ లొఱయఁగఁ జేర్చి
యగపడిజిగి హాళాహాళిగాఁగ బిగిసి
తగడు గొన్నట్టి రత్నపుతేవనలరి
తోయజేక్షణ మాట తోయజాక్షుండు
త్రోయఁ జాలక రుక్మి దుష్టమానసుని
తల నాల్గు దెసలకుఁ దనప్రతాపంబు
వెలయంగఁ జూచిన విధము దీపింపఁ
బలుచని నిడువాలు పదను తూపునను
గొలచిన రీతి డొంగులువాఱ గొఱిఁగి
పాలుమాలించి లజ్జబండని జేసి
గేలిఁ బెట్టుచుఁ గేరి కేరి నవ్వుచును
బలభద్రుఁడప్పుడు పగర నిర్జించి
దళములుఁ దానును దనుజారిఁ జేరి
వనజాక్ష విడువిడు వలదిది రుక్మి
మన సరియనుఁ గాడు మనసరిగాఁడు
అనుచుఁ గట్లూడ్చి పొమ్మనికన్నుఁ గీట
తనవారి మొగమెట్లు తాఁజూతుననుచు
సిగ్గుతో నరిగె వచ్చిన త్రోవఁ బట్టి
యగ్గలంబగువేడ్క హరియుఁ గృష్ణుండు
జేలమై పడియున్న వీరనృపాల
జాలంబు మహనీయ సాలంబు మొగుల
దట్టఁబులైన నభోంతరమ్మున నాఁడు
నట్టలతెట్టుప లట్టాల కలముల

నరదముల్మేడల నరదముల్పఱచు
.................
తేరులు పీరులుఁ దెగిరాలియున్న
.................
రత్నముల్విపణి మార్గముల నమ్మ
రత్నముల్ రత్నాకరములు దీర్ఘికలు
ఖాకినీ ఢాకినీ చయములుదార
లోకంబుగాఁగ నాలోకించి చూడ
వర వీరలక్ష్మి నివాస పట్టనము
సరవినొప్పెడు రణస్థలి వేగవెడలి
బృందారకులు పుష్పబృందముల్గురియ
వంది మాగధులు కైవారముల్సేయ
నానంద సుతరాము లానందమంది .....
భూనాథు లిరువేలఁ బొగడుచుఁ గొలువ
ద్వారకకేతెంచి తత్సమీపమున
భోరన విజయకంబువులు పూరింప
ధరనాదమప్పుడందఱు నాలకించి
పురజనుల్యదువృష్ణి భోజవంశజులు
కెదురేగి కానుకలిచ్చి మ్రొక్కనను
బొదలి తాలాంకుఁ డంభోజసంభవుఁడు
పురము చొత్తెంచి తత్పురవీథినరుగఁ
బురసతుల్ రుక్మిణి భువనైకమాతఁ
గనుఁ గొని యంతరంగముల నంగముల
ఘనమదంబును బులకలునాఱుకొనఁగ
మగవారి వలపించు మగువలు కలరు
మగువల వలపించు మగువలుఁ గలరె
గగనమో భృంగసంగమొ కలాపంబొ

మొగమొ యీ లలితాంగిముఖమైన తురుము
కలగిరులో దీని గుబ్బపాలిండ్లో . . . . . . . . .
హరిమధ్యమొ సందియమొ బట్టబయలో
పరమాణువో దీని పసనిగ్గు నడుము . . . . . . . .
అనంటులో యుగములో హస్తిహస్తములో
ఘనశరభములో యీకాంత యూరువులు
తలిరులో తమ్ములో............
............మొఱయకయుండు
పడఁతుక బొమదోయి భావంబు జూడఁ
బోడిఁ బడకెట్లుండుఁ బూవుల విల్లు
కలకంఠి నిడుఁబోగ కన్నులు చూచి
తలవంప కెట్లుండు ధవళాంబుజములు
............వఱపులు చూచి
వనరక యెట్లుండు వరకీర సమితి
యుల్లలనామణి యధరంబు చూచి
కుల్లుకో కెట్లుండు గురుబింబఫలము
జలజాక్షి నెమ్మోము సైకంబు జూచి
వెలవెలబోకెట్లుఁ విధుబింబముండు
ముద్దియ చన్నులు మురిపంబు చూచి
గ్రుద్దుకో కెట్లుండుఁ గోడెజక్కవలు
దిట్ట గుబ్బెతయూరు తెలుఁగెల్లఁ జూచి
నిట్టూర్పు విడకెట్లు నిలుచుఁ గాలాహి
కన్నియనడుమునుదాఁ గన్నారఁ జూచి
చిన్నపో కెట్లుండు సింగంబు నడుము
మగువ యూరులమీఁది మహిమలు చూచి
దిగఁగాఱ కెట్లుండు ధృతిఁ గదళికలు

తలిరాకుజోఁడి పాదంబులఁ జూచి
....................
అని రాజవరులెల్ల నచ్చెరువంది
కొని యాడ రుక్మిణీ కువలయనేత్రి

ఫాలబాలేందుని పైఁ జిత్తరించు
రోలంబ గురుదాళి రుచిరాలకములు
....................
నమకొని కెంగేలఁ జక్కనెత్తుచును
జిలుతేఁటి ఱెక్కలే జిగిదువాడించు
మెఱుఁగారునూనూఁగు మీసలవాని
గ్రమ్మి పీనులతోడఁ గదియుచువాని
పంచాస్త్రికోటికిఁ బంచాస్త్రిఁ దగుచుఁ
బంచాయుధములఁ జొప్పడియున్నవాని
బాగడొందు నుల్లాసమునఁ దేలు పసిఁడి

తగడుచాయ..............
.............శగించు దర్పణాననము
గలవాని దనపాలి గలవాని గాంచి
తొలుకాఱు వెలుఁపుతోఁ దులదూగు చూపు
జలదవర్ణునిమీఁదఁ జక్కగా నిలిపె
సరసిజాక్షుండు నానతిని వీక్షించి
...........రనటకుఁబోనిచ్చి
సురలెల్ల నరుదంద సురుచిర గతుల
గరుడుండమును సుధాకలశము గొనిన
కరణి రాజులు చూడఁగాఁ బ్రతాపించి

కరమర్థి రుక్మిణీ కవ్యాలలామ
...........రథము

వై లీలనిడుకొని బలసహోదరుఁడు
పిలువక వచ్చిన పేరంటమునకుఁ.... ....
బొలయక చెప్పక పోవుటేలెన్న
ననుచందములనేగ నపుడు డెందముల
............ ........
తప్పెఁ గార్యంబు వైదర్భిఁ గైకొనిరె
నిప్పుడే హరిఁ బోవ నీనెట్లు వచ్చు ..........
రాజుల వరవీర రాజుల దార్చి
భోజసంభవఁ గొనిపోయె నివ్వేళ
నెవ్విధముననైన నీపశుపాల
....................
తమ సాహసంబులుఁ దమ బాహుబలము
తమ విక్రమములు నిత్తఱిమంటనిడక
తెచ్చుట వైదర్భిం దెగి శౌరిచేతఁ
జచ్చుటఁగాక..................
.........ముల్ సైన్యములతోఁ గూడ ...........
గనలుచులయ కాలకాలుఁడై కడఁకఁ
గనుపట్టి సాల్వ మాగధ ముఖ్యులెల్ల
వనజాక్షు వెనువెంట వడినంటఁ బాఱి
.................. ..........
బలువిడి శరపరంపరలప్పైఁ బఱపఁ
దవిలి నీరసతృణతతిమీఁద నిగుడు
దవము చందమున యాదవసేన విఱిగి
ధనువులు నిక్కించి దఱిగొన్న వేడ్క
...............తతులఁ జిక్కించి
కయ్యంబు గావింపఁ గంససంహారి ..........

నెయ్యంబుతో రుక్మిణీదేవిఁ జూచి
పగర నీక్షణములో పలఁగూల్చి దివ్య

నగర నాయకులన......
......ప్రలంబాంతకు నక్రూరముఖుల
నని సేయ సమకట్టి యటు చూచుచుండె
బలభద్రుఁ డప్పుడు బలభద్ర చైద్య
బలభద్రుఁడై యదుప్రవరులతోడఁగు
గురు...........మున
నురగాళిఁ గన్న తార్క్ష్యుని విధంబునను
నభ్రాళిఁ దోలు జంఝూనిలు పగిది
నభంబు దిక్కులునవియఁ బెల్లార్చి
చలము రెట్టింప నిచ్చలమును హలము

బలమున ముసలము......
అనుపమ సకలాయుధాన్వితంబైన
కనక శతాంగంబు గడువేగఁ బఱప
బలిమి మాగధు నెదుర్పడి పోకవానిఁ
బలుఁ దూప్రలఱువదిఁ బఱపి స్రుక్కించె
....................
కృష్ణుండు పెండ్లి పందిటి క్రిందనిలువఁ
బసు పుటంబులు వలిపెము గట్టిమిగులఁ
బసగల గిరుతు గుబ్బలనానవైచి
చిఱుఁగురలొసపరి చెలువుగా దువ్వి

నెఱిఁగప్పు గలగొప్ప నెఱిగొప్పు దురిమి
కుఱువేరు విరిదండ కూడంగఁ బెనఁచి
తుఱుమున కొకయమ్మె దొరయ గీలించి
కన్నులంచులఁ దేటగాఁజెన్ను మిగుల

సన్నంబుగాఁగఁ గజ్జలరేఖఁ దీర్చి
నెలవంకకొకవంక నెఱసులు వెదకు
చెలువంపు నొసల బాసికము గీలించి
త్రిభువన తిలకినీ తిలకమైనట్టి
యుభయాన రుక్మిణి హేమాంగిఁ జెలులు
కడువేడ్కతోఁ దేరఁగా సంభ్రమమునఁ

దడయక రేవతీధవుఁడు నుద్ధవుఁడు
తెరపట్టి రంత శ్రీదేవుండుతలఁప
సురనదీముఖ నదీశోభితుఁడుగుచు
నెలమి రత్నాకరుండేతెంచి రత్న
కలశోదకము ధారగాఱఁగ నొసఁగ
జలజాక్షు పాదమజ్జనము గావించి
బలు తమ్మునకు మధుపర్క మర్పించి
జిగితమ్మికవ్రాలు సితపక్ష యుగము
పగిది బంగరు మెట్టు బాలపుష్టికల
జలదవర్ణుండు నాజలదవేణియను

నిలిచి శోభిల్లి పూనిన వేడ్కనంత
వాణి యింద్రాణి శార్వాణి శీతాంశు
రాణియు సకలగీర్వాణ కన్యకలు
గవగూడి సంగీత గరిమ దీపింప
ధవళాక్షుమీఁదటి ధవళంబు పాడఁ
జతురతమై మహాసంకల్ప మతఁడు
హితవృత్తి నిజపురోహితుఁడు నర్పింపఁ
దలకొని మునులు మంత్రములుచ్చరింపఁ
గలశాబ్ధి కలశాబ్ధి కన్యకా మూర్తి
రమణయై దానధారా పూర్వకముగఁ

గమలాక్షునకు నిచ్చె గర్గుఁ డవ్వేళ
నాయితంబుగ గడియారంబు జూచి
యాయత్త మనగురుఁ డామయుత్తమఁచ
బహువేదవిధుల శ్రీపతి రమాదేవి
మహియను గుర్వంతు మంగళంబనుచు
ఖంగునవై చేఁ జేగంట నాదంట
నంగజ గురుఁడును నఖిలైకమాత
యిరువురొంకొరు మోము లీక్షింపఁ జూపు
లరవిందముల వ్రాలు నలులైన నమర
మెలఁతుక తనచేయి మిదుగాకనొసఁగె

జలజాక్షుఁ డంతట సగుడజీరకము
సీమంతినీమణి సీమంత సీమ
దామోదరుఁడు శుభద్రవ్యంబునించె
గురుతర సుమవృష్టి కురిసె నవ్వేళ
పరసాత్మలై వియచ్చరలు నచ్చరలు
పాడిరాడిరి నభోభాగంబునందుఁ
దోడనే పొడమె దుందుభి నినాదంబు
నగవు వెన్నెలలు చిందఁగఁ బట్టినట్లు
జిగి ముత్తియములు మచ్చికదోయిలించి
భాసిల్లఁ గృష్ణుండు పద్మాయతాక్షి

సేస కొప్పున నొప్ప సేసఁ బ్రాలిడిన
తెలిమించు చుక్కల తెలిఁగాని పించి
చెలువున గొప్పమై సేసఁ బ్రాలమరఁ
గానసి యాడఁ జన్నవముద్దుగునిఁకు
నానతెప్పలనాన నలినాయతాక్షి
ఘనకల్పలతల చొక్కపు విరుల్దాల్చి

యనువునఁ దలఁబ్రాలు హరిమీఁద నించె
బలరాము తమ్ముఁడా పరమకల్యాణి
గళమునఁ జేర్చె మంగళసూత్ర మపుడు
వైదర్భి కృష్ణ సౌవర్ణ కల్యాణ
వేదిపై వేదాంతవేది గర్గుండు
భాసిల్ల మణిమయ భద్రపీఠమున
నాసీనులుగఁ జేసి నాగమోక్తమున
మేలిమి మును లెల్ల మెచ్చఁ దాలిమిని
వ్రేలిమి మొదలైన విధులఁ గర్మములు
సేయించి బహువిధాశీర్వాద మెలమిఁ
జేయించి మణిదీప చిత్రపాత్రికల
నీరాజనము లవనీరాజకాంత
లారాజవదనకు నంబుజాక్షునకు
నొసఁగ నక్షతముల నుర్వీసురేంద్రు
లొసఁగ డెందముల నుత్సాహ మెసఁగ
హరుఁడు వాణీమనోహరుఁడు దిగ్భూమి
వరులు కిన్నరులు భూవరులు కట్నములు
సవరింప శౌరియాసరవిఁ గల్యాణ
మవధరించెను జగంబానందమందఁ
గమలజాప్తులకును గర్గ్య ముఖ్యులకు
నమలలోచనుఁ డుడుగరలఁ బాలించి
పార్థివేశ్వరుల సంభావించి పొగడ
నర్థిబృందముల కిష్టార్థంబు లిచ్చి
ఘనతర బంధువర్గములకు వివిధ
కనకాంబరాది వర్గముచేఁ దనిపి
జలరాశి కన్యకా సహితుఁడై యపుడు

జలరాశి మధ్యవాస మొనర్చుకరణి
నీలవర్ణుఁడు రుక్మిణీదేవిఁ గూడి
చాల నొప్పుచు మాని జాలమెన్నఁగను
జనులను సౌఖ్యముల్సమకూరఁ జేసి
జననాథ యాభీష్మ జననాథ తనయ
నెనసి రమానాథుఁ డిష్టభోగముల
మొనసి యెంతయును బ్రమోదించుచుండెఁ
వనజాక్షుఁ డపుడు జీవనజాతుఁడైన

తనుగన్నతండ్రి యాదవ నాథుఁడైన
నతనికిఁ దనుజుండ నగుదునేననుచు
మతినెన్ని శౌరిసమ్మతి సంతసించి
రమణ నై దేహిగర్భము బ్రవేశింపఁ
గ్రమమున రుక్మిణీ కామినీమణికి
నవరసి యపరంజి నలరుమై దీగ
నవచంద్ర రేఖ చందమునఁ జూపట్టె
ధవళాక్షుఁ డధరామృతముఁ గ్రోలుకతనఁ
జవిగొన నలినంబు చొక్కమైతోఁచె
నతనుని విలునారి యమలమధ్యమునఁ

బ్రతిబింబమొనరిన పగిదినారమరెఁ
గింతు యాత్రిక చిప్పకవమీఁద నిలిచి
బంతులోయనఁ గప్పు బలనెఁ జన్మొనలు
వలరాజు మణిమయా వరణంబు లేవఁ
దళుకొత్తునుదర బంధము బిగువయ్యె
నెలలు తొమ్మిదియును నిండెనిండుటయు
సలలిత గ్రహములు త్తమములందుండ
నారుక్మిణీకాంత యతుల లగ్నమున

మారు నీరజ సుకుమారు కుమారుఁ
గాంచెఁ గాంచుట యును గాంచనాంబరుఁడు

నించిన వేడ్కతో హేమాదికముల
నుర్వీసురేంద్రుల కొసఁగి విధ్యుక్త
సర్వ శుభక్రియల్సవరించి మించి
కవులును వీరపుంగవులును భూమి
ధవులును సకలయాదవులును గొలువ
ధారణి సజ్జనాధారకమైన
ద్వారకనుండె నంతయు వేడ్కఁ గోడ
నని యోగిజనపాలుఁ డాజనపాలుఁ
డను మోదమంద యిట్లని యానతిచ్చె
నని సుధావాణికి నబ్జపాణికిని

వనజాస్త్రు మాతకు వనధిజాతకును
ననుఁగన్నతల్లి కనత్రమభల్లికిని
గనకగాత్రికిని బ్రకామదాత్రికిని
వాణీశనుతకు సువ్రతకక్షి విచల
దేణికి శ్రీవేంకటేశు రాణికిని
సారసగేహకుఁ జారుహాసకును
సారలావణ్యకు సకలగణ్యకును
బరమకల్యాణికి భ్రమరవేణికిని
దరుణేందుఫాల కుదారశీలకును
రామాభిరామ కప్రతిమ ధామకును

హైమసంవ్యానకు హంసయానకును
నింద్రభావితకు నాగేంద్రసేవితకుఁ
జంద్రికాహాసకుఁ జారునాసకును
నగసుతాసతికఁ బన్నగతల్పయుతకు

## చతుర్థాశ్వాసము

మృగమదాంగకుఁ సలమేలుమంగకును
నంకితంబుగను శ్రీహరిభక్తనికర
పంకజార్యమ తాళ్ళపాకాన్నయార్య
తనయ తిమ్మార్యనందన రత్నశుంభ
దనుపమ శ్రీవేంకటాధీశ దత్త
మకర కుండలయుగ్మ మండితకర్ణ

సుకవిజీవంజీవ సోమరాజీవ
సదనావధూ లబ్ధ సరసకవిత్వ
విదితమానస తిరువేంగళనాథ
విరచితంబగు ప్రతిద్విపద సంశ్రవణ
తరళిత విబుధ మస్త ప్రణీతోరు
మనసిజ జనకాష్ట మహిషీవివాహ
మనుకావ్యమునఁ జతుర్థాశ్వాసమయ్యె.





శ్రీరస్తు

# అష్టమహిషీ కల్యాణము

## పంచమాశ్వాసము

(శ్రీదేవీ మహిమవర్ణన.)

[ ద్విపద ]

అసమానలావణ్య యసమశరణ్య
బిసకాండసమబాహ బిసరుహగేహ
నిరుపమాలంకార నిత్యశృంగార

హరిభుజాంతరసంగ యనమేలుమంగ
యవధరింపుము దేవి యఖిలభూనాథ
కువలయసందోహ కువలయాహితుఁడు
చిన్మయాత్ముఁడ పరీక్షిన్నరనాథుఁ
డున్నతోన్నత శుకయోగికిట్లనియె

# 2. ద్వితీయ పట్టమహిషి

## శ్రీ జాంబవతీదేవి వివాహ వర్ణన ప్రసంగము.

వరరూపవతి జాంబవతి మొదలైన
తరుణుల నుత్పలదళవిలోచనల
నేరీతి వరియించె నిందిరానాథుఁ
డారీతి రీతిగా నానతిమ్మనుఁడు
మిత్రిగోరూపాయ మిత్రుఁడై నట్టి

సత్రాజితాఖ్యుండు శత్రుసూదనుఁడు
తపసు గుఱిఁచి ఘోరతపమొనరించి
తపన స్యమంతక తపముఁ గైకొనుచు
ధరణికేతెంచెను దరణినేఁడనుచుఁ
బురజనులెల్ల నబ్బురమంది చూడ
ద్వారకసొచ్చి మోదంబుతోఁ జక్ర
ధారియా యదుకులోద్ధారి సీక్షించి
ప్రణతులొనర్ప గోపాలపాలకుఁడు
మణిపీఠియందు సన్మానితుఁ జేసి
గుణివర్య యెచటఁ గైకొంటివీ దివ్య

మణి చూడఁగ నభోమణికాంతి గలది
యిమ్మనుజులకెల్ల నిదియేలదక్కు
నిమ్మని యదుభర్తకిమ్మనియనినఁ
బకపక నవ్వి తప్పక చూచి శౌరి
నొకమాట మోమోట యుడిగి యిట్లనియె
నగములకేఁగి వానలఁ దొప్పఁ దోఁగి
చిగురుల నమలి మించిన యెండఁ గమరి

భానుచేఁ గొనియటు పటురత్నమెఱుల
కీను బంగరుకుప్ప లీనునాయింట
నని దీనినీఁ గూడదని యింటికతఁడు

చనియె నమ్మణి విలాసమున నొక్కఁడను
భూనాథ యతనితోఁ బుట్టు జితారి
సైన్యుఁడైనట్టి ప్రసేనుండు దాల్చి
సమకట్ల జల్లులస యోగమొనర
సమకట్టినట్టి యశ్వము నెక్కినిక్క
రాజులు భటవీరరాజులుఁ గొలువ
వాజి దాఁటించి తీవ్రత వేఁటవెడలి
బాగైన యపరంజి పట్టెడల్లిగుడ
సాగి గుబ్బనుగాఁగ జాగిలంబులును
గిరిగొన్నకైదు కక్కురలఁ గొక్కరల

జరగనీ యఁకవటఁ జాలుడేగలును
కాఁచిపుటంబిడి కనకంబు వెట్టి
తూఁచి కైకొన్నట్టి తోఁచిగాడులును
మువ్వల గిల గిల మొఱయ జాడించి
క్రొవ్వనుప్పొంగు కొమరు సాళ్వములు
కనినంతనే కురంగముల సంఘముల
పెనుపడి చెండాడు పెను బండిపులులు
సెలకట్టియలు గొప్ప జేవడంబులును
సిలకట్టియలు పెక్కు చిక్కులవలలు
పెనువిండ్లు సగము జాబిల్లియమ్ములును

ఘనముతో కత్తులు కడిఁది తిత్తులును
బూని వేటరులు గబ్బులుమీఱి కదల
సేనాదులకుమున్న యేగ నారాజు
కోల గాలవజాల కుంద ముకుంద

సాల తాలాంకోల జంబు కదంబ
తుంగ నారంగ బంధూక మధూక
తుంగ రంగత్తాళ ధూప నీపాట
తరులఁ బొంతెడు నేర్లదరుల శైలాభ
కరులచే నొప్పారు కానసొత్తెంచి
మేఁటి కౌతులఁ జుట్టి మిాటుగా నిలిపి

వేటరులును దాను వేఁటాడఁ దొణఁగె
సారెకుఁ గోఁటలు చప్పటించుచును
దోరంబులైన పందులరోసి యేసి
పట్టెడ లెడలించి పచరించిచాయఁ
బట్టఁ గుక్కలదాని పైనుసకొలుపఁ
గవిసి యూయంబులు గఱచి విదిర్చి
తవిలి గొంతుల నల్లఁ ద్రావుచునుండఁ
బొదలఁ గ్రక్కదలఁ జోఁపుడు కొలఁచోప
నుదిరి బిట్టెగసిన యుదిరికైదులును
లావులుగా సోఁగ లావులు నివిరి

కైవాలకుండుడే గలఁ బూఁచి లైవఁ
గ్రక్కునఁ బాటి తెక్కలమిాఁద నెక్కి
యక్క పక్కియ చెక్కు నడియనొక్కుచును
గువ్వల వడిఁబట్టి గువ్వలులైవ
నవ్వల కుందేళ్ల నాడేళ్ల లెళ్ల
చాయకుమును మింటఁ జను సాళువములు
నా మెడ బోయని నార్చి పిల్చుటయు
భోరున దూరి తెప్పుననెత్తి దొత్తి
క్రూరత మెదడు ముక్కుల గ్రుచ్చిమ్రింగ
గవులలోఁ బులులఁజే కత్తుల కడిమి

నవలీలఁ బొడిచి సాహసములు నెఱపఁ
బొడలైన యొడలు నబ్బురమైననడలు
జిగిగొన్న పొడలుకెం జాయలేఁ దొడలు
నెలిగి మిక్కిలి చూడఁ గలిగినదుప్పి
చెలువ మీక్షించి ప్రసేనుఁ డంకించి
పరివారమీదుప్పిఁ బరిమార్న వలదు
పరికింపుఁ డీదెదానిఁ బట్టితెచ్చుటను
ననివారి వారించి యచ్చోటనునిచి
ఘనతర తరవారిఁ గైకొన్న మృగము
వలతెల్ల నివ్వలవ్వలగాఁగ నఱికి
సెలవింటి కోలయేసిన రీతిఁ గదలఁ
గ్రమ్మి యామృగ తీవ్రగతితోడఁ గూడ
నమ్మెట నటన పంచార మంటించి
యదరంటధేయని యూర్ధ్వనావాజి
పద రవోద్ధుతరాజి బలువాజిఁ దోలి
చొచ్చిన చోట్లను జొచ్చిపోనీక
విచ్చల విడివడి వెన్నాడి పోయి
కరిఘటా నిటల సంఘటిత నఖాగ్ర
హరి కహాకహా విరావాకులంబైన
కానలో నాదుప్పిఁ గానకతప్పి
నూని నీళ్లుల టెంకియున్న యత్తఱిని
నీరంధ్ర తరు లతా నికర మధ్యమున
నీరెండగాయుచు నీమణిఁ జూచి
గంహ్వరీ ధరగుహ కడతెంచియొక్క
సింహ్వంబు నరనాథసింహుపై నెగసి
హరితోడఁ గూడంగ హరియించి మణియు
హరియించి యొకత్రోవ నరుగుచు నుండ

నాతత బలవంతుఁడగు జాంబవంతుఁ
డాతఱి సింహంబు నవనిపైఁ గెడపి
యామణిఁ గైకొని యలరి వేడుకల

యామనితోఁ యాడ నాత్మీయ గుహకుఁ
జనిరత్నమవుడు పచ్చనిత్రాట గ్రుచ్చి
తనపట్టి తొట్టిమీఁదటఁ గట్టెనంత
గగనేశుఁ డరిది దిక్కన్యక యఱుతఁ
దగిలించు రత్నంబు తాళిబొట్టనఁగఁ
జదురైన యఱసంజ జవ్వని చంటఁ
బొదవిన సిబ్బంపు పొడమో యనంగఁ
గొంచక దినయాంత్రికుఁడు సురల్మెచ్చఁ
బొంచివైచినగచ్చు బొమ్మరంబనఁగఁ
బచ్చమావుల రెండు పసగల కెంపు

పచ్చనిచాయ లంబరమున నిగడఁ
గ్రుంకుడుకొండఁ ద్రొక్కుచు నపరాబ్ధిఁ
గ్రుంకె చీకట్లు దిక్కులవేఘుఁ జూడఁ
దుద భానుభాను విద్రుమ లతల్లిప్త
పదమును రెంటెంట బలసెనోయనఁగ
సురచిరంబేక కౌసుంభాంబరంబు
కరణి దిక్తటులు చూపట్టె నభ్రమునఁ
గడిఁది మున్నమృతంబు గరుడుండుగొనుచుఁ
గడువడిఁ జనఁగఁ దత్కలశంబు తొలఁకి
చెదరియాకసమునఁ జిందె చూపట్టు

తుదలేని యమృతంపు తుంపురులనఁగ
వికసించు చేమంతి విరులచందమునఁ
బ్రకటంబులైకను పట్టెఁ దారకలు

తేరిచి విరహి వీథినిగామరుండు
కోరి కట్టిన రసఘుటికయోయనఁగఁ
గలువలుచెలఁగఁ జక్రంబులు దొలఁగ
వలరాజుకొసర జీవనజముల్లసరఁ
బొడమైన మించుల పొడపు గుబ్బలినిఁ
బొడసూపెనంత వేల్పుల మేఁతకప్ప
కలికిరే రాజు నక్షత్ర మాలికకుఁ
గొలికిపూసనఁగ వేగురుచుక్క పొడిచెఁ
గజక చీఁకట్లను కరులమాయింపఁ
బజు తెంచు సింగంబు పగిదిఁ జూపట్టు
భానుండు సారుణభానుఁడై పొడిచె
సేనలారే యిప్రసేనుని వెదకి
కానకేయిరవును గానకే తెంచి
తోన సత్రాజిత్తుతో విన్నవింపఁ
బొక్కి సొంపులు దక్కి పొదలు దఃఖమునఁ
జిక్కితా నవివేకచిత్తుఁడై పలికెఁ
బరమ మాయావి శ్రీపతి ప్రతిలేని
వరమణి యాదవవరుని కిమ్మన్నఁ
దమ్ముఁ గైకొనకున్నఁ దమునిఁజంపింప
యమ్మణి శ్రీమణి హరియింపఁ బోలు
నని విని రోషించి యాదానవారి
తనవారిజనుల సత్రాజిత్తువారి
జొప్పున రమ్మని సోమకాసురుని
చొప్పెత్తు తలవరిచూడఁ జోద్యముగ
మునువాఁడుచను మార్గమును జూపికొనుచుఁ
జని వన మంజుకుంజముల పుంజముల
సరసఁ బ్రాణముల్లు తేజము దక్కి స్రుక్కి

ధరఁ ద్రెళ్లియున్న సత్రాజిత్తు తమ్ముఁ
గునుఁ గొని యత్తురంగమును సింగమును
జనులకుఁ జూపఁ గేసరి నేలఁ గూల్చి
యొలుఁ గులజేఁడు వోయిన త్రోవఁ బోవ
నలరు చీకటి రథంబగు బిలంబొకటి
నాలోనగనిఁ జాడ లరయంగఁ జూడ
లోలోనఁ గనువట్టి నివిచూడుఁ డనుచు
నల బలంబవునని యల బలంబులను
బిలము వాకిటఁ బెట్టి పీతాంబరుండు
నా మహాగుహ సొచ్చి నట నొక్క హేమ
ధామ ధామంబురోధామ సద్మమున
నుదుటు మారునివాడి నొకముద్దులాడి
ముదురు గోయిల ద్రొల్చు మోహానంబలర
బంగరు గొలుసులు గట్టిపాలిండ్ల
ముంగిళ్లఁ గదలఁ దమ్ముఁడయంచు నూచి
జోలఁ బాడఁగఁ దొట్లఁ జొక్కుచు నవ్వ
బాలుచే పడుడుచు నూఁపఁగ మిట్టిపడుచుఁ
జకచక ద్యుతుల భాస్కర కరావళికిఁ
దుకతుక లొసఁగు బంధుర రత్నమప్పుడు
కొని వేడ్కనొడిఁ బెట్టుకొనినంతఁ జెంత
వనితహాయని జాంబవంతుని బిలువ
పదపడి యా ఋక్షపతి రమాపతిని
గదిసి కోపాటోప కంఠుఁడై నిక్కి
శూలికిఁ గేలికి సురలకసురల
కాలోను జొరఁగరాదెట్లు చొచ్చితివి
అనుచు దర్పించి మిన్నగల గర్జించి
ఘనవృక్షమువవైవఁ గంసారి చాని

దనిమె భూజమును బంధురతరాహతిని
గనలి మేఘములీల గర్జించి పొంచి
పాణినాథుఁడు చక్రపాణిమై వైవ

జాణూరమర్ది కంసధ్వంసి ముష్టి
నా ఋక్షపతి వక్షమపుడు తాటించె
నారూఢ జయధరుండగు ఋక్షవరుఁడు
హరిఁ గొల్చైనతని శ్రీహరిఅవ్వే నతఁడు
ధరణీశునైచె నాతని శౌరి యొడిసె
బహుగుహాగహన సంభరితోగ్ర సహజ
మహితారవంబులు మహిఁ బిక్కటిలఁగఁ
గిరియును గిరియు సాగరము సాగరము
హరియును హరియుఁ బూర్వాపరాగములు
పొదివిన కరణి నేర్పునఁ బోరుసరణిఁ

గదియుః చందమున డగ్గఱిన యందమున
మల్లయుద్ధముననే మఱికయయ్యెచ్ఛ
భల్లభర్తయుఁ బంచభల్ల కర్తయును
నిరువది యొకదినం బీరీతిఁ బోర
హరి దృఢతరకరాహతులకు జడిసి
వక్రారి వనశుక్ర వంచిత శుక్ర
విక్రమధామ త్రివిక్రమ స్వామి
ప్రతిలేని గతి నిరువదియొక్కనాఁటు
క్షితిప్రదక్షిణము సేసితినింతయలయఁ
గందువు వంక్తికంధరునితో మున్ను

బంధురగతి నెదుర్పడితినే జడిసియుఁ
బరుఁడు గాఁడితఁడజ భవముఖులకును
బరుఁడై నయల పరాత్పరుఁడుగా నొప్పు

నని తలపోసి పద్మాక్షుని డాసి
వినతుఁడై భల్లూకవిభుఁడు కేల్మోగిచి

(గోమూత్రికాబంధము)

కమలేశ నరహరి ఖగరాజగమన
................
కరుణాకటాక్ష శ్రీకలితోరువక్ష
పరమయోగీశ హృత్పద్మ దినేశ
యపరాధి నపరాధి నని పొక్కి స్రుక్కి

కృపణుఁడై శౌరికిఁ గృపబుట్టఁ బలికె
తమ్ములై మెఱుఁగు ముత్యమ్ములై శోభి
తమ్ములై బెళికెడు తళుకుఁ గన్నులును
దామరై కళలకా దామరై శీత
ధామరై శాంతి నెంతయునొప్పుమోము
గొప్పలై యొప్పుల కుప్పలపై పసిఁడి
తిప్పలై నిగ్గులు దేఱు పాలిండ్లు
సన్నమై మేఖలాసన్నమై గగన
మున్నమై నొప్పుచునున్న నెన్నడుము
చక్రమై సొంపగ స్వచక్రమై విలస

వక్రమై చెన్నొందు వలుద పిఱుందు
రంభలై మోహనారంభలై కాంతి
కుంభలై యొఱపులు గుల్కునూరువులు
మించులై పవడంపు మించుతలిరుల
చంచులై యొప్పెడు చరణముల్గలిగి
మరుమోహనాస్త్రంబు మాడ్కిఁ జెన్నొందు
తరళతోయజనేత్రి తనదు సత్పుత్రి
వరరూపవతి జాంబవతి యనుకన్య

సిరికూర్మి మగనికిచ్చిన సంతసించి
మామనొవ్వాలు దీర్చి మన్నించి చంద

మామయర్మిలి బావ మహనీయ బిలము
యత్నంబు సమకూరెనని వేడ్క వెడలి
రత్నంబుఁ గామినీరత్నంబుఁ గొనుచు
ద్వారక సౌధాగ్ర తారకసొచ్చె
నా రమాపతిఁ జేరి యాదవోత్తములు
రవి దేరఁ గొన్న సారసరాజి రీతి
ధవళాంశుఁగన్న యుత్పలముల రీతి
గంటిమె కృష్ణులోఁగలఁ కలువీడఁ
గంటిమనుచు వేడుకలఁ జొక్కుచుండి
రరసి తద్వాసనలవియ చెప్పెడిని

సరసాంగి నడుమాక సంబొటనట్టు
లరుదు మించిన సొమ్ములవియ చెప్పెడిని

..........................

కామిని పిరుఁదు చక్రంబొట నట్టు
లాముద్దు వట్రువు లలియె చెప్పెడిని
లేమయూరులు కదళికతొటనట్టు
లామోహనపు బొగులవియ చెప్పెడిని
అని కొని యాడంగ యాదవువిప్ర
జనమును గీర్వాణజనము గీర్తింప
రామతో జయరమారామతోఁ గూడి

రామానుజుఁడు నగరము ప్రవేశించి
తనదు మాతకును దాతకును భ్రాతకును
వినతుఁడై సభలోన విభుదులు గొల్వ
నన్ను సంగడినుండి వారి యింతచేసె

నన్ను సత్రాజిత్తు నటకురప్పించి
యకలంకుఁడగు శౌరియాదులు వినఁగ
సకలంకుఁడైన యజ్ఞనపాలు ననియె
బంధుఁడై కొండంత బలఁగంబులోన
నిందించి ఛేటికి నిర్నిమిత్తముగ
హరినాదు రత్నంబు హరియించె ననుచు
సరిచుట్టములకెల్లఁ జాటి చెప్పితివి
అడుగు మివ్విధము నీయర్మిలి యనుజు
నగుడు ముందరిచొప్పు లరయుమీవారిఁ
గారులాడెడువారు కారుమీవార
లూరకమమునాడ నుచితమే నీకు
ననిమాని కమ్మకొమ్మని మీఁదవై చెఁ
బెనగొన్న సిగ్గుతో బెగడొంది యతఁడు
యోగివంద్యుని నీతి యుడిఁగి మిథ్యాభి
యోగిఁ జేసిన పాపయుక్తుండ నేను
నీపాటియని పారమెన్నంగ రాని
యీపాప మీఁకఁ బాపనెవ్వరు గలరు
అని వంతచింతయు నంతంతఁ బొదల
తన యింటికేగి నెంతయు నూహ సేసి
యరయ సర్వద్రోహినైన వాక్రుచ్చి
శరణన్నఁగాఁచు నబ్జదళాక్షుఁ డనుచు
నీలంపు రంగులో నికరంపు కప్పు
బాలేందులోపల పసపట్టునొసలు
వలరాజువిండ్ల జీవాళముల్బొమలు
కలువలలోని చొక్కములు నేత్రములు
మెఱుఁగు కెంపులలోని మిసిమి పల్వరుస

# అష్టమహిషీ కళ్యాణము

చిఱుత వెన్నెలలోని చిక్కని నవ్వు
పసిఁడి సంపంగిలో పలిత్రాణనాస
రసముల చిగురు సారసము కెమ్మోవి
శ్రీకారములలోని చెల్వైన వీను
లాకంజనమితి మోహనము నెమ్మోము
ఒసపరిసంకున యొసురుకంఠంబు
పసిఁడి తీవలమేలు పట్టు బాహువులు
మేఁటి జక్కవలలో మీటుచన్దోయి
తేఁటి దాఁటులమీఁది తేటనూగారు
గగనంబుఁబోపలఁ గలమేనునడుము

జిగిమీఱు పులినంబు చెలువంబు పిఱుఁదు
మించు రంభలలోని మెఱుపులు తొడలు
మంచి తామరల మర్మములు పాదములు
నని మెచ్చఁదగు నవయవములనొప్పు

# 3. తృతీయ పట్టమహిషి

## శ్రీ సత్యభామాదేవి వివాహవర్ణన ప్రసంగము.

ననుపమనుత ధామయగు సత్యభామ
యను కన్యకామణి నామణినపుడు
కొని శౌరిఁ జేరి నూల్కొను భీతితోడ
ధరసాగి మ్రొక్కి హస్తంబులు మోడ్చి
కరుణాకలాపాంగ కమలాంతరంగ
యనఘ శరణ్యా నాయపరాధ మెడయ

వనితాశిరోమణి వనజాప్తమణియుఁ
గానుకగా నీవు గైకొమ్మటన్న
నాననజితసోమయగు సత్యభామఁ
గొనకొన్న ప్రేమచేఁ గొని సంతసించి
దనుజేంద్రజిత్తు సత్రాజిత్తుఁ జూచి
యీ వేళమాణిక్యమే నొల్ల నాకు
నీ వధూమాణిక్యమే చాలుననుచుఁ
జతుర వాచామృత సారంబుచేత
నతని శోకాగ్ని చల్లార్చెనంతటను
బలుఁడు పురంబు దర్పణచామరాది

లలితంబుగాఁగ నలంకరింపించె
బలరామునాసతి బలసహోదరుఁడు
సలలిత మంగళస్నానంబుఁ జేసి
చుంగులై కాఱు మించులఁ గెరలించు
బంగారురెంటెంబు బాగుగాఁ గట్టి
యూత్తత మణిమయంబై సూర్యకోటి
రీతిఁ జూపట్టు కిరీటంబుఁ దాల్చి.

రత్నాకరాత్మజా రత్నానుజన్మ
రత్నసంకలిత హారంబులు పూని
కడిమోనిపూబాసికము సవరించి

నడి వివాహుండు వివాహ మంటపము
నడుమ శోభిల్లఁ గాంతాజనంబపుడు
తడయ కెంతయు ధళధళలుట్టిపడుచు
నాణెంబులగుచు విన్నాణంపు వగల
రాణించు చీనాంబరంబులు గట్టి
నామము౯ రాచ యందముగఁ జేలోజు
మామకోయనియను మానింపఁ దీర్చి
మెఱయు చక్కెరవింట మెదలుతుమ్మెదల
దరము క్రొన్నెఱులు బిత్తరముగా దువ్వి
సిరులఁ జూపట్టు బాసికములు గట్టి

సరస రత్నముల సూసకములమర్చి
ససువత్తనగవుల సయ్యాటమాడు
నొసపరినెమ్మోము నొకకొంతవంచి
జిలుఁగుమేలతికల చెఱఁగు లల్లాడ
నలఘు శోభనవతియగు జాంబవతిని
హసితనిర్జిత భామయగు సత్యభామ
నసమానలగు చెలులటకుఁదో తేర
నపుడు సత్రాజిత్తుఁ డాజాంబవంతుఁ
డపరిమితానందులగుచుఁ బూజించి
పంకజాక్షుల మధుపర్క పూర్వముగఁ

బంకజాక్షునకు శోభనవేళ నొసఁగ
నెలుఁగెత్తి నిజపురోహితుఁడు సువ్రతుఁడు
సలలిత మంగళాష్టకములు చదువఁ

దీరమగు ప్రేమనత్తెఱనిక్కి విప్ర
వరులుదీవెన విప్రవరులు చెలంగ
తళుకు చూపులకల్వ దండలొండొరుల
గళములఁ దగిలి ప్రకాశింపుచుండఁ
గదిసి ముఖావలోకనములు జేసి
అదనుతో విష్టుఁడగు విష్ణుఁడంతఁ
తొలి తొలి నాల్గుచేతులు దోయిలించి

పొలుపొంద నవరత్నములు ముంచి మించి
కలహంసికా యుగ్మకము చెల్వమొదవు
తలిరుఁ బోఁడుల మీఁదఁ దలఁబ్రాలునించె
నపుడు దోయిళ్ల గన్యామణుల్మణులు
నిపుణతనించి శ్రీనిలయుపైఁ జెలఁగి
కచభరంబులు వెనుకకు వీఁగనచల
కుచకుంభములు ముద్దు గునియంగనిక్క
తలఁబ్రాలునించి రత్తఱిమరువాడి
చిలుకు చూపులు ముద్దుఁ జిలుకు భామినులు
చిలుపగాలికిని గెంజి గురులు బెళుకు

చెలువున మోవులు చీమంతకదల
శుక పిక నికరంబు బోడుగాఁ గూడి
సుకుమార గతిఁ బల్క సొబగు దీపింప
బిసరుహాక్షుని కూర్మి పేర్మి వర్ణించి
పసమించ శోభనాల్పాడిరీ రీతిఁ
గన్యకామణుల నాగమవిధి నబ్ధి
కన్యకాధవుఁడు లోకములు గీర్తింప
పరియించె గీర్వాణవరులు భూవరులు
వరనుతుల్సేసిరి వసుమతీసురులు
అతిమోదమున వివాహంబును గోరి

సుతులకు శౌరిసంస్తుతలు నేర్పుచును
ప్రాకుపండ్లూడి వెల్వడఁగ నేత్రములు
చీకిలింపుచుదిట్ట చేతులు సాచి
పనస చక్కఁగఁ జెప్ప పనసయటంచుఁ
దనయ శిష్యులకు వేదముఁ జెప్పికొనుచుఁ
జెవినెట్టి పోఁగు దాల్చిన వారినెల్లఁ
దవిలి వేఁడుచు నక్షతంబు లిచ్చుచును
గ్రాసమిప్పింపుఁడు కాదేనియొక్క
కాసైనదానమీఁ గదరేయటంచు
బడుగులై దుగురొక్క పౌఁజుగాఁ గూడి

పదరి యందలములో పలివానినైన
లోఁగక పల్లకిలో వానినైన
పీఁగక తుంపురులౌ డలంగఁ బెద్ద
యెలుఁగున నడిగి వారిచ్చినందులకు
నలయపాళ్ల కును దిట్లాడంగవారి
సతులంత పతులతో సహభోజనములు
మతులఁ గాక్షించి సమ్మతుల నొండొరులు
అచ్చికూచక్క వోయకు మంచి మంచి
యచ్చావధానుల యక్కచ్చిలచ్చి
అచ్చిబూరెల బుచ్చి యందఱుమీరు

వచ్చెదరే మన వారందఱెప్పు
డాయెడ వారివివాహంబును గోరి
పోయిరే మనమును బోవలెన్నగును
పప్పునేతులు పెరుగు బంతులు బట్టి
గుప్పదు రట్టేని కూరొక్కని త్రావ
సారంపు వాసన సగుడ్డమైనట్టి
వారినెవ్వారి నెవ్వారికోనైన

చాఁపట్టులును బాయసము సొజ్జి బూరె
లోఁచినవారల కోఁపంత కొలఁది
కలలోన గంజియే కాని మాయత్త
పిలిచి యొకింతైనఁ బెట్టదన్నంబు
సడివచ్చెననుచు వేసరియప్పి గాని
పడువునాహాఁడ యింత పంతంబు వెట్టె
తడిలేని త్రావుడు త్రాపంగఁ జంటఁ
దడిలేదు పాపఁడు ధరియింప నీఁడు
తడవేల కుడువఁబోదమురారె యొడలు
కడిగికోఁగదరె యొక్కై కలారనుచుఁ
దాలికల్గట్టె చెంతలఁగొంత జాఱి
ఫాలముఁల్వచ్చగాఁ బసుపులు పూసి
దళముగా నవ తైలధారతో మెదిచి
వెలయఁ జెంద్రపు బొట్లు వింతగాఁ బెట్టి
పచ్చనక్షతములాపై నిడిగచ్చు
విచ్చుటాకులు వెడవెడఁ జుట్టి తాల్చి
కాటుక కన్నులఁ గలయంగ నలఁది

. . . . . . . . . . . . . . . . . . .

బలువిడి నెఱికల బారగాఁ దివిచి
నులిచిన పెనుబొగ్గు నూళులువైచి
పాడువారినయట్టి పల్లవెంట్రుకలు
కూడ దువ్వచునులి కొప్పులు వెట్టి
కడుముదుకగు చాయగల చీరలెల్ల
ముడుకులనొరయంగ ముఱియుచుఁ గట్టి
చతురాస్యుడాస్య రసంబుల నిట్లు
లతివలఁ గావించె ననిజనుల్వొగడఁ
గన్నబిడ్డలను జంకలఁ బెట్టిమున్ను

మున్ను చెంతలఁ బెను మూకగా నడువఁ
గుసిగుంపు నడకల కోడెబాపెతలు
అసమాన గతివచ్చి నావిప్రవరులు
సతులతో సుతులతో జాడ్యంబు దేఱు
గతులతో రుక్మిణీకాంతుని జేరి
కరములు చూఁచి యాగమములు చదివి

హరి నీకు వేదోక్తమాయుష్యమస్తు
కంటగించని నీదు కల్యాణ మహిమ
వింటెమి మునుపని వింటిమీ వేళ
కృష్ణయొద్దుననుండి కృష్ణమాయాత్మ
తృష్ణ దీర్చె దవని తివిరివచ్చితిమి
పూనిన కార్పణ్యముడుగు సువర్ణ
దానంబు పరమాన్న దానమిప్పింపు
వరదుఁడవీవయీ వలయును గాక
యరయనన్యుల కీయ నలవియే కృష్ణ
యన విని హరి నవ్వి యారీతి విప్ర

జనములకెల్ల భోజనము గావించి
భూరి రత్నాంబర భూషణావలులు
భూరిగా నొసఁగి యప్పుడు వీడుకొలిపి
నీల నీలాం బుదనిభ దేహుఁ డపుడు
బాలేందుసమ ఫాలబాలలతోడ
సమరభూపాలంబు చయ్యన నెక్కి

..................

ధరదివ్య భేరివాద్యములు వాద్యముల
యురుతర ఘోషంబు లుడువీధిఁ బొదువఁ
గమ్మవిల్కాని శృంగారంపు తరువు

కొమ్మలోయన నొప్పుకొమ్మలంతంత
నురుతరాయత నేత్రయుగళ భావంబు
అరవిందముల మాయ నారతులొసఁగఁ
బురవీథినేగ గోపురవరభ్రాజ
తరుణు లానతులఁ సౌందర్య మీక్షించి
ఘననీల ఘనమిరుఁ గడలఁ జూపట్టు
మినుకైన క్రొక్కాఱు మెఱుఁగులో కాక
లలితేంద్రనీల శైలముల పార్శ్వముల
దలుకొత్తు కనక లతాయుగ్మకంబొ
గట్టిగా నడుమునఁ గాంచనాంబరుఁడు
చుట్టు బంగరుదట్టి చుంగులోయనఁగ
నలినాయతాక్షు చెంతలనున్నయట్టి
నలినాయతాక్షులనలు వెన్ని మఱియు
మృగనేత్రనాతోడు మెలఁతుకకొప్పొ
గగన నీలిమకన్నఁ గప్పొనొకాదొ
యన మఱియును గొప్పులట నివ్విధమున
వెనుకకుమఱి విఱ్ఱవీఁ గంగవలదె
చెలియ నీగురునాన చెలువ నేత్రములు
కలువల కన్నఁ జొక్కులౌనొ కావొ
అవునే మఱియు గన్నులట నివ్విధమునఁ
గవగూడి తళుకులఁ గనుపట్టవలదె
కుసుమాంగి నీయాన కొమ్మకెమ్మోవి
కిసలయంబున కన్నఁ గెంపౌనొ కాదొ
యనర మఱియు మోవులట నవ్విధమున
వడిఁదేనెఁ జాటజోట వడియంగవలదె
నీకన్నులాన యన్నెలఁత కర్ణములు

శ్రీకారములను మించినవానొ కావొ
యతివ మఱియు వీనులట నివ్విధమున
జితనవసంజ్ఞలై చెలువందవలదె
అని పెక్కుగతుల నయ్యంబుజాననలు

కొనియాడ సౌందర్యగుణ హారి శౌరి
యలఘుశోభాకరంబగు పురంబెల్ల
వెలయంగ మెఱసి యవ్వేలఁ దులతోడ
సుముఖులై సుమనసుల్సుమవృష్టి గుఱియ
రమణీయ నిజమందిరముఁ బ్రవేశించి
యతుల యౌవనసీమయగు సత్యభామ
కతిమోదమునఁ బ్రసేనాగ్రజుఁ డపుడు
సానుజ తతులతో సఖులతోఁ గూడ
నామణినర్పించె నరణంబుగాఁగ
దేవతద్ధారుణీ దేవతల్పొగడ

దేవకీతనయుఁడెంతే వేడ్కనుండె
చటుల నిందా సర్వ సర్వారియగుచుఁ
గుటిల పాతక దైత్యకుల చక్రవర్తి
ధరమించునిట్టి చిత్రపు చరిత్రంబు
వర చతురతర కావ్యము సేయువారి
కున్నతోన్నత[illegible] నొకమాఱు పేరు
కొన్నవారలనున్నఁ గొన్నవారలను
తాపంబు లఖిలనిందలు చెందవఖిల
పాపముల్పోవును సంపదల్లెల్ల డాయు
కమనీయ గుణహారి కమలావిహారి

యమరారికటుల హరి [illegible]
గెంపు మించిన తనకుఁగీలాగి పెట్టి
సొంపుగానందుపైఁ జొక్కంబుచుట్టి

మెఱుఁగుఁ జుక్కల మిసమిస తేటలెల్ల
మఱపించు నవకుందమాలిక వైచి
యకలంకమై కెంపుటంచులు గల్గి
శుకవర్ణమైన యంశుకము ధరించి
కిసలయవాదనా కృతంబైన శ్రుతులు
మిసిమి యందంబుతో మించుకందంబు
కడు వెడఁదై చెన్ను గలిగిన వెన్ను
నుడురాజుపూర్ణ తనొందు పిఱుందు
నరుణాంశుధామంబులైన రోమములు
తరుణేందుమై మించుఁ దలపించుచుంచు
నలఘు తేజోజ్జ్వలమైన వాలమును
గలుగు నుత్తమ హయకంఠీరవమును
సంజోగ మొనరించి సాహిణియెదుట
రంజిలి నిలిపి పరాకంచుఁ బలుకఁ
దనసిటు కేలిచిత్తర పల్లెవాటు
గనుఁ గొని జనులు చొక్కఁగఁ బదాగ్రమున
నీరతుఁడై యంక వన్నియమెట్టి సర్వ
హారతురంగుఁడు తురంగారూఢుఁ డగుచు
నిండిన నిజకీర్తి నికరంబులనఁగఁ
బుండరీక ద్వయంబునుఁ జెంతనలర
నెలమి భూనాథులు హేమకాండముల
విలసిల్లుచుండెడు వీఁచోపులిడఁగ
కుడిసీరు బిందియ కుంచ కాళాంజి
యడపంబుగిండియు నందంపు సురటి
మొదలైన యూడిగములఁ దాల్చి కదిసి
పదరక చెదరక పరిజనంబరుగ
నతిభయావహ మహాహవభూ ఖురాగ్ర

హేతి కంపితారి కరాళింగరాళి
నరిశంభ భీకరుఁడగు నరుండెక్కి-
యురుతర గతుల రాహుతులతో నడువ
దేవ! హెచ్చరిక దై తేయారి! యనుచు
కేవిమైమున్న కట్టికవారునడువ
నలరు శంఖ ధ్వనులడరంగ దైత్య
కులవధూ గర్భార్భకులు రెంజితుంజి
యుటి ముటిమురువేపనా వాద్యగతులఁ
గుఱుచల నిడుదలఁ గూడి వాయింప
సన్నరొెటింగి యూసన్న కాళియలు

సన్నలోనుగఁ గూడి జమళిఁ బూరింప
యరి భీషణాకారియగు భేరిరవము
ధరనభోంతరము పాతాళంబు బొదువ
ఢక్కాహు ఢుక్కాది ఢమఢమ ధ్వనులు
దిక్కులు నిండి యెంతే భోరుకలఁగ
కడిఁది హెగ్గళ్లు హెగ్గడికత్తియలును
బడిబడివడి బరాబరి సేయుచుండ
వాలుఁ గన్నులు రాణి వాసములార్చులు
కీలుచుమ్మల పల్లకీలెక్కియరుగఁ
గనకభూషల పటికలనంబువారి

ఘనతర వస్తుసంఘములచే మిగుల
నలరుచు వెక్కసం బగు బొక్కసంబుఁ
బలువేసడంబులు భరియించినడువ
: నమృతాన్నవర కాంక్షితాధరబింబ
రమణులనగు వారరమణులే తేర
రాజులు భటవీరరాజులుఁ గొలువ
వాజిదాఁటించి భావజగురుండప్పుడు

కేలవాగియ చక్కఁ గీలించి కుదిచి
తాళముల్ద్రొక్కించి దాఁటి యాడుచును
జోడనఁ గొనిపించి సొగసుగాఁ జుట్టి
వేడెంబు వడినడ్డ వేడెంబు ద్రోలి
నిగుడంగఁ గుఱుచల నిడుదలనూకి
మగిచివై చుచుఁగేల మస్తరించుచును
పొడకట్టి జనపదంబులు నదంబులును
కడతెంచి పోయి పంకజలోచనుండు
వృషభజిద్వ్యాది విస్ఫూర్తి గలిగి
విషధరోత్తంస నివేశంబు పోలె
వరుణ కౌశికముఖ్య వర్ణితంబగుచు
వరుసనెన్నఁగ దిశావలయంబు పోలె
ఘన పద్మపత్ర ప్రకాశత కలిగి
గనుపట్టు గగన మార్గంబునుం బోలె
నందమై నిరతిశయానందమొసఁగు
బృందావనము గల్గి పెంపొందువనము
కనుఁ గొని సొత్తెంచి కాంతలుఁ దాను
వనకేళిఁ దవిలి యవ్వసుదేవు చూలి
కమ్మగా వాసనల్గ్రమ్మఁగా నొక్క
కొమ్మవూఁ గొమ్మగై కొమ్మనిమ్మనఁగ
మంజీర కుచయోర్తు మంజుల కుంజ
మంజరులొసఁగ నమ్మాధవుండలరి
విరిమొల్లనొల్లను వెలఁది నీచన్ను
విరిగుత్తులే నాకు వేడుకయనినఁ
గడివాని తీఁవులు గలుగు నెమ్మోవి
వడఁతి యొక్కతెదొండ పండుచేనొసఁగ
బింబమే నొల్లనో పికవాణి యధర

బింబమిమ్మని చేరఁ బిలిచెఁ గృష్ణుండు
మఱికొన్ని యెడలనే మఱియున్న చిఱుత
యుఱుతలఁ దఱుముచు నువిదలొండొరులు
ఇత్తమా శౌరికి నిత్తమాలములు
హాత్రియూ పికముల నందందబట్టి
నాగకేసరమేల నాగకేసరుగ

నీగు బాగులుమాని యీఁగదే యమ్మ
యతిసౌరభంబైన యతిసౌరభంబు
తతిపూచెఁ గంటిరే తరళాయతాక్షి
నాగేంద్రగమన పున్నాగంబు సుమము
లాగడంబులు మాని యందికోఁ గదరె
దవనంబు ఘనశారద వనంబు చూడ
దవళాక్షిమైఁ జల్లఁ దావిచల్లెడిని
నని యిట్లు చతురవాక్య ప్రౌఢి నెఱయ
వనకేళి సల్పి జీవనకేళి సల్పఁ
దలపోయ శౌరి వైదర్భియాదిగను

గలకలకంఠులు కదిసి వేనడుమ
నాకీర్ణ కోకిలకానీక పుండ
రీకవర్గముఁ జంచరీక వర్గమును
సముల కారండవ హంస గాంగేయ
కముల విస్ఫూర్తి యుంగముల విస్ఫూర్తి
తావిజొంపములతో దరులఁ జానొందు
మావుల వెడవిల్తు మావులు గలిగి
వర కేకి పిక మధువర నినాదములఁ
గరమొప్పుచున్నట్టి కమలాప్త తనయఁ
జేరి బిత్తరివగ జిలుగు పుట్టములు

సారసలోచనల్సవరింప హారియు
వాలారుచుంగు క్రేవలనాడ మడుపు
తాళిగోణంబు వింతలుమీఱఁ గట్టి
మంచు నీరును గుంకుమము మేళవించి
నించినయొక మంచి నేత్రంబు పూని
సుకుమారముగఁ గళ సోఁకంగనొక్క
సకియ మెఱుంగారు చనుదోయిలైవ
నానలోనాన నానాగేంద్ర యాన
దానవారికిని హస్తము మాఁటుఁ జేసి
చొక్కపుతావులఁ జొక్కవేరొక్క
లక్కకుప్పియవైచి లాఁగించి మఱియు
ఘనసార మృగమద ఘనసారజలము
కనక శృంగముల వేడ్కలనించి సతులు
జలజాక్షుమైఁ జల్లి చల్లించికొనుచు
నలరుగుత్తులవేఁటు లాడుచు మఱియు
నలినాక్షుతోఁగూడ నళినలోచనలు
కలయ వసంతమీగలి నాడియాడి
కుంకుమపంక సంకుమద మృగాంగ
సంకులాంబువుల నచ్చటఁ దొప్పఁదోఁగి
యలపెల్లఁదీర నాయమున నాయమున
జలకేళి మనమింక సవరింతమనుచుఁ
గిసలయాధరలు కేకిసలనాదరులు
నసమానగతుల రాయంచలఁ బట్టి
సారసంబులఁ బట్టి సరసజానొందు
సారసంబులఁ బోఁపి సరసమాడఁగను
బహు కరేణులతోడ భద్రకుంజరము
విహరించుగతి శౌరి విహరింపఁ దొడఁగె

కమనీయగతిఁ దరంగంబులు సాఁచి
రమణీయ రమణుల రాసిపోనీక
యొఱపులఁ దిట్టుచు నోలఁ బెట్టుచును
దఱుమఁ బెట్టుచు వడిఁదరులు మెట్టుచును
సరలి నారాయణ శబ్దార్థమనిన
నరులతోఁ దెలుపు చందముగ శోభిలఁగ
నొకలేమఁ గని యొకానొక మోహనాంగి
చికిరి నవ్వులఁ జేరి చేయి బట్టినను
జేలఁ గట్టఁగ నన్ను సెలసి పట్టెదవు
మేలమో యిది మంద మేలమోయనుచు
మెండుతుమ్మెదలతో మేకులు జేయు
పుండరీకములన పూఁ బోణివైవఁ
దరుణులు మెచ్చ నాతరళాక్షి వెనుక
మరలఁ దామరలఁ దామరలవైచినను
వెండియు నీలాహి వేణులుద్దండ
నొండొరుల్దమలోన నుద్దించికొనుచు
జడియ కుంచలను గొంచలను గిట్టుచును
నడిచి మీనముల ఫేనములఁ బట్టుచును
దోడరి చెందొవల కందువుల వైచుచును
గడిఁగి చక్రముల చక్రములఁ బోఁపుచును
అలమోముదమ్ముల కచటితమ్ములకు
నెలకొన్న నగవు వెన్నెల వింతలనఁగ
నలకభృంగములకు నచటిభృంగమ్ము
లలవిమీరిన భ్రమోంత లవియెవింతనఁగఁ
జనుజక్కవలకు నచ్చటి జక్కవలకు
ననయంబుతాయని యదియెవింతనఁగ

నొప్పునంగములతో నొప్పు లతాంగ
లప్పంకజాక్షులా యమునలో వెడలి
చుట్టు బవంతులఁ జూపట్టు పట్టు
పుట్టముల్గట్టి యొప్పుగనుఁగై సేయఁ
గనకాంబరుండు గనకాంబరాది
ఘనతర శృంగార కలితుఁడై యపుడు
కుంద లామంజక కుటజ పున్నాగ
నందదిందిందిర నలిన గుచ్ఛముల
ఆవేళకాలాంత రాంతరంబునకు
కుంతీతనూజు దోడ్కొని శౌరియరిగి

. . . . . . . . . . . . . . . . . .

పసిఁడి కుండలమూఱు పఱచు పాలిండ్లు
కుసుమాంగి యొత్తు చెక్కులడాలు మెఱయ
సలలితరేఖఁ గంచము పట్లు చేసి
వలిపె దుప్పటి నిజావడమీఁదఁ బఱచి
యరవిందమిత్ర బింబాకృతి ద్యుతులఁ
బరఁగు పళ్లెరమందుపైఁ బొందు పఱచి
నిగనిగమనెడు వన్నియల గిన్నియలఁ
దగఁ గ్రమం బెఱిఁగి చెంతలఁ బాదుపఱచి
యుంబళ విరళంబులకు నూత్నరత్న
కంబళములఁ బొందుగానంద పఱచి
యూవెడ హరిఁ జేరి యారగింపంగ
నాయత్తమనుఁడుఁ గంజాయతేక్షుండు
ఉరుతరంబైన వేఱొక్క పాత్రమున
సరస మారుతజన్ము సహజన్మునుంచి
తన పట్టమహిషులుఁ దాను నచ్చోట
నొనర నాసీనుఁడై యుండె నంతటను

31.

దెలితెక్కపులుఁ గులఁ దెగడెడునడలు
గల సతుల్పాత్రముల్గరములఁ దాల్చి
కంకణ ఝణఝణత్కారముల్వివిధ
కింకిణి కిణకిణత్కృతులతోఁ బొలయ
పొడవడిరాలుచుఁ బొదలిన రుచులు
గడుఁ బ్రకాశముగల కలవంటకములు
ముప్పిరి సంభారముల మించినేతఁ
జొప్పిల వగ్గళించిన తాళిదములు
పరిపక్వమై దొరబాటికన్నులకు
నురుదైన తురుఁగులు నప్పడంబులును

నటులైన బేడల పగిదినేయొప్ప
పటుతర మృదు సూపముల సూపములుఁ
గ్రమము తప్పక పచ్చగందక తెచ్చి
యమృతోపమానంబులైన శాకముల
రాజరాజర్ధాను రాజుల మించి
రాజమాన్యములైన రాజాన్నములను
నంబుజ మోదంబులై నవకుంకు
మాంబుధారల రీతులైన నేతులును
మరిచ జీలక్ర కొత్తుమరి మిరియముల
మెఱయుచు రుచులచేమించు చేరులును

దిరమైన యొప్పులఁ దేరుచు దేవ
పరమాన్నముల సజ్జ పరమాన్నములును
జలలగాబూపు వాసనగట్టి తెచ్చి
వల్లగట్టిన రసావళ్లు నంబళ్లు
నిరమైన చవినోటఁ నిడినంతతోన
కరఁగునో యనవొప్పు కజ్జాయములును

గడలేని రుచుల మీఁగడ పెరుఁగులను
...................
రవరవ గాఁగప్పు రవగూడి సొంటి
లవయుక్తమైన చల్లని మజ్జిగయును

నడనీరు నెడనెడ నింపుసొంపైన
కుడిసేరు వేరుసఁజేకొనుచు వడ్డింప
సరసిజాక్షులుఁ దాను సరసిజాక్షుండు
సరసభావముల నీసరణి భుజింప
నంబుజ శశివాసితాంబుల జీవ
నంబుచేఁజే మజ్జనంబు గావించి
గారవంబున సారకర్పూర పూర
చారు వీటికలెల్ల జనులకు నొసఁగి
యొకకొంత తడవందునురు సౌఖ్యకేళి
వికచాబ్జముఖులతో విహరించియంత

కమలారి బింబరాగంబుమై పసలు
తెమలించు నిండు చంద్రిక దట్టిగట్టి
శ్రీరామచంద్రుని చెలువు దీపింప
నారూఢ కోదండుఁడై ప్రకాశించి
సకలసైన్యంబు నచ్చటనుంచి పార్థుఁ
డొక్కఁడు దానొక్కఁడు వేఱొకచోటి కరిగి

(భ్రమకము)

వరకు తాల నవనవ నీలతాకురవ
కరక సారస కనక సరసాకరక
కలదర వీరక కరవీర దలక
కలకద వాసి కకసి వాసిదలక

తరుముఖ్య వివిధ లతా వితానములఁ
గరమొప్పు నొక మహాగహనంబు సొచ్చి

## అష్టమహిషీ కళ్యాణము

కరిణుల హరిణులఁ గరుల సూకరుల
శరభ శార్దూల పుంజములఁ జెందుచును
లీలవైఁ గన్నియలేళ్లఁ బూరెళ్లఁ
దోలిపోసికయే దులను గైదులను
వడిసూఁడి పట్టి యవ్వాలను గవ్వాలను
గడపుచువేఁట నీ క్రియఁ జల్పు వేళఁ
దలఁచైన పికిలి పూఁదండలనొప్పు
నొఱము గుబ్బలలోఁడ నొఱయుచునుండ

నొఱపులు చిల్కఁ బిట్టులుఁ కన్గొనలఁ
జెఱుత వెన్నెల తేట చిందఁ గన్గొనుచు
పుష్పాడిపొడల యొపుల చన్నుఁగవలు
గప్పనేరక శౌరిఁ గన్గొను వేడ్కఁ
సమరంద గణగణ సంశోభితాధ
రములపై దంతగౌరత తేజరిలఁగఁ
గోకిలములు కేరిగొణఁగు చందమునఁ
బికము చందముమాట బిల్చుచెంచెతలు
కందర్పునను నాది కందర్పుఁ డగుచు
ముందరనున్న యమ్ముర్రవైరిఁ జూచి

మదకరి మద సంకుమద మృగమదము
లుదుటైన డేగలనోరణంబులును
గానుకలొనరింపఁ గైకొని వేడ్కఁ
లానవేషిన్న పాయమున నాయమున
దతులనాపూరి నెత్తముల మొత్తముల
గరిమ గోగణములఁ గాచుఛందములఁ
గ్రీడికిఁ దెల్పుచు క్రీడింప శంప
జాడల [illegible]

శశికాంత శిలమీఁద శశికాంతమించి
శశిబింబ ముఖిమూర్తి సరసభావముల

హరిమూల ములనవ్వునవి పంక్తి నెఱియు
నరిపదాధిక్యంబు నలరెడుతురుము
జలజంబు తెగఁబేడ సలబెళుకులును
గలువల సోఁగయుఁ గలకన్నుఁ దోయి
యమరెడువట్రువ యందంబు మెఱుఁగు
కమలంబు తావియుఁ గలుగకమ్మోము
తలిరుమై జిగికి పంచదారలో మేలు
కలిత బింబము కెంపుఁ గలిగినమోవి
పూఁ గొమ్మబిగి బిసముల జిగితేఁత
తీగెల సొబగు వర్తిల్లు బాహులును

గొండల పొడవు పూగుత్తుల మురువు
మిండ జక్కవ నీటు మెఱయు పాలిండ్లు
సైకతముల నవ్వు చక్రంబు బటువు
నాకేభ మస్తకోన్నతిగల పిఱుఁదు
కరితుండముల తీరు కరభంబు బాగు
సరస రంభలనిగ్గు సవరించుతొడలు
కమలకోమలతాలాక్షారక్తిమంబు
విమల కూర్మాకృతివెలయు పాదములుఁ
గలిగి యాకలశాబ్ధికన్య చందమున
విలసిల్లుచుండునా వికసాబ్జనేత్రఁ

గని శౌరి గోరిచొక్కచొక్కఁగ భావభావ
మనువొందఁ దెలిసి యయ్యమరేంద్ర సుతుఁడు
కమ్మవిల్తుని తల్లిగతినున్నకొమ్మ
యమ్మ నీవెవ్వతెవనిన నాచెలువ

# 4. చతుర్థ పట్టమహిషి

## శ్రీ కాళిందీదేవి వివాహ వర్ణన ప్రసంగము.

యేను గాళిందిని యను కన్యఁ గన్యఁ
గాను శ్రీపతి పతిగాఁ గోరి యిచట
నున్నతిఁ దపము సేయుచునుంటినన్న
మిన్నంది కృష్ణుండు మెలఁత నీక్షించి
యాతపంబునఁ జేయు నాతపంబెల్ల
నాతిసికొనఁ గూడె ననుఁగూడుమిప్పు

డనిశంబు భర్తగానాత్మనీవెన్ను
వనమాలినేనయో వనజాప్తపుత్రి
యనుచు నూదార్చి యొయ్యననెదఁ జేర్చి
ఘనతర కుతుకాబ్ధిఁ గడునోల లార్చి
కమలాప్తుఁ డప్పుడు కమలాప్తు కూర్మి
కొమరితఁ దోకొని కొమరు దీపింప
మును వసించిన వనమునకేఁగుదెంచి
యనుపమ సకలసైన్యంబులు గొలువఁ
పౌరులునల నాకపౌరులుఁ బొగడ
ద్వారకాపురికిఁ దీవ్రనేగుదెంచి

వరమణిమునులాది వస్తుసంతతులఁ
బురముకై సేయించి పురమెల్లఁ బొగడఁ
బాండవేయుల సర్వ బంధుజాలముల
వెండియుఁ బిలిపించి విభవంబు మెఱయ
వేదోక్తి వేదవిధు లాచరించి
యాదేవదేవుఁడ డత్యాదరంబొదవఁ
జారు ప్రసూన కాంచనచేల గంధ

భూరి భూషణగణ భూషితుండగుచు
శ్రుతులు ఘోషింప సంస్తుతులతో నాక
పతులు గంధర్వదంపదులుఁ బాడంగ

హరిపిత దేవకి యాదవుల్ధాము
హరిరాణిఁ గొనివచ్చి యర్థిఁ బూజింప
ఝల్లరీ కాహళీ శంఖ మృదంగ
వల్లకీధ్వనులు దిగ్వలయంబుఁ బొదువ
దేవకీతనయు డెంతయు వేడ్కతోడ
వైవాహికోత్సవావని నొప్పుచుండె
నహిశాయి తనయల్లుఁడయ్యె నటంచు
మిహిరుఁ డప్పుడు కడుమిన్నంది పొంగి
గ్రహమండలముఁ దారకా మండలమును
బహు మౌనిపతులు సంభ్రమమునఁ గొలువ

ఛాయానువృత్తి నిచ్చలుఁ గూడియుండు
ఛాయతోఁ గూడ నచ్చటి కేగుదెంచి
తరుణిఁ బుల్కడిగిన దర్పకాస్త్రంబు
కరణిఁగైసేసి చెంగటనొప్ప కన్యఁ
గనకాంబరుని పాద కమలముల్గడిగి
కనకధారా పూర్వకంబుగానిచ్చె
జలజాతమిత్ర సంజాత నీక్షించి
పలికిరి :మునివరప్రముఖులు చెలఁగి
సతిబొమల్గన్ను లెంచఁగఁదగున్మీన
పతులాటనో గురు భావంబు దాల్చి

తలపోయ నిత్యమూర్తంబైనక తనఁ
దనకొను పరమాణు తనువెన్నఁదగును
నీలంబు విబుధును నిత్యంబునగుట
బాలకీల్గొప్పు నభ్రంబనవచ్చు

నని వితర్కించుచు నన్యోన్యమిట్టు
లనుమానమును జెంద నంబుజాక్షుండు
వనజాప్తపుత్రి నుద్వాహమై బంధు
జలములఁ గనకభూషణములం దేల్చి
గ్రహములతోఁ గూడి గ్రహరాజముఖుల
మహితానురక్తి సన్మానంబు సేసి 6410
గణుతింపరాని సౌఖ్యములతో నభ్ర
మణిపుత్రికా సతీమణితోడఁ గూడి
జగములు జయవెట్ట జగదేకనాథుఁ
డగణిత శ్రీయుక్తుఁడై యుండె నంత

# 5. పంచమ పట్టమహిషి

## శ్రీ మిత్రవిందాదేవీ వివాహ వర్ణన ప్రసంగము.

రారాజుహితులుతో రంపుసంపదల
రారాజుఁ దెగడు ధరాధినాయకులు
విందానువిందులు వివరింపఁ గూర్మి
విందైనయట్టి గోవిందుఁడుండఁగను
గురునాయకుని కొఱకొఱ మాటలకును
హరిమేన భావనునాత్మఁ గైకొనక

కలకంఠి ముకురాస్య కంజాయతాక్షి
నలికులాలక బిసహస్త లతాంగి
హరిమధ్య గిరికుచ హరిచక్రజఘన
సరస రంభోరు కాంచనతూణ జంఘఁ
గిసలయపద వల్లకీవాణి దంత
హసితకోమలకుందయగు మిత్రవింద
యను పేర యనుజన్మ నాకామహీపాలు
ననుజన్మునకు నెంతయైన నీమనుచు
ధరమీఁదఁ గల్గునుదారభూనాథ
వరులు గూడఁగ స్వయంవరము చాటింప

నావార్త విని కృష్ణుఁడా మిత్రవింద
భావార్థమెంతయు భావించి తెలిసి
మాటలై సోఁగలై మించులై మిగుల
తేటగానొంటి ముత్తియములు దాల్చి
యేణాంకుమై చాయనెక సక్కెమాడు
నాణియంబగు ధాత నాధారియించి

32.

మృగమద కర్పూర మిళిత చందనము
నిగనిగపుటమైన నెఱిపూఁత పూసి
తరణి శీతాంశుల ధళధళల్గులుక
ధరచక్రముల నొప్పు తాళిఁగీల్కొల్పి

బంగారు పూవులఁ బచరించునట్టి
చెంగావి దట్టిగా సించి వింతగను
సొలపు గోణముచుంగు సొంపు జూపట్ట
వలిపంపు దుప్పటి వలెవాటు వైచి
కళుకుల ముద్దుటుం గరము గీలించి
వల కేలముకులపై వంకీలొలిడించి
కనుపట్టు నెఱకూడె కానితనంబు
తన సొమ్మెయనఁగ నెంతయు సొంపు మిగిలి
విహగేంద్రకేతన విలసితంబైన
మహనీయ నవరత్నమయ రథంబెక్కి

యమితబాలాన్వితుండై భానుకోటి
రమణ నవంతిపురంబున కరిగి
బహురాజ కోటీరపటు రత్నకాంతి
వహియించునా స్వయంవర భూమినుండ
నరుణు రాకకుఁ బద్మములరు చందమున
హరిరాక విని పొంగి యామిత్రవింద
జలజంబుతల క్రిందు సవరించినట్లు
జిలుగు దువ్వలువ పింజలు వాఱఁ గట్టి
నలువంద నెలవంక నామంబు దీర్చి
కొలఁదిగా నడుమఁ గుంకుమ రేఖఁ దీర్చి

రవికాంతులొలుకు పుర్ణాణహారములు
బవి దీర్చిన కర్ణపత్రముల్దాల్చి

యరవిందశరుని మోహన పాశవితతి
సరవినొప్పెడు పంచసరములు వూని
సిరిమించు నెఱుల కుచ్చెలమీఁద జార
మురవైన మెఱుపుల మొలనూలమర్చి
దివి శక్రధనువొప్పు తెఱఁగునుఁ గొప్పఁ
దవిలి చిత్రంపు పూదండ చెన్నొంద
లలితపుష్పిత కల్పలతిక చందమునఁ
గలితభూషణములుఁ గడుసొంపు మిగిలి

వాసుదేవునిఁ బోలువరుఁ గూడుమనుచు
నేసకొప్పున సతుల్సేసఁ బ్రాలిడఁగ
సతులింత నంత నెచ్చెరికలు సేయఁ
జతురంతయానంబు సరసమైనెక్కి
వాణి వాక్యప్రౌఢి వరియించు కీర
వాణులప్పుడు ధరావరులఁ జూపంగ
నరుదేర నరుదార నాయింతిఁ జూచి
ధరణీశులును బారతరళ లోచనలు
నలిపంక్తి రంగొత్తొయ్యాలి కప్పురంగో
నెలవంక మురువొయా నెన్నొసల్మరువో

కలువల మించో యీ కనుల మించో
జలజంబు బాగో యీ సతిమోము బాగో
శైలముద్దిరో యీ చన్నులు తీరో
నీలాహినలువో కన్నియయారునలువో
యనఁటులు మెఱుఁగో యీయుం కమ్ముల్మెఱుఁగో
దోనలువట్రువలో లేఁదొడలు వట్రువలో
తలిరుల సొబఁగో పాదంబుల సొబఁగో
తెలియ రాదనుచు నెంతేఁ జోద్యమంది

తూణంబు నెడలిన తోవయంప కాని
బాణంబొ వాని కృపాణంబొ యనఁగ

గరిసమూహము సొచ్చు కరివైరిపోల్కి
ధరణీశవరుల బృందంబు సొత్తెంచి
విందానువిందులు వెఱఁ గంద మిత్ర
విందకెంగేలరవింద లోచనుఁడు
పట్టి శతాంగంబు పైఁ బెట్టికొనుచుఁ
జుట్టి యున్నట్టి రాజులఁ బాఱఁబట్టి
పరమకీర్తి ప్రతాప ములతో సమర
వరులు మెచ్చఁగ ద్వారవతికే గుడెంచి
వేదవేత్తలు చతుర్వేదములు జదువ
వాదిత్రములు పెక్కువ గలఘూర్ణిలఁగ

నాగకామినులుఁ బున్నాగకామినులు
బాగుమీఱఁగను శోభనమువాడంగఁ
బటుతరాలంకార భరితుఁడై రత్న
పటల మండిత మంటపంబులోఁ జెలఁగి
సకల బంధువులు నిర్జరులుఁ గీర్తింప
నకలంక గుణబృందయగు మిత్రవింద
నిగమోక్త విధినిఁ బాణిగ్రహంబు
ఖగరాజవాహుండు గావించియంత
నాలేమతోఁ గూడి యంగజకేళి
దేలియెంతయుఁ బ్రమోదింపుచునుండె

అవనీశ పొన్నజిత్తను పేరఁ బరఁగు
నవనీధవుండు కోసలాధినాయకుఁడు
సురుచిరాకార సంస్తుత గుణోద్ధార
నిరుపమాలంకార నిర్మలాచార

# 6. షష్ఠ పట్టమహిషి

## శ్రీ సత్యకీర్తిదేవి వివాహవర్ణన ప్రసంగము.



నిత్యకల్యాణి వర్ణితసత్యకీర్తి
సత్యనావిలసిల్లు చంద్రబింబాస్య
దన తనూభవ వసుంధరఁగల్గి నట్టి
జననాథులడుగ నచ్చటి కేదుదేరఁ
గిలికిలాహాకృతుఁగ్రాలు
వాలుఁబోలెడునిడు వాలుఁగొమ్ములును

నంబుధితుంగ భంగాలోలకాల
కంబళాయతగళ కంబళంబులును
బంధుర విద్యుత్ప్రభా భాసితోరు
కంధరంబుల బోలు కంధరంబులును
సమధిక శైలాగ్ర చటులశృంగముల
రమణఁ జూప్పడు మహాప్రరములునుం గలిగి
బలిమి శంకరుగిబ్బఁ బడగిబ్బఁ జాలు
లలిమీఱునేడు మల్లరపుఁ గోడియల
నాజవరులకు నారాజు చూపి
యేరాజవరుడైన నీ వృషంబులను

బట్టి యొక్కటికినిఁ బైదామకమునఁ
గట్టి యెంతయు భుజాగర్వంబు నెఱపు
నట్టి విభుండు వోనరయనాకుమార్తె
పట్టి విభుండని పల్కుఁగ భూవరులు
నాయెడ వానితో నరిమురిఁ బోరి
పోయిరి కొందఱిప్పుడు జముపురికి

వేయైన నిదికాదు విడువుఁడంచుఁ జడిసి
పోయిరి కొందఱప్పుడు పురంబులకు
వారి శౌర్యములకై వడి విని దాన
వారి యాపనియెంత యని నవ్వుకొనుచు

వాలారుచంద్రిక వన్నియచుంగు
డాలువాటిల్ల మూడాసంబుఁ జుట్టి
తరుణారుణోద్దామ ధామసంతతులఁ
బురణింపఁ గెంపుల పోఁగులువెట్టి
యసమసాయకుని మోహాన తురంగముల
పసమించు పచ్చకబ్బాయి ధరించి
చుట్టు వజ్రంబుల సొబగు దీపింప
గట్టాణి ముత్తెంపు కడియముల్దాల్చి
తెలిమించు క్రొత్తముత్తెముల గెంటెములు
సొలుచునాణెంపు పట్టు పుట్టంబు గట్టి

యచలాగ్రమున నొప్ప హరి కిశోరంబు
రచనజొప్పడ హేమరథవర్తియగుచు
బలములునరుఁడు సంభ్రమలీలఁ గొలువ
బలమును జలమును నేర్పడ శత్రుసమితి
భయమంద గోసలపట్టణంబునకు
రయమునఁ జనుదెంచి రాక్షసాంతకుఁడు
ఎదురేగి యావిభుఁ డిందిరావిభుని
బదివేల తెఱఁగులఁ బ్రణుతించి మ్రొక్కి
సకలోపచారముల్సవరించి భక్తి
నకలంక సింహాసనాసీనుఁ జేయ

నలఘు సౌధాగ్రంబునందు శోభిల్లు
జలజాతనేత్రి కోసలరాజపుత్రి
మరకతశ్యామ కోమలకల్పధామ

నరవిందదలనేత్రు హాటకనేత్రుఁ
గురువిందరదను నక్రూరాంశురదను
సరసమంజులహాసు చంపకనాసు
ఘనకిరీటోద్ధారుఁ గౌస్తుభహారు
ననుపమాయతదేహు నాజానుబాహుఁ
జెలువొందఁ జూచియా శృంగారరసము
పొలుపారవాలుఁ జూపులనే క్రోలుచును

నీ రమేశ్వరుఁడు ప్రాణేశ్వరుండైన
ధారణి నేఁ జేయు తపమే తపంబు
భావింపనేవేల్పు భక్తమందార
మావేల్పు నాభర్తయైయుండఁ గాక
యరయంగఁ దొలుత భావమున సత్యముగ
సిరివరునేఁ బూజ సేసితినేని
నీ మోహనాకారుఁడెన్ని బాగులను
గామించిననుఁ బత్నిఁగా నెలుఁగాక
యనుచు డెందంబున నానవాలమున
ననురాగవల్లిక వలరింపుచుండె

నంతఁ గృష్ణుండుఁ గోసలాధీశుఁ జూచి
సంతసంబునఁ బలుచని నవ్వుమోవిఁ
బెనఁగొన జలద గంభీర వాక్యమున
ననియె భూనాయకులన్యులువేడఁ
దగవైన నవరతము మీకు మాకుఁ
దగువైన పూర్వబాంధవము చింతించి
యడిగెద నీ కూఁతుననియె మోదించి
పుడమిఱేడనియె నప్పుడు కృష్ణుతోడ
శ్రీవర భాగ్యంబు సేసితి నాకు
నీవంటి బంధులెన్నిన భూమిఁ గలరె

ఐనమునొక్కటి మర్యాద సేసితిని
నీ నగంబులఁ బోలు నేదుకోడియల
నుర్విపై నొక్కనాఁడొక త్రాటఁ బెనుచు
నుర్వీశునకుగాని నొసఁగఁ గన్నియను
ననియుంటి నీచిత్తమనిన దైత్యారి
విని నవ్వి యట్లు కావింతునే ననుచుఁ
దనరూపు పౌరకాంతలు జెప్పలిడఁగ
కనుఁ గొన నగరోపకంఠంబునందు
గర్జించి లయకాల కాలమేఘములఁ
దర్జించు అంకెల దశదిశల్వడఁకఁ
బొదరి చిందఁ గొట్టి భువితల్లడిల్లఁ
గదిసికయ్యమునకు గాలుదువ్వుచును
గొమ్ములు పాతాళ కుహర మేర్పడఁగఁ
జిమ్ముచు నేత్రముల్ జేవురింపఁగను
గాలకూటార్చుల కరణిరోషాల
వాలంబులగు ఘనవాలముల్మెఱయ
భాసురోన్నత దిగిభములచందమున
భాసిలు మత్తవృషభముల నీక్షించి
గట్టిగాఁ దళుకు బంగారు కానె బిగ్గఁ
గట్టిచొల్పడు బాగుగాఁ జుట్టి యప్పుడు
దానవారాతి నందఋనాలకింప
భూనాథుఁ బచరించి భుజమప్పళించి
యిలబెల్ల గిలగిరులెల్లఁ బెల్లగిలఁ
జలమున నార్చి మచ్చరముప్పఁ బేర్చి
చటుల మృగాళిపై శార్దూలములకు
ఘననాదబోతులఁ గడిమి వేఁడించి
మల్లడిగొననొక్క మతిమల్లరముల

వల్లవల్గొమ్మలుద్ధతి నొల్లగిల్లఁ
దల్లడిల్లఁగఁ బట్టి దట్టించి జగతి
ద్రెళ్లంగవైవ సందిచూచు జనులు
ఝల్లున నివిగ నిర్జరులెల్లఁ జెల్లు
జెల్లునీకనియుల్ల సిల్లంగ శౌరి
యుదుటునఁదన బాహుయుగముచేవాని
మెదిచి చాగతఁగొని మెడవల్లె వైచి
పెడవెట్టు కొండలు పెంపెల్లఁ బొలిసి
యడవెట్టుకొనుచు నొండ్రనుచు స్రుక్కఁగను
వడిఁగట్టివైవఁ గవ్వడిమనబావఁ
గడఁక నీక్షించి డిగ్గన నగ్నజిత్తు
ఇచ్చునెంతయు మెచ్చి యిందిరానాథుఁ
గ్రుచ్చి కౌగిటఁ జేర్చికొని సంతసించి
వర తూర్యజాల నిస్వనములుఁ నెలఁగ
నరులు గిన్నరులు నెంతయు సంతసింప
లోకేశ భవుఁడు పులోమజా విభుఁడు
నాకమానులు దిశానాయకోత్తములుఁ
బరిణయాలోకన పరతఁజెన్నొంద
హరురాణి యజురాణి హరిరాణి దేవ
నలినలోచనలుతోయంబుగాముద్దు
గిలుకొట్టు శోభన గీతంబుపాడ
రమణీయతర నవరత్న వేదకను
గమలాక్షు మహిత శృంగారుఁ గావించి
శృంగార మొకకుప్ప నేసినట్లున్న
శృంగారవతి నాగ్నజితి యను కన్య
సంకల్పమున్న కోసలరాజు సత్యా

సంకల్పనకు నిచ్చె సంకల్పమలర
మురవైరివర వ్రజములు దోయిలించి
తరలాయతాక్షిపైఁ దలఁబ్రాలునించి
తమములో ఖద్యోతతతి ప్రకాశించు
రమణఁ గొప్పన సేసఁబ్రాలు శోభిలఁగ
ముకురాస్య నవరత్నములు దోయిలించి
మకరకుండల ధారి మైసేసనించె

నురువైభవమున వేదోక్తమార్గమున
హరి నాగ్నజితిఁ బెండ్లియాడె నవ్వేళ
రాజకాంతలు రతిరాజుఁ గన్నట్టి
రాజీవనేత్రు విరాజి విగ్రహముఁ
గని సంతసిలి యాత్మఁ గన్యకామణికి
ననుకూల వరుఁ డయ్యెనని పొంగిరంత
నందనందను మామ నవ్యవైఖరుల
విందులకెలమిమై విందుగావించి
యంబరాదులనోలలాడించి సమ్మ

దాంబురాశుల నోలలాడించి మెఱసె
హేమాంబరుండు నయ్యెడ బాంధవులకు
హేమాంబరాదుల నేకంబులొసఁగె
తనుజాత వనజాత దళనేత్రుతోడ
ననుప నుద్యోగించి యయుత ధేనువులు
నగణితాలంకృతులగు రెండు వేలు
మృగలోచనులును దొమ్మిది వేల కరులు
నన్ని లక్షల తేరు లశ్వరత్నములు
నన్ని కోటులు శూరులై నట్టిభటులు
పరమసాహసులు తొంబది నూఱు కోట్లు
నరణంబుగానిచ్చి నవ్వధూ వరుల

నారూఢిఁ బూజించి యరథంబు మీఁద
నారూఢులుగఁ జేసి నారాజు కొలువ
మెఱుపుతో మొగులద్రి మెఱయుచందమున
దెరవలో శౌరి యాతేరుపై జెలఁగి
నరునితో ద్వారకానగర మార్గమున
నరుగుచో నావార్తనరసి కోపించి
వెనుకొనిమున్ను దద్వృషభ నిర్భిన్న
తనులైన రాజనందనులెల్లఁ గూడి
పరమ లజ్జా రోష భరితులై వచ్చి
హరిఁ దాకి యిభములు హరిఁ జుట్టు పగిది

నపుడు కృష్ణుఁడు శౌర్జ్ఞమంది యారిపుల
కపుర మాపెదనని గమకించు విధము
భావించి యాయల బలములకెల్ల
నీవేళ నీవేల నేన చాలుదును
దేవ నన్నొక యింత దృష్టింప మనుచును
వేవేగ గాండీవి విల్లెక్కు వెట్టి
గుణ నినాదమున దిక్కులు పిక్కటిల్ల
గణుతింపరాని మార్గణ పరంపరల
భూ నభోంతరము లప్పుడు నిండనంప
వానలు గురియించి వానల మెఱసి

రథములఁ దునిమి సారథులఁ గాఱించి
రథికులఁ దెగటార్చి రథ్యముల్గూల్చి
కేతువుల్నరికి పక్కెరలెల్ల వాల్చి
హేతులు సమయించి యేఁపు తూలించి
హరులఁ దుండించి భటాళి ఖండించి
కరుల నిర్జించి భీకరములైనట్టి
కాండముల్బఱపి నల్గడవచ్చు శత్రు

కాండముల్ధరద్రావాలఁ గామోది మోది
శరనిధి మంధరశైలంబు గలఁచు
కరణిఁ బిండిలి వండుగా సేనఁ గలఁపఁ

ప్రళయ ప్రభంజన పారవేగమున
శరదాళి వీఁగిన సరవిఁ దద్బలము
బలభేదిసుత వజ్రబాణ ఘాతముల
కలికినల్గడలకే పఱివీఁగి పఱవ
దేవేంద్రసుతుఁడు నంతే వేడ్కనగ్ని
దేవదత్తంబైన దేవదత్తంబు
పూరించెదెసలు నంబుధులు ఘూర్ణిలఁగ
శౌరి యప్పుడు ధనంజయు జయమ్మునకు
మెచ్చి విప్పచ్చి నర్మిలిఁ బెచ్చుపెరుఁగ
గ్రుచ్చి కౌగిటఁ జేర్చికొని యాదరించి

కన్యతో జయరమా కన్యతో నబ్ధి
కన్యకాపతి ద్వారకాపురంబునకు
నరిగి యాపురవీథినరుఁదేరఁ బౌర
తరుణులు కోసలతనయ నీక్షించి
ముకురమో శశిబింబమో కాదు మోము
వెకరిమా గురుకందు వెలయదుగాన
కలువలో మగమీలో కావు నేత్రంబు
లలవాడు వేడగంబులు లేవు గాన
సరసపూరమొ జలజమొ శ్యామగళము
హారికథావేద్యంబు లవిలేవు గాన

వలుకొండలో జక్కవలో కావు గుబ్బ
లలదంతురత ఱెక్కలవిలేవు గానఁ
బులినమో కరిశిరంబులుకాదు జఘన
లలజారులును సేఱులవిలేవుగానఁ

గాళ్లలో శరధులో కావులేఁదొడలు
కామక కఠినతల్గలు గవ్వుగానఁ
రవికాబ్జములో లత్తుకలో కావో పాద
ములు కంఠనకలత్వములు లేవుగాన
నని సన్నుతింప నందందని లింప
జనమవలోకింపఁ జలజలోచనుఁడు

చెలఁగి భూమీసురాశీర్వాదతతుల
విలసిల్లు సదన ప్రవేశంబు సేసి
ప్రణుతింప వసుదేవ బలదేవులకును
బ్రణమిల్లి కలిసి సౌభాగ్యంబు మెఱసి
సౌవర్ణగాత్రి కోసలరాజపుత్రి
భావజకేలి శంబరరాశిఁ దేల్చి
యతుల శోభనవతి యమితసౌభాగ్య
వతియునునగు ద్వారవతియేలుచుండె
ఆదట మఱియును నయ్యంబుజోదరుఁడు

# 7. సప్తమ పట్టమహిషి

## శ్రీ భద్రాదేవి వివాహ వర్ణన ప్రసంగము.

---

మేదినీశ్వర తమ మేనత్తయైన
శ్రుతకీర్తి తనయ విశ్రుతకీర్తి వినయ
(నతిదివ్యరూ)ప మోహనభద్రభద్రఁ
దను గేకయ మహీధవుఁడు కల్యాణ
మొనరింపఁ గోరి కెయ్యనను బుత్తేర
నాననవిల్కాని యయ్యై సొంపంది
యూననచంద్ర సేవాసక్తి వచ్చు
నక్షత్రమాలిక నటనమ్మెఁ దాల్చి
యిక్షు చాపుని తండ్రియింపు సొంపలర
చటుల నిజాపాంగ చంద్రికా సార
ఘుటికలోయన ముద్దుగులు కుచౌ కట్టు
ధరియించి జాతిప్రదళుకు వజ్రములఁ
గరమొప్ప రవిపదకంబు గీలించి
యరవిందమూల మత్తాళి చక్రముల
కరణిఁ జేతుల నీలకటకంబు లలరఁ
ధవళాంశు రుచి ధాళధళ్యమైనట్టి
నవదుకూలంబు వింతలుమీఱఁ గట్టి
పసనిడుపాగంబు పట్టుకుళ్లాయి
మెసపరిచందంబు లొలుకంగఁ దాల్చి
దేవకీ వసుదేవ దేవకుల్పులుఁడు
దేవేంద్రసుతుఁడునే తేరనల్గడల
నరి వీరప్రదరంబున రథంబునెక్కి
పరివారమును సర్వబంధువుల్గొలువ

ఘనతర పటహ ఢక్కాహుడుక్కాది
నినదముల్దిక్కుల నిండ ఘూర్ణిలఁగ
గరిమమైఁ గదలి కేకయపురంబునకు
నరుగనప్పుడు కేకయాధీశ్వరుండు
తత శుభద్రవ్య సంతతులతో భూమి
పతులతో విప్రదంపతులతోఁ గూడఁ
గోమరు మీఱఁగ నెదుర్కొని వసుదేవు
కోమరు నవ్వేళఁ దోడ్కొని యేగుదెంచి

యనుపమ హేమగేహమునందు నునిచె
జననాథ కేకయ జననాథ వరుఁడు
అప్పుడు శుభలగ్నమాసన్న మగుటఁ
జెప్పి పుత్త్రేర రాజీవలోచనుఁడు
రత్నకంబళ దివ్య రత్న పల్యాణ
నూత్న చామరజాలనుత పుష్పధామ
కాంచన ఘంట నానాశుంభ పట్ట
చంచదలంకార సహితమై మించి
హసిత దిశాదంతియగు దంతి నెక్కి
వసుమతీసురలు దీవనలు గావింప

ప్రచుర మార్తాండబింబ ప్రభల్దెగడు
రుచులఁ జూపట్టు కర్పూర దీపికలు
పుష్పబాణుని బాణముల రీతిఁ బొల్చు
పుష్పబాణంబు లద్భుతములై తనర
సురలకు నీవార్త సూచింపనరుగు
కరణి శోభిల్లె నాకాశబాణములు
భ్రమదంశు విజిత చంద్రజ్యోతులైన
రమణీయముగను సాంద్రజ్యోతులెసఁగ

నిత్తు కోదండుఁ డనేక రూపములఁ
బక్షివాహనుగెల్వఁ బఱతెంచెననఁగ
దండిమై రాజనందనులోలి యిత్తు
కాండముల్గొని పెక్కుగతునే తేర
వడిమీట ఖణిఖణి వాగుచు గిరుల
బొడఁగుఁ గై కొను జిగిబిగిచున్నుఁ గవల
మెఱుఁగు దీవల నవ్వుమేనుల నొప్పు
మెఱుఁగుబోణులు సంభ్రమించి యంతంత
పరమ సంతోషాబ్ధిఁ బ్రబలించుమించు
నురువులోయన మించు నురువులగములు
తళుకు గుబ్బలతోడఁ దడబడి సిరులు
గలిగి ప్రకాశించు గజ నిమ్మపండ్లు
పోలుపైన పలుకునొప్పుల కుప్పలనఁగ
లలితంబులైన బెల్లంపుటచ్చులును
వరకపోలముల భావంబులఁ దెలుపు
వరుస నొప్పెడు నాగవల్లీ దళములుఁ
గరమొప్పుచును భాతికలయురోజముల
కరణిఁ జూపట్టు పూగముల జాలముల
జిగిమించుతమ నవ్వ చిఱుతవెన్నెలలు
నిగిడిన రీతి మానికములౌవిరులు
కమ్మవిల్కాని చక్రములననొప్పు
కమ్మదోవులుఁ బెక్కుగతుల వస్తువులు
కనక పాత్రములందు ఘటియించిచెంతఁ
గనుపట్టుఁగా వింతగాఁ గ్రంత నడువఁ
దఱుచుగా వాద్యనాదంబులు చెలఁగ
మెఱసి గోవిందుఁ డమ్మేదినీవిభుని
నగరువాకిటను మాతంగంబు డిగ్గి

నగరకామినులు క్రన్నన సేసలిడఁగ
వరుసనే తెంచి వివాహమంటపము
సరసఁ జెన్నొందనా సమయంబునందుఁ
జికిలి చేసినమారు చేవాలుబోలె
నకలంక శృంగార హారిణియైన

కేకయాధిపపుత్రి కిసలయగాత్రి
రాకేందువదనలు రమణుఁడో తేర
నారాజువిమలతో యములనింపొదవ
మారాజ పాదపద్మంబులఁ గడిగి
యర్చించి మధుపర్కమర్పించి యాత్మఁ
జర్చించి హరిమానసంబున నిలిపి
తనుజన్మ వసుదేవతనుజన్మునకును
ఘనత ధారాపూర్వకంబుగా నొసఁగఁ
గందువాయుచుఁ బూర్ణకలలతోఁ బొదలి
యిందుండు నిందుండు నెదురించెననఁగ

నపుడు వధూవరు లాననాబ్జముల
నిపుణతతో నిక్కి నిక్కి కన్గొనిరి
ఆగమవేద్యుఁ డిట్లాగమోక్తముగ
బాగుమీఱఁగ భద్రఁ బరిణయంబయ్యె
హరియు నాజనపాలుఁ డన్యోన్యమిట్లు
సరవిమై నుచితముర్సలిపి రంతటను
భద్రతో నాబలభద్రసోదరుఁడు
భద్ర శతాంగంబుపై నెక్కి మెఱసి
సురలు నప్సరలు భూసురులు గీర్తింప
వరభాగ్యవతి ద్వారవతి బ్రవేశించి
రాజమార్గమున దీరతనేఁగఁ బౌర
రాజపద్మాక్షులా రాజాస్యఁ జూచి

పలుమఱు నారకమిట్టి పడుటింతె కాని
కలికి కన్నులసరిరావు బేడిసలు
తమిఁ జూడగాఁ గొంత తటితిపకాని
బొమయియాడగునెకం పొలయించు విండ్లు
కలఁగక యెంతమూఁకలు సేసెనేని
నలకంబులకు సాటియగునె యీయలులు
వెక్కసంబుగనెంత విదిరించికొన్న
జక్కవల్దామేలననుఁ దోయిఁ బోల

మునుకొనిలోలోన మొలసిన నేమి
యెన రావు గళమున కీయంబుజములు
వెలిమీఁటి క్రంతులు వేయుటేకాక
పలుకుల సొగసేల పట్టుచిల్కలకు
నెలమిఁ గూర్చినవారి నెంతల్లుకొన్న
నల బాహులకుఁ బురుఁడగునె యీలతలు
మానుగా నెన్నిసూక్ష్మములు బోయినను
కౌనుఁ దీగకుసాటిగా నేరవణులు
నుడిగొని తామెంత సొబగైననేమి
తొడలకు సరిరావు తుదఁ గదళికలు

తమవారిగూడి యెంతయునుబ్బినేని
సమమౌనె తత్పదాబ్జముల కబ్జములు
అని కొని యాడంగ ననిమిషోత్తములు
వినుతింప సదనప్రవేశంబుఁ జేసి
యల రోహిణీయుక్తుఁడగు రోహిణీశు
చెలువున భద్రతోఁ జెలఁగి నిచ్చలును
నించువిల్తుని తండ్రి యెనలేక యాత్మ
నించు రాగమున నభీష్టభోగమున
ద్వారకాంచన ప్రవర్ణితమైన
ద్వారకానగరి నెంతయు వేడ్కనుండె

# 8. అష్టమ పట్టమహిషి

## శ్రీ లక్షణాదేవి వివాహవర్ణన ప్రసంగము.

---

ధరణీశయుట మద్రధరణీశ పుత్రి
మరుని సామ్రాజ్యపద్మా పద్మనేత్రి
ధరణి సంచారి నూతన చంద్రరేఖ
నిరుపమ భూషణాన్విత కల్పలతిక
తరళితాదూర సౌదామనీలతిక
గరిమొప్ప సప్రాణ కాంచనప్రతిమ
యక్షీణ శుభమూర్తి యవిరళ భవ్య
లక్షణయగునట్టి లక్షణాకన్య
నారద మహతీ నినాద సంభూత
శౌరి కథామృతసారంబు గ్రోలి

యుత్తరంబు మఱచి యా యిందిరాపతినిఁ
బతిగాఁగఁ గోరి తత్పరబుద్ధితోడ
సారసమ్ములకుఁ గన్నియచాలనులికి
ముడివడు విరులు గ్రొమ్ముడి సఖీజనము
తడవదురారాము తమ్మునినోట
నుడువదు చింతతో నూల్కొన్న చింత
విడువదు............
అల మద్ర భూవరుం డంతనానాఁటఁ
జెలులచేఁ దనుజాత చెలువంబుఁ దెలిసి
తనయకు ననుకూల ధవుఁడెందుఁ గల్గు

నని తానె యొక యుపాయంబు చింతించి
పుష్కరంబునఁ జూడఁ బొడగానరాక

పుష్కరాంతరమునఁ బొడకట్టుచుండ
మీనయంత్రంబు నిర్మించి యాదేవ
మానవులకు భరియింప రానట్టి
బాణాసనంబును బటువజ్ర నిసిత
బాణంబుఁ జూపించి ప్రార్థించి యునిచి
యీ విల్లుమోపెట్టి యీమార్గణంబు
తీవిమైఁ దొడిగి దృష్టించి యిమ్మీను
ధరఁగూలవైచు నాధారుణీనాధ

వరుఁడునాపట్టికి వరుఁడంచుఁ బలికి
పాటించి యఖిల భూపతులెల్ల వినఁగఁ
జాటించి యంతనా జననాధవరులు
పటుతర సైంధవ భద్రేభ వీర
భటపటలంబు లుద్భటవృత్తిఁ గొలువ
రయమున వచ్చి మద్రపురంబు సొచ్చి
భయద భుజాగర్వ భరితులై యుండ
నది విని దనుజారి యారాకుమారి
నిదె పోయి వేవేగ నేఁ దెత్తుననుచు
గురుకాంతిజిత రవికోటి కోటీర

మకరతమకుటంబు మస్తమందుంచి
ముకురకపోలాగ్ర మఃలుడాలు గులుక
మకరకుండలములు మహిమమ్మైఁ దాల్చి
ఘనచంచలోదీర్ణ ఘనవైభవంబు
గనుపట్ట వనమాలి కాయుతుండగుచు.
నాతతాంచలచంచ దంశుసందోహ
పీతాంబరంబైన పీతాంబరంబు
ధరియించి తొలుఁగు గాఁడావి కస్తూరి

తిరునామ మొకకొంత తీరుగా దీర్చి
రటదంఘ్రి కటక సారససుమాణిక్య
కటకాంగుళీయక గ్రైవేయ హార
సురుచిరుండై శైబ్య సుగ్రీవముఖ్య
హరిణవర్ణ సమిద్ధ హరి బద్ధవిష్ణు
రథకేతనోదీర్ణ రథమెక్కి మేటి
రథికులు భటులు వారణతురంగములు
చనుదేర మురజ ఝర్ఝర శంఖ ముఖ్య
ఘనవాద్యఘోషము ల్గగనంబు బొదువ
రాజసందోహ సంరాజిత మద్ర
రాజధానికిని దీవ్రత నేగుఁదేర
మద్రేశుఁడప్పుడు సంభ్రమముతో వచ్చి
భద్రేశు గనుఁగొని ప్రణుతిగావించి
తోకొని పోయి సంతుష్టుఁడై భక్తిఁ
జేకొని శౌరిఁ బూజించె నవ్వేళ
గురుతర మాణిక్య కోటీరకోటి
నిరత ఘర్షణజాత నిబిడగాంగేయ
ఘనధూళి శబలిత గగనాంతరాళ
కనకమంచాంతర కలితులై నట్టి
భూనాథులా రమా భూనాథుఁ జూచి
భానుబింబ ప్రభాపటలంబు నెదుట
ఖద్యోతకాంతులు గనరానియట్లు
ఖద్యోతులయ్యు ముఖద్యోతమాన
కాంతులు దక్కి భూకాంతులారజని
కాంతునిఁ గనుఁగొని కైవాలుచున్న
తమ్ములుభాతి మోదమ్ములు సడలి
బిమ్మరిఁ గొనిలోన భీతిల్లిరంత
అంతరంగంబున వారాజకన్య

సంతసం బొదవఁ గజనకు సమ్మతిని
బరిమళమిళిత శుంభత్కమలముల
సరఁగున మంగళస్నానంబుఁ జేసి
నెఱియ గోధమగింజ నెఱివట్టినట్టి
మెఱయు చెంగావొప్పు మీఱంగఁ గట్టి
నెలవంకతూఁపు పూనిన కంతుశౌర్జ్ఞ
మలరికఁ బొమదోయి నలరు నామంబు
నడుమను మృగమద నవచిత్రకంబు
కడుఁ జిత్రరీతులఁ గనుపట్టఁ దీర్చి
కొఱనెల నఱమింగు కుముదాప్తవైరి
నెఱఁ గేతకీ దళాన్వితవేణి యలర
రవిచక్కఁ దనము సారసమిత్రశేవ
శవణించు రత్నతాటంకముల్దాల్చి
హరికథామృతము కర్ణాంతరాళములఁ
బరిపూర్ణమగుచుఁ బైపైనుబ్బెననఁగఁ
బ్రవిమలచ్ఛాయల పండుముత్యముల
బవరులఁ గనుపట్టు బవెరలు వెట్టి
నిగిడి శైలములపై నిర్ఝరులొప్పెలుచు
పగిది హారములు గుబ్బలమీఁదఁ గసర
మలయు వెన్నెల సోఁగమైతొలుగులుకు
మలుకు సొమ్ములను దీమంబుగాఁ బూని
మరకత వైడూర్య మణులు సొంపొందు
సరిలేని దొకబన్నసరము గీలించి
జిగిమించు కెంపులు జేర్చి సోయగపు
మొగపు తీవ బిటారముగ సవరించి
రమణీయ దూర్వాంకురములమై చాయఁ
గనిపించు పచ్చల కడియముల్దాల్చి

కొండలవలెనున్న కుచములనాను
చుండులేఁ గౌనునకురు సత్త్వమొదవ
నలువవై చినకట్టు నానొప్పు మీఱి
తలుకొత్తు నుదరబంధంబు చొప్పడఁగ
నాహారి కనుఁ దోయి యక్కఱ దీర్చు
మోహనంబగు నొక్కమక్కరవెట్టి
తళుకు గుబ్బలమీఁది ధగధగల్మించు

జిలుఁగు దువ్వలువ కుచ్చెలమీఁది కురుక
బహువిధ శృంగార భాసితయగుచు
గురుతరంబుగ వాద్యఘోషంబు లడర
నరుదేరఁ జూచి పౌరాంగనామణులు
చేరుకొలంది నూర్చిన నెడలేక
నూరకుండినమేలె యువిదకెమ్మోవి
యురిదిచేకొలఁ దినినూదినఁ బెచ్చు
పెఱుఁగుచుండెను లేమ బిగిచన్నుఁ దోయి
రొఱపులై యొక్కటికొకటి మిన్నేల
మెఱవ కుండినఁ జూడ మెలఁత నేత్రములు

అండఁ జొప్పడ నిల్పి యలమనందిటను
నిండ కుండినఁ గాంతనెఱిఁ గప్పుకొప్పు
అని యిట్లుకొని యాడి యలరి వెండియును
గనుఁగొని పల్కి రుత్కంఠ దీపింపఁ
గనక కూటములనుఁ గావిందు మఱియు
వనజాక్షి పాలిండ్ల వలనుండఁ బోలు
గరివైరి నడుమనఁ గావిందు మదియుఁ
దరుణిమధ్యంబు చందంబుగానొప్పు
కంతువిల్లదియనఁ గావిందు మదియుఁ
గాంతనూగారు సంగతినుండఁ బోలుఁ

## అష్టమహిషీ కళ్యాణము

కలహంస గతియనఁ గోవిందుమదియు
వలనొప్పు గతినడవడ్డంబు బోలు
నని మెచ్చి పొగడ స్వయంవరాయాత
జననాథులెల్లను జలజాక్షిఁ జూచి
నగుమొగంబమరెఁబో నగుమొగంబునకుఁ
దగిన యీ విపులనేత్రములెట్లు గల్గెఁ
గనుదోయిఁ గలిగెఁబో కన్నందములకుఁ
నొనరిన యీకర్ణయుగమెట్లు కల్గె
వీనులుగల్గెఁబో వీనులచెంత
నానీల ధమ్మిల్ల మదియెట్లుకల్గెఁ

దురుముచెన్నొందెఁబో తురుముమై గొను
మెఱుఁగు సంకునదల్చు మెడయెట్లు గల్గె
గళము శోభిల్లెఁబో గళము చెంగటను
దళుకొత్తు కుచపర్వతము లెట్లుగల్గె
పాలిండ్లు గల్గెఁబో పాలిండ్ల బరువు
దాళులేఁ గౌఁదీవ తానెట్లు కల్గె
నడుము శోభిల్లెఁబో నడుమునకొక్క
బెడఁగు సంపాదించు పిఱుఁదెట్లుగల్గె
ఘన కటికలిగెఁబో కటిచక్రమునకు
నెనసిననును దొడలే రీతిఁ గల్గె

నల యూరులమరెఁబో యీయూరువులకు
నెలమిఁ జూపెడి జంఘలేరీతిఁ గల్గెఁ
జిఱుదొడల్మించెఁబో జిగిఁజిఱు దొడలు
కొఱవుఁ గొప్పడు పాదయుగ మెట్లుగల్గె
ననుచు శ్రీదేవి రెండవ మూర్తియనుచుఁ
గనుఁ గొన రాజమార్గమున కేతెంచె

తలకొన్నకడిమి నత్తఱివచ్చి కొంద
అలఘుబలోద్ధతులైన పార్థివులు
హరువిల్లనఁగఁ జెల్లు నావిలుఁ జేరి
ధరయంటువాయ యనెత్తఁగ లేకచనిరి

లయ కాలదండంబులాగు దీపించి
భయదమైఁ యెదుట జూపట్టు నమ్మేటి
విలువంచలేక భూవిభులలో నెల్లఁ
దలవంపులైనఁ గొందఱు విన్ననైరి
చేనంటి యెక్కు ద్రోచియు ద్రోవలేక
హీనతనొంది రయ్యెడఁ గొందఱంత
భీమ విక్రములైన భీమ రాధేయు
లామహాధనువు సజ్యంబుఁ గావించి
శరము సంధించి ఖేచర సీమమీఁన
చరముపైఁ బూని తజ్జలముల దాని

తిరుగుడువడిఁ గాంచి తెలియంగ లేక
తిరుగుఁడు వడిరంత దేవేంద్రతనయుఁ
డేయుబాగెఱిఁగి తానేయఁగాఁ బోవ
నేయునుపాయముఁ గన కేటిది తొలఁగ
కని దానవారి యక్కడనున్న వారిఁ
గనుఁగొని చెలఁగి క్రేఁగంట నవ్వుచును
నలవోకడా కేల నలధనువంటి
వలకేల మౌర్వి చువ్వన నెక్కువెట్టి
యంబకంబరి వోసి యంబరమధ్య
శంబరచర వరచ్ఛాయభూ భాగ

శంబరంబునఁ గాంచి సరఁగున మీను
శంబరాంతకు తండ్రి చక్కఁగా నిగిడి

ధరఁగూలనే సెనత్రతిఁ బుష్పవృష్టి
గురిసె దుందుభులు గ్రక్కునమింట మొఱసె
నారాజనందన యానందమంది
యారూఢ మణి కంకణారవం బెసఁగ
నడుము జవ్వాడ నాననమింత యెత్తి
బెడఁగు గుబ్బలు జిగిబిగి రాయుచుండఁ
గేలి సారభారసాకీర్ణ గాంగేయ
మాలిక నవ్వన మాలికంఠమున

వైచవై చుటయు శ్రీవరుఁడు నమ్మోటి
రాచకూతును దన రథమువై వేగ
మెక్కించుకొని చలంచేచనంతంత
కెక్కించికొని సైన్యమిరుమేలఁ గొలువఁ
జేరు దారకుఁ డతి తీవ్రతఁ బఱప
ద్వారకాపురము త్రోవన యేగుచుండె
దుర్వార గర్వ బంధురులైన యట్టి
యుర్వీశులప్పుడు చూపోపకేతెంచి
భటులతో నిరుపమార్భటులతో నాగ
ఘటలతో సకలదిక్తటముల శార్ఙ్గి

రాము తమ్ముని జుట్టి రాక్షసులోలె
శరవృష్టి గురిసి మార్జనములు సేయ
నాదట గోపించి హసితామరేంద్ర
కోదండమగు శార్ఙ్గకోదండమంది
బలునారి మ్రోయించి బలునారి మఱఁది
బలునార సములఁ దద్బాణముల్దునిమి
ప్రలయ ధారాధర పటలంబు కెరలి
కలిశ బృందంబులు గురియుచందమున

దారుణ బాణసంతతుల భూపతుల
ఘోర సైన్యములపైఁ గురిసి వెండియును

బగరకు నుత్పాతభావంబు దోపఁ
బగలు చుక్కలు గనుపట్టెనోయనఁగ
శరజాల దారుణ చటుల ఘట్టనలఁ......
నగలనందలి ముత్తియంబులుమింటి
కెగసి చూపట్ట నియ్యెడ శార్ఙ్గపాణి
తఱచుగా రిపులనుద్ధతి పింజ పింజ
గఱవనేయుచుఁ బూరిఁ గఱవఁ జేయుచును
నందంద శరముల నలిగి కొందఱును
జిందర వందరల్ సేసి నల్గడలఁ
బాఱఁజేయుచు విజృంభణ వృత్తి మెఱసి......

బాణముల్దునిమి కృపాణముల్విఱిచి
ప్రాణముల్గొనుచు శౌర్యంబు చూపుచును
రథుల ఖండించి సారథులఁ దుండించి
పృథుల రథ్యంబుల పిండి సేయుచును
రదనముల్వదనముల్రాలఁ గొట్టుచును
ఉదరములు పదములు వాయమోదుచును
గాత్రముల్నేత్రముల్గత్తిరింపుచును
ఛత్రముల్పత్రముల్జుక్కు సేయుచును
దొడవిన తూపునుఁ దొడ్తొడ వింట
వెడలిన తూపును వివరింపకుండ

శరజాలముల రిపుసైన్యంబుఁ బొదివి
పరివేష యుక్త ప్రభాకరుండనఁగఁ
గుడివడువిలుతోఁడ గూడి శాత్రవులు
సుడివడ వడినంప సోననింపుచును

పోలి లోకములొక్క జూడగాఁ గొనెడి
కాల సంకర్షణుగతి నుగ్రుఁ డగుచు
నతిముతి సమయింప నలవేఁదివెఱచి
పఱచిరి హతశేష పార్థివులంత
భాగ్యారి జన్యంబు పాంచజన్యంబు
నాగ్నజితీసుఁ డున్నతగతి నొత్తి

సంగతి నాగరాజ స్ఫూర్తి గలిగి
నింగియు భువిబలి నిలయంబు పోలెఁ
ఘన కబంధావాస కలితమై ఘోర
వనమును నగరంబు వనధియుఁ బోలె
నారూఢ వర్ధిత హరిమహోస్ఫురణ
నారయ హరి నిలయంబులు వోలె
గణుతికి నెక్కు భీకరమైనయట్టి
రణముఁ గన్గొనుచు వారణముఖ్య తురఁగ
యదు వృష్ణి భోజాంధకాదులు గొలువఁ
గదియుచు వంది మాగధులు గీర్తింప

నక్షీణబలుఁడు పద్మాక్షుండు భవ్య
లక్షణయగునట్టి లక్షణతోడ
సురలు సన్నుతి సేయ సురుచిర గతుల
వరకీర్తి ద్వారకావతిఁ బ్రవేశించి
యారాజమార్గంబు నందేగుదేర
నారాజవదనఁ బౌరాంగనల్జూచి
పొలఁతి కన్నులుదాఁకఁ బోలునే దీని
చలితకాంతియుఁ జాలు సంపంగిఁ గెలువ
భూలతికలధాఁకఁ బోలునే దీని
వాలుఁ జేతులు చాలు వల్లికల్గెలువఁ

బొదలు చేతులుదాఁకఁ బోలునే దీని
పదములె చాలు సజ్జంబులుగెలుప
నని కొని యాడ మహావైభవమునఁ
దన రాజనగరమత్తఱిఁ బ్రవేశించె
నల శౌరితనయుల్లుఁ డగుటకు వేడ్కఁ
దొలుక మద్రుఁడు సముద్రుఁడు వోలెఁ బొంగి
వాహినీయుక్తుఁడై వరమణి వస్తు
వాహనాదులతోడ వచ్చినవ్వేళ
మామఁ బూజించి యమ్మామ మనోహరుఁడు
హైమ విశాల గేహమునందు నునిచి
చేలమ్ములు నవచిత్రిత కేతు
జాలమ్ములును ఘనచామర పుష్ప
వారమ్ములును జంద్రవాసిత గంధ
సారమ్ములును భవ్యసౌరభ మిళిత
ధూపంబులును భానుతోరాయు రత్న
దీపంబులును సర్వదివ్యవస్తువుల
బాగుగా నిర్జరపతి రాజధాని
లాగుగా నగరు నలంకరింపించి
నందాదులును శతానందాది భూమి
బృందారకులు బంధుబృందంబునపుడు
రావించి తత్కాల రమ్యకృత్యములఁ
గావించి యంతరంగమున భావించి
పసిఁడి టెక్కలడాలుభానుభానువుల
పసలకు మించనొప్పము వెట్టుచుండ
మండిత ముఖచంద్ర మండలద్యుతులఁ
నిండుచెందురులోని నెఱకందు దీర్ప
మానిత ఘనదేవమణి రోచమాన

మాన పక్షీంద్రవాహన మేగుదేర
నానందనందనుఁడా వైనతేయు
నానందమును గంధమప్పళించుచును

నారూఢుఁడై యనంతాది నిత్యులను
నారద సనక సనందనాదులను
భవుఁ డబ్జభవుఁడగ్ని భవుఁడును నదితి
భవుఁ డబ్ధిభవుఁడు దిక్పతులును గొలువ
నాపూర్ణ కలలతో నఖిలతారకలు
దీపిత మూర్తులై తేజరిల్లఁ గను
నతను శోభనురేఖ యాచిత్రరేఖ
యతుల మంజుల భావయగు చిత్రఘోష
ఘోరోరు విజిత కాంచన రంభ రంభ
తారుణ్యయుత వధూత్తమ తిలోత్తమయు

మొదలైన యప్సరో ముకురాస్యవెదుట
ముదమంది నర్తనములు సేయుచుండ
తీవిమై మడ్డు డిండిమ ఝర్ఝరాది
రావములుర్విని నభమున ఘూర్ణిలఁగ
సురగులు సిద్ధసాధ్యులును యక్షులును
సురలు గంధర్వులు సొరిది సేవింప
ఛందంబులా శౌరిచందంబులెన్ని
వంది మాగధులు భావంబులు దాల్చి
మంగళం బరవింద మందిరాపతికి
మంగళం బహివైరి మహితకేతునకు

మంగళం బమృతాబ్ధి మధ్యగేహునకు
మంగళం బనువరు మధుసూదనునకు
నని సన్నుతింప నానామహోత్సవముఁ

గని వసుదేవుండు కామపాలుండు
దక్కిన యాదవోత్తములు వాహనము
లెక్కి సంభ్రమమునఁ దేరఁ బురము
నేగి మద్రేశ్వరు నింటి వాఁకిటికి
నేగి తార్క్ష్యునిడిగ్గి యేణలోచనలు
భద్ర నీరాజనల్పలుమాఱు నొసఁగ
భద్రావిభుండు సుభద్రావిభుండు
కై దండ గావింపఁగా మద్రసుతులు
పాదమజ్జనమొ నర్పఁగ నేగుదెంచి
కాంత రత్నోజ్జ్వల కల్యాణమంట
పాంతరంబుననిల్చెనంత నారాజు
హరిని గాంచనపీఠి నాసీనుఁ జేసి
చరణపంకజములు జలజంబులార్చి
మధుర మంత్ర స్వర మంత్రస్వరముగ
మధుపర్క మొసఁగి ప్రేమంబుతో మున్ను
కై సేసియున్న లక్షణను లక్షణను
భాసుర సంఫుల్ల పంకజేక్షణను
జెలువలుదోతేరఁ జెలువమేపారఁ
గలహంసగతుల నక్కన్యయే తేర
నా సమయంబున యజుఁడుఁ గాయజుఁడు
భాసిల్లఁగాఁ దెర పట్టిరవ్విభుఁడు
వోసరంగ నాగమప్రోక్త మార్గమునఁ
దనయను వసుదేవతనయున కొసఁగె
దేవకామినులు భూదేవకామినులు
భావజగురు పెండ్లి పాట పాడఁగను
వనజలోచనలు సౌవర్ణ పాత్రికలఁ
గనుపట్టునెడకుడు కలుసేసఁబ్రాలు

మాన పక్షీంద్రవాహన మేగుదేర
నానందనందనుఁడా వైనతేయు
నానందమును గంధమప్పళించుచును
నారూఢుఁడై యనంతాది నిత్యులను
నారద సనక సనందనాదులను
భవుఁ డబ్జభవుఁడగి భవుఁడును నదితి
భవుఁ డబ్ధిభవుఁడు దిక్పతులును గొలువ
నాపూర్ణకలలతో నఖిలతారకలు
దీపిత మూర్తులై తేజరిల్లఁ గను
నతను శోభను రేఖ యాచిత్రరేఖ
యతుల మంజుల భాషయగు చిత్రఘోష
చారూరు విజిత కాంచన రంభ రంభ
తారుణ్యయుత వధూత్తమ తిలోత్తమయు
మొదలైన యప్సరో ముకురాస్యవెదుట
ముదమంది నర్తనములు సేయుచుండ
తీవిమై మడ్డు డిండిమ ఝర్ఝరాది
రావములుర్వభి నభ్రమున ఘూర్ణిలఁగ
నురగులు సిద్ధసాధ్యులును యక్షులును
సురలు గంధర్వులు సొరిది సేవింప
చందంబులా శౌరిచందంబులెన్ని
వంది మాగధులు భావంబులు దాల్చి
మంగళం బరవింద మందిరాపతికి
మంగళం బహివైరి మహితకేతునకు
మంగళం బమృతాబ్ధి మధ్యగేహునకు
మంగళం బనువరు మధుసూదనునకు
నని సన్నుతింప గానామహోత్సవముఁ

గని వసుదేవుండు కామపాలుండు
డక్కిన యాదవోత్తములు వాహనము
లెక్కి సంభ్రమమున నేతేరఁ బురము
నేగి మద్రేశ్వరు నింటి వాఁకిటికి
నేగి తార్క్ష్యునిడిగ్గి యేణలోచనలు
భద్ర నీరాజనల్పలుమాఱు నొసఁగ
భద్రావిభుండు సుభద్రావిభుండు
కై దండ గావింపఁగా మద్రసుతులు
పాదమజ్జనము నర్పఁగ నేగుదెంచి
కాంత రత్నోజ్జ్వల కల్యాణమంట
పాంతరంబుననిల్చెనంత నారాజు
హరిని గాంచనపీఠి నాసీనుఁ జేసి
చరణపంకజములు జలజంబులార్చి
మధుర మంత్ర స్వర మంత్రస్వరముగ
మధుపర్క మొసఁగి ప్రేమంబుతోమున్ను
కై సేసియున్న లక్షణను లక్షణను
భాసుర సంఫుల్ల పంకజేక్షణను
జెలువలుదోతేరఁ జెలువమేపారఁ
గలహంసగతుల నక్కన్యయే తేర
నా సమయంబున యజుఁడుఁ గాయజుఁడు
భాసిల్లఁగాఁ దెర వట్టిరవ్విభుఁడు
వోనరంగ నాగమప్రోక్త మార్గమునఁ
దనయను వసుదేవతనయున కొసఁగె
దేవకామినులు భూదేవకామినులు
భావజగురుపెండ్లి పాట పాడఁగను
వనజలోచనలు సౌవర్ణపాత్రికలఁ
గనుపట్టునెడకుడు కలునేసఁబ్రాలు

సవరింప మంగళాష్టకములు చదివి
రవళిమీఱంగ ముహూర్తంబనిచెంత
గురుఁడు వచింపనిక్కుచుఁ బంచబాణ
గురుఁడు లక్షణయును గుడజీరకముల
నొండొరు శిరముల నునిచి నెమ్మోము
లొండొరు వీక్షించి యుత్కటప్రేమఁ
దనదు కటాక్ష సుధాబిందుజాల
మననొప్పు తెలిముత్తియముల దోయిటను
బలసోదరుఁడు ముంచి పట్టిచేముంచి
తలఁబ్రాలునింప దాత్పర్యంబు మెఱసి
కంకణంబులదండ గలియనొండురులు
కంకణంబులు పొందుగాఁ గట్టిరంతఁ
కల్యాణ చేలుండు కల్యాణిఁ గూడి
కల్యాణ వేదిపై ఘనరత్నపీఠి
నాసీనుఁ డగుచు హోమాది కృత్యములు
సేసి యాశీర్వాద శ్రీలఁ బెంపొందఁ
దళుకుఁ జూపులు బేడసలు జాడసలుపు
తళుకుఁగన్ను విరిదమ్మిమోములును
వీగిన నెఱికప్పు వేనలు రెదురు
గాఁ గీలుకొనినకర్కశేఁపు పాలిండ్లు
గలకలకంఠులు కలధౌతపాత్ర
ములను నీరాజనమును సమర్పింప
హరి యిట్లు లక్షణ నతివైభవముఁ
బరిణయంబై యాత్మఁ పరిణామమొదవఁ
దదనంతరమున శాస్త్రప్రకారమునఁ
దుదలేని యర్థి చతుర్థిఁ గావించి
వీడునఁగల బంధువితతి సంతసము

పీఁటఁజోడారంగ పీఁటలువెట్టి
మతినుబ్బియల పితామహా మహాదేవ
దివిజారి నాథారి దేవతావరుల

సురుచిరాంశుక ఘనాంశుకములతోడఁ
గరమర్థివేర్వేఱ కట్నముల్జదువ
హరియుదానందఱ కన్నిలాగులను
వర భూషణాదుల వరుసతోనొసఁగి
భూసురాశీర్వాదములఁ జెందివారి
భాసుర కాంచనవ్రతతులఁ దనిపి
వందిత జనులకు వంది మాగధుల
కందందవేడ్క నిష్టార్థంబు లొసఁగి
యలరుచువీరు వారనక సంపదలు
వలసినవారికి వలసినట్లిచ్చి

లక్షణతో భవ్యలక్షణ వేళ
లక్షణానాథుఁ డుల్లమున సొంపొదవ
విబుధులతో ధరావిబుధులతోడ
సబలులైనట్టి రాజన్యులతోడ
నగధరుండర్థేశుఁ డనుపంగ నాత్మ
నగరప్రవేశమున్నతిఁ జేసియపుడు
దేవకీవిభునకు దేవకీసతికి
దేవతీసపతికెంతే వేడ్క మ్రొక్కి
రేవతీవిభునకు రేవతీదేవి
నావలవరుసతో సభినుతుండయ్యు

నామద్రసుతయుఁ దానత్తమామలకు
రామునకా బలరాము దేవికిని
సవతులైనట్టి యాసవతుల కెలమి

నవిరళభక్తిమై నభినుతులొనసె
నప్పుడు పద్మ పద్మాయతనేత్రుఁ
డప్పద్మభవు శివు నమరేంద్రముఖుల
గారవంబున శుభాగతులైన యట్టి
వారిఁ గృపామృతా వారినోలార్చి
మదవతీకుల శిరోమణి రుక్మిణికిని
వదనేందు సౌభాగ్యవతి జాంబవతిని

నమిత గుణస్థేమయగు సత్యభామఁ
గమల శోభనగాత్రి కమలాప్తుపుత్రి
నమితశోభనవిందయగు మిత్రవింద
నమరజాలస్తుత్యయైనట్టి సత్యఁ
బ్రకట లావణ్యసంపద్భద్ర భద్ర
సకలకల్యాణ లక్షణను లక్షణను
గనుఁ గొని యంతరంగమునఁ బ్రేమంబు
ననలొత్తఁ దన్మోహనతఁ జూచి పలికె
నిప్పడంతులకొప్పు లింద్రనీలముల
కుప్పలో యొప్పుల కుప్పలో యనుచుఁ

గొమ్మల నేత్రములో కమల జలచ
రమ్ములో వరచకోరమ్ములో యనుచుఁ
బ్రవిమలాంగుల యధరములంబరాగ
లవములో బాల పల్లవములో యనుచు
పొలతులమాట లబ్బురమైన చిలుక
పలుకులో కప్రంపుఁ బలుకులో యనుచు
నంబుజాననల సొంపారుగళములు
కంబులో తజ్జన కంబులో యనుచుఁ
గువమాతులగుచన్ను గుబ్బలు గిరుల
కవలొక్రొమెఱుఁగు జక్కవలో యటంచు

ఊరుపయోధరులూరు లున్నతకుంభి
కరములో మోహనా కరములో యనుచు
సమ్మౌనినుల మించులైన పాదములు
తమ్ములోకూర్మ మొత్తమ్ములోయనుచు
నీరీతిఁ గొనియాడి యిందిరావిభుఁడు
వారితోవేడ్కఁ గై వారసందంద
వారితపంచాస్త్ర వరకేళిఁ దేలి
వారిజాసన దేవవరముఖుల్గొలువ
నిచ్చకల్యాణముల్నెరయంగనింటఁ
బచ్చతోరణములు భాసిల్లుచుండ

సారూఢి లోకారాధ్యుఁ డగుచు
ద్వారకానగరి నెంతయువేడ్కనుండె
ఈ కృష్ణచరితంబు నెవ్వరు విన్న
వ్రాసుచ్చి తలఁచినవారి కెల్లపుడు
చిరతరాయువులును జింతితార్థములు
సిరియుఁ గృష్ణుని కృప జెందుదురనఘ
అని యోగిజనపాలుఁ డాజనపాలుఁ
డనుమోదమంద నిట్లనియానతిచ్చె
అని సుధాపాణికి నబ్జపాణికిని
వనజాస్త్రమాతకు వనధిజాతకును

ననుగన్నతల్లి కనభ్రమభల్లికిని
కనకగాత్రికిని ప్రకామ దాత్రికిని
వాణీశనుతకు సువ్రతకక్షి విచల
ద్వేణికి శ్రీవేంకటేశు రాణికిని
సారసగేహకుఁ జారుబాహుకును
సారలావణ్యకు సకలగణ్యకును
బరమకల్యాణికి భ్రమరవేణికిని

దరుణేందుఫాల కుదారశీలకును
రామాభిరామ కప్రతిమధామకును
హైమసంవ్యానకు హంసయానకును

(నిజకావ్యసమర్పణము. కవివంశకావ్యప్రశంస. గ్రంథనిగమనము.)

నింద్రభావితకు గజేంద్రసేవితకుఁ
జంద్రికాహాసకుఁ జారునాసకును
నగసుతానుతకుఁ బన్నగతల్పయుతకు
మృగమదాంగకు నలమేలుమంగకను
నంకితంబుగను శ్రీహరిభక్త నికర
పంకజార్యమ తాళ్లపాకాన్నమార్య
తనయ తిమ్మార్య నందన రత్నశుంభ
దనుపమ శ్రీవేంకటాద్రీశ దత్త
మకర కుండల యుగ్మ మండితకర్ణ
సుకవి జీవంజీవ సోమరాజీవ
సదనావధూ లబ్ధ సరసకవిత్వ
విదితమానన తిరువేంగళనాథ
విరచితంబగు ప్రతిద్విపద సంశ్రవణ
తరళిత విబుధ మస్త ప్రణీతోరు
మనసిజ జనకాష్ట మహిషీవివాహ
మను కావ్యమునఁ బంచమాశ్వాసమయ్యె.

---

అష్టమహిషీకళ్యాణ ద్విపదకావ్యము సమాప్తము.



# అష్టమహిషీ కల్యాణ ప్రతిపాదిత సుప్రసిద్ధ పదానుక్రమణిక.

| | | | |
|---|---|---|---|
| వి | = విశేషణము. | రా | = రాక్షస. |
| ఉ | = ఉపమానము. | భూ | = భూపతి. |
| దే | = దేశము. | య | = యక్ష. |
| ఆ | = ఆచార్య. | ప్ర | = ప్రధాననగరము. |


| పద. | పుటసంఖ్య. | పద. | పుటసంఖ్య. |
|---|---|---|---|
| అంకిత (గ్రంథసమర్పణము) | 8 | అంజలి | 177, 235 |
| అంకుశగతి వి. | 136 | అంతరంగ | 178 |
| అంకోలవృక్ష | 217 | అంతర్ధాన | 79 |
| అంగజకేళి | 252 | అంధక భూ. | 276 |
| అంగజగురు వి. | 209 | అంబరవర్ణ వి. | 83 |
| అంగజతాప | 127 | అంబికావనము | 115 |
| అంగద (ఆభరణము) | 184 | అంబుజానన ఉ. | 152 |
| అంగబంధుర | 108 | అంబుజోదర వి. | 30 |
| అంగరాజ=జరాసంధ | 195 | అంబుధిఘూర్ణన | 260 |
| అంగహార | 109 | అంబురుహాక్షుపత్ని వి. | 171 |
| అంగుళీయక | 185 | అంభోరాశిజాత వి. | 60 |
| అంచితగతి | 107, 115 | అకలంక వి. | 225 |
| అంచితహేమవర్ణ వి. | 127 | అకలంకగుణ వి. | 9 |

| పద. | పుటసంఖ్య. | పద. | పుటసంఖ్య. |
|---|---|---|---|
| అకలంక సింహాసన | 254 | అతివైభవ | 115 |
| అకాలపాశ | 139 | అతిసౌరభ | 238 |
| అక్కాంబ | 4 | అతులలగ్న | 211 |
| అక్రూర | 118, 124, 194 | అతులవైభవ | 169 |
| అఖిలకల్యాణి వి. | 1 | అతులశోభనవతి వి. | 261 |
| అఖిలనింద | 234 | అతులయౌవనసీమ | 234 |
| అఖిలభూనాధు | 214 | అతులితగ్రహ | 211 |
| అఖిలభూసుర | 85 | అతులితభక్తి | 71 |
| అఖిలైకమాత వి. | 209 | అతులితలోహ | 92 |
| అఖిలైకరాజ వి. | 190 | అదుష్టరక్షణ | 13 |
| అఖిలోపచార | 124 | అధరకోమలపల్లవ | 90 |
| అగణితాలంకృతి | 258 | అధరబింబ | 238 |
| అగ్నికోటి | 47 | అధరమాధుర్య | 155 |
| అచ్ఛభల్ల=జాంబవాన్ | 222 | అధరామృత | 211 |
| అచ్ఛర=అప్సరస్సు | 209 | అర్ధచంద్రాకృతి | 44 |
| అజరాణి | 257 | అర్ధేందుఫాల వి. | 1 |
| అజ్ఞానపటలి | 74 | అనంగమర్మకళా | 100 |
| అట్టహాస | 57 | అనంతాదినిత్య | 278 |
| అతనుపాశ | 91 | అనఘశరణ్యా వి. | 227 |
| అత్యాదర | 246 | అనఘామృతాపాంగ వి. | 127 |
| అతికాయ రా. | 56 | అనంతాంబ | 4 |
| అతితీవ్రగతి | 120 | అనలరోమ రా. | 56 |
| అతినీలఘన | 106 | అనలసన్నిభ వి. | 94 |
| అతిభయావహ | 235 | అన్నమాచార్య ఆ. | 4 |
| అతిమోదవివాహ | 229 | అన్నమాచార్యభార్య (అక్కాంబ) | 4 |
| అతిమనోహరలీల | 94 | అన్నమాచార్యభార్య (తిమ్మాంబ) | 4 |

## సుప్రసిద్ధ పదానుక్రమణిక


| పద. | పుటసంఖ్య. | పద. | పుటసంఖ్య. |
|---|---|---|---|
| అన్యాపదేశ | 152 | అపాంగచంద్రికా | 262 |
| అనిమిషాధిపముఖ్య | 119 | అబ్జదళాక్షి వి. | 225 |
| అనిమిషానంద | 20 | అబ్జపాణి వి. | 58 |
| అనిమిషోత్తమ | 266 | అభినవామోద వి. | 1 |
| అనుకూలధవ | 267 | అభిమన్యుసుత | 9 |
| అనుకూలవర | 258 | అభిమానవతీ వి. | 114 |
| అనుతాప | 142 | అభిరామమూర్తి వి. | 171 |
| అనుపమకాలదండ | 139 | అబ్ధికన్యకాధవ | 229 |
| అనుపమనుతధామ వి. | 227 | అబ్ధికన్యాపతి | 260 |
| అనుపమమణిమంటప | 184 | అభీష్టభోగ | 266 |
| అనుపమసకలాయుధ | 207 | అభీష్టవస్తు | 23 |
| అనుపమాయతదేహ వి. | 255 | అభేద్యధర్మ | 55 |
| అనుపమాయతవేణి వి. | 1 | అభేద్యశరధి | 162 |
| అనుపమలగ్న | 17 | అభ్రమణిపుత్రికా=యమునా | 248 |
| అనుపమశీల వి. | 127 | అమరజాలస్తుత్య వి. | 282 |
| అనుపమహరిభక్తి | 121 | అమరాంతక రా. | 56 |
| అనుమాన | 19 | అమరారికులహారి వి. | 234 |
| అనురాగ | 174 | అమరేంద్రకోదండ | 274 |
| అనురాగవల్లి | 99, 178 | అమరేంద్రసుత | 245 |
| అన్నమార్య (కవిపితామహ) | 59 | అమలకారండవ | 238 |
| అపకీర్తి | 19 | అమలనేత్రాంత | 116 |
| అపరంజి | 84 | అమలబాహాదండ | 106 |
| అపరిమితానంద | 228 | అమలమధ్య | 210 |
| అప్పలార్య ఆ. | 4 | అమలమాణిక్యసింహాసన | 184 |
| అప్రతిమధామ వి. | 58 | అమలసైకత | 73 |
| అప్రతిమానమూర్తి | 64 | అమితబాలాన్విత | 250 |

| పద. | పుటసంఖ్య. |
|---|---|
| అమితవిద్యావేత్త | 148 |
| అమితసౌభాగ్య | 261 |
| అమృత | 219 |
| అమృతకలశ | 219 |
| అమృతాబ్ధిగేహా వి. | 278 |
| అమృతాన్నవర | 236 |
| అమృతదృష్టి | 61 |
| అమృతఫల | 55 |
| అమృతభాషణ వి. | 8 |
| అమృతసంతాన | 88 |
| అయుతధేను | 258 |
| అరవిందగేహా | 108 |
| అరవిందదళనేత్ర వి. | 255 |
| అరవిందమందిరా వి. | 278 |
| అరవిందమిత్ర | 241 |
| అరవిందముఖ వి. | 110 |
| అరవిందలోచన వి. | 73 |
| అరవిందలోచన | 252 |
| అరవిందవాసినీ వి. | 172 |
| అరవిందశర | 251 |
| అరవిందహోమకుండ | 93 |
| అర్ఘ్యపాద్య | 124, 185 |
| అర్థిబృంద | 210 |
| అరిష్టాసుర | 115 |
| అరుణకోమలపాద వి. | 1 |
| అరుణాపత్ర | 200 |

| పద. | పుటసంఖ్య. |
|---|---|
| అరుణపల్లవపాద వి. | 8 |
| అరుణాంశుధామ | 235 |
| అలంకారసహిత | 263 |
| అలకసర్జితభృంగ వి. | 60 |
| అలకభృంగ | 240 |
| అలకాప్తఫాల వి. | 173 |
| అలఘుగుణోత్తుంగ వి. | 171 |
| అలఘుతేజోజ్వాల | 235 |
| అలఘుతేజోమూర్తి వి. | 4 |
| అలఘుభావ | 179 |
| అలఘువిస్మయకర వి. | 162 |
| అలఘుశబ్దార్థ | 8 |
| అలఘుశోభనవతి | 228 |
| అలఘుశోభాకర | 234 |
| అలమేలుమంగ (దేవి) | 7, 60, 127, 171, 284 |
| అల్పమాన | 196 |
| అలికులాలక వి. | 249 |
| అళినాదసామగాన | 93 |
| అవంతీపురి ప్ర. | 148 |
| అవంతీపుర | 250 |
| అవతారకరణ | 188 |
| అవనీరాజకాంత | 210 |
| అవలీల | 137 |
| అవలోకనామృతరస | 105 |
| అవాఙ్మనసగోచర | 155 |

| పద. | పుటసంఖ్య. | పద. | పుటసంఖ్య. |
|---|---|---|---|
| అవిరళగతి | 108 | ఆగమగణ్యా వి. | 5 |
| అవివేకచిత్త | 179 | ఆగమధర్మసరణి | 172 |
| అశరీరివాక్ | 14 | ఆగమవిధి | 229 |
| అసమశరణ్యా వి. | 214 | ఆజానుబాహూ వి. | 152, 255 |
| అసమసాయక | 254 | ఆజ్య (ఘృత) | 77 |
| అసమానలావణ్యా వి. | 214 | ఆతపత్రద్వంద్వ | 190 |
| అసహాయశూర వి. | 190 | ఆత్మకంకణ | 181 |
| అస్త్రశస్త్ర | 25 | ఆత్మగేహ | 37 |
| అసురగణ | 1?8 | ఆత్మబంధు | 105 |
| అసురగాలి | 27 | ఆత్మీయగుహ | 219 |
| అష్టభాషాచక్రవర్తిః వి. | 5 | ఆత్మేశ | 178 |
| అష్టమహిషీవివాహ | 59 | ఆదివిష్ణుమూర్తి | 151 |
| అష్టమపట్టమహిషీ వివాహ | 267 | ఆననచంద్రసేవా | 262 |
| అక్షత-హారితతండుల | 210 | ఆననజితసోమ వి. | 227 |
| అక్షీణమూర్తి | 38 | ఆనకదుందుభి | 18 |
| అక్షౌహిణీ | 159 | ఆనందపాథోధి | 155 |
| అహిరాజ (ఆదిశేష) | 12 | ఆనందబాష్ప | 70, 145 |
| అహివైరికేతన వి. | 278 | ఆనందితాత్మ | 65 |
| అహిశాయి | 247 | ఆనీలధమ్మిల్ల | 272 |
| అక్షీణబల | 276 | ఆపన్నశరణ్యా | 182 |
| అక్షీణశుభమూర్తి వి. | 267 | ఆపాదతల | 47 |
| ఆంధ్రవేదాంత | 4 | ఆపాదమస్త | 72 |
| ఆకర్ణయుగ | 272 | ఆబాలగోపాల | 39 |
| ఆకాశనాథ | 76 | ఆభీరనాయక | 44 |
| ఆకాశబాణ | 263 | ఆభీరశిశు | 51 |
| ఆకీర్ణభుజజాల వి. | 127 | ఆయతమార్గణ | 200 |

| పద. | పుటసంఖ్య. |
|---|---|
| ఆయుష్య | 232 |
| ఆరామతతి | 163 |
| ఆరామయజ్ఞవాట | 93 |
| ఆరూఢకోదండ | 243 |
| ఆరూఢయావన వి. | 174 |
| ఆరోహావరోహస్వర | 88 |
| ఆలవాల | 29 |
| ఆలోలగతి | 136 |
| ఆలోలాంగుళిపల్లవ | 106 |
| ఆళువారు (ఆళ్వార్=పరమయోగి) | 3 |
| ఆశ్చర్యచర్య | 54 |
| ఆశీర్వాద | 193, 210, 280, 281 |
| ఆశ్వలాయనసూత్ర | 3 |
| ఆశ్రితకామపాల వి. | 60 |
| ఆసముద్ర | 92 |
| ఆహవచిత్రకేళి | 200 |
| ఆహవస్థల | 195 |
| ఆహవక్షోణి | 196 |
| ఇందిరాకాంత | 121 |
| ఇందిరాపతి | 267 |
| ఇందిరానాథ | 215 |
| ఇందిరావిభు | 254 |
| ఇందిరావిభు | 194 |
| ఇంద్రనీలజాల | 163 |
| ఇంద్రనీలశైల | 233 |
| ఇంద్రభావిత వి. | 59 |
| ఇంద్రాణి | 208 |
| ఇంద్రాదిసుర | 29 |
| ఇందుకాంతి | 89 |
| ఇందుశేఖర | 29 |
| ఇతరభాషా | 6 |
| ఇభయానరుక్మిణి | 208 |
| ఇష్టదాయిని వి. | 8 |
| ఇష్టభోగ | 172, 211 |
| ఇష్టాన్న | 150 |
| ఇష్టార్థ | 210 |
| ఇక్షుచాప | 262 |
| ఇక్ష్వాకువంశభవ వి. | 171 |
| ఉగ్రభాను | 47 |
| ఉగ్రసేన భూ. | 143 |
| ఉడుగణ | 58 |
| ఉడురాజు | 58 |
| ఉడురాజపూర్ణతను వి. | 235 |
| ఉడురాజబింబాస్య వి. | 114 |
| ఉడుసంభ్రమ | 62 |
| ఉత్తమతురంగ | 168 |
| ఉత్తమాన్న | 47, 74 |
| ఉత్తమహాయ | 235 |
| ఉత్పలదళవిలోచన | 215 |
| ఉత్పలబాణమంత్రోపదేశ | 131 |
| ఉత్పాత | 41 |
| ఉత్పాతభార | 275 |

